





ముఖచిత్రం · కాటుక కంటినీరు

చిత్రకారుడు వడ్డాది పాపయ్య

# చిత్ర వార్తలు



**1981 శ్రీ రాజాలక్ష్మి ఫౌండేషన్ అవార్డు ప్రదానం**

మద్రాసులో నవంబరు 19, 1981న అవార్డు గ్రహీత డా. వేంపటి చినసత్యంకు
పదివేల రూపాయల చెక్కును అందిస్తున్న సంస్థ వ్యవస్థాపకులు,
శ్రీ పి. వి. రమణయ్యరాజా



అవార్డు గ్రహీత డా. నేరెళ్ల వేణుమాధవ్‌కి పదివేల రూపాయల చెక్కును
అందిస్తున్న శ్రీ పి. వి. రమణయ్యరాజా



# 1981

## చక్రపాణి అవార్డు గ్రహీతల పరిచయాలు

### నవలలు :

### మొదటి అవార్డు

### 'కవిత'

అసలు పేరు ఇచ్ఛాపురపు కుసుమకుమారి. జననం 1946 లో శ్రీకాకుళంలో. బి.యస్సీ వరకూ చదివిన వీరు ప్రస్తుతం భర్త ఉద్యోగరీత్యా అనకాపల్లిలో ఉంటున్నారు. గతంలో కొన్ని పత్రికల పోటీలలో నవలలకూ, కథలకూ బహుమతులు గెల్చుకున్నారు. పోటీల్లో పాల్గొనటం వీరికి ప్రత్యేకమైన సరదా. ఇంతవరకూ వీరు వ్రాసిన నాలుగు నవలలు పుస్తకరూపంలో వచ్చాయి.

### రెండవ అవార్డు

### గంగుల నరసింహారెడ్డి



వయస్సు రెండు పదుల మీద మూడు సంవత్సరాలు మాత్రమే. మహబూబ్‌నగర్ జిల్లా వెదిరేపల్లిలో జన్మించిన వీరు, ప్రస్తుతం ఉస్మానియా యూనివర్సిటీ జర్నలిజం విద్యార్థిగా ఉన్నారు. 'ఈ సూర్యుడు అస్తమించడు' అన్న వీరి తొలి నవలకు 1979 చక్రపాణి మూడో అవార్డు లభించింది. రెండు పదుల మేరకు వివిధ పత్రికల్లో కథలు వ్రాశారు.



మూడవ అవార్డు

మాన్యం అమ్మాపిల్ల శ్రీకుమారి

జననం 1955లో తూర్పుగోదావరి జిల్లా తునిలో. భర్త వ్యాపార రీత్యా ప్రస్తుతం కొత్తవలసలో నివాసం. చదువు స్కూలు ఫైనల్ వరకే. పరిమితమైనా కథలు చిన్నప్పట్నుంచే వ్రాయడం మొదలెట్టారు. జీవిత భ్రమణం విసిరిన బంధం మొ॥ నవలలు పావిపిల్ల నాటకం, కొన్ని కథలు వ్రాశారు. కాలక్షేపం కోసం ఓ కాన్వెంట్ స్కూలును నడుపుతున్నారు.



## కథలు :

మొదటి అవార్డు

వల్లూరు శివప్రసాద్

తెనాలి తాలూకా కొలకలూరులో 28 సంవత్సరాల క్రితం జన్మించిన వీరు బి. ఎస్సి చదివి, ప్రస్తుతం 'గవర్నమెంట్ లెప్రసీ కంట్రోల్ యూనిట్'. కావలిలో ఉద్యోగిగా బిట్రగుంటలో ఉంటున్నారు. ఇంతవరకూ వ్రాసిన తొమ్మిది కథల్లో అయిదు కథలకు వివిధ పత్రికల్లో వివిధ బహుమతులు గెల్చుకోవడం విశేషం. నాలుగు నాటికలు, ఒక నాటకంతో పాటు 'రేపటి పౌరులు' అనే నవల కూడా వ్రాశారు.

## రెండవ అవార్డు సింహ ప్రసాద్

'అల్పమానవుడు' అనే కథకు రెండో అవార్డు పొందిన శ్రీ సింహ ప్రసాద్ (కర్నూలు)- గారి జీవిత విశేషాలు ఫొటో మాకు చేరని కారణంగా ప్రచురించలేకపోతున్నాం.



## మూడవ అవార్డు

## ఆదూరి వెంకటసీతారామమూర్తి

జననం పొందూరులో, 1947లో. డిగ్రీ తీసుకొని, విశాఖ పోర్టుట్రస్టు, అకౌంట్స్ విభాగంలో ఉద్యోగిగా ఉంటున్నారు. 'రాగవీచికలు' నవలతోపాటు వంద కథల దాకా వ్రాశారు. 'విశాఖ సాహితికి' సంయుక్త కార్యదర్శి అయిన వీరు సాహితీ సంస్థలకంటె సాహితీ మిత్రులంటేనే ఎక్కువ అభిమానమని తెలియజేస్తున్నారు.

## నాలుగవ అవార్డు

## సామవేదుల. గీతారాణి



విశాఖలో జన్మించి, విజయనగరంలో నివసిస్తున్న వీరి వయస్సు 20 సంవత్సరాలు. మెట్రిక్ ప్యాసయ్యారు. ఈపాటి వయస్సుకే వంద కథలూ, కొన్ని నవలలూ, నాటికలూ వ్రాయడం; అవి విడిగానూ, వివిధ పత్రికల్లోనూ ప్రచురణ కావడం గమనార్హమైన విషయం.

# జనవరి నెల యువ

# భావ పరిచయ పోటీ

## బహుమానము రూ. 25-00



ఈ కార్టూనుకు హాస్యయుత వ్యాఖ్య ( Caption ) కావాలి.

*గమనిక :* వ్యాఖ్యలు పోస్టుకార్డుపై వ్రాసి జనవరి 23 వ తేదీలోగా పంపవలెను.

# యువ

సచిత్ర మాసపత్రిక

సంస్థాపకులు : చక్రపాణి

సంపుటి 45 జనవరి 1982 సంచిక 1


ఒక మనిషి మరో మనిషి దగ్గర అప్పు చేశాడంటే—తాత్కాలిక అవసరాన్ని ఆదుకోవడానికైనా అయివుంటుంది; పాత అప్పుల్ని తీర్చడానికైనా అయివుంటుంది; ఆర్థిక పరిస్థితిని మెరుగుపర్చుకోడానికైనా అయివుంటుంది. హాబీకోసం ఎవరూ అప్పుచేయరు. ఈ మానవ నైజం దేశాల విషయంలో కూడా వర్తిస్తుంది. అభివృద్ధి దేశాల అర్థశాస్త్ర సూత్రాల దృష్ట్యా అభివృద్ధి చెందుతున్న దేశాలు అప్పుచేయడం అనివార్యమని చెప్పవచ్చు. అయితే నవంబరు 1981 లో మన దేశం అంతర్జాతీయ ద్రవ్యసంస్థ నుంచి పొందిన ఋణం మాత్రం అటు ఆ సంస్థ చరిత్రలోనూ, ఇటు మన దేశ చరిత్రలోనూ అసాధారణమైన సంఘటనగా అభివర్ణించవచ్చు. ఇంత భారీ మొత్తంలో ఏ దేశానికీ ఆ సంస్థ ఋణాన్ని మంజూరు చేయలేదు. మన దేశం కూడా ఇంత పెద్దమొత్తంలో ఒక్కసారి అప్పుకోసం అర్జీపెట్టుకోలేదు. విదేశీ చెల్లింపుల సంక్షోభం నుంచి బయటపడేందుకు, విదేశీ మారకం విల్వల పరిస్థితిని చక్కబెట్టుకొనేందుకు మన దేశానికి అంతర్జాతీయ ద్రవ్య సంస్థ ఇటీవల రూ. 5,000 కోట్ల మేరకు ఎస్. డి. ఆర్. (స్పెషల్ డ్రాయింగ్ రైట్స్) ఋణాన్ని మంజూరు చేసింది. అందులో రూ. 900 కోట్ల ఋణం ఈ సంవత్సరం,

రూ. 1,800 కోట్ల ఋణం తరువాతి సంవత్సరంలో, మిగతా రూ. 2,300 కోట్ల ఋణం ఆ పై సంవత్సరంలో భారతదేశానికి లభించగలవు. అయితే రెండు, మూడు వాయిదాలుగా లభించే ఋణం అంతర్జాతీయ ద్రవ్య సంస్థకు అప్పుతీసుకొనే సందర్భంలో మన దేశం ఇచ్చిన వాగ్దానాల నిర్వాకం మీద ఆధారపడి వుంటుందని ప్రత్యేకంగా చెప్పనక్కర్లేదు ఆ వాగ్దానాలను, షరతులను, మన దేశం సక్రమంగా, సంతృప్తిగా నెరవేరిస్తే, సంస్థ అధ్యయన బృందంవారు సమీక్షించిన మీదట మిగతా వాయిదాల మొత్తాన్ని విడుదల చేయడం జరుగుతుంది.

అంతర్జాతీయ ద్రవ్య సంస్థ (International Monetary Fund) నుంచి అంత పెద్ద మొత్తంలో అప్పును సాధించడం ఒక రకంగా ఇందిరా కాంగ్రెస్ ప్రభుత్వం ఘన విజయాన్ని పొందినా, ఆ ఘన విజయం ప్రతిపక్షాల విమర్శలకు, అర్థశాస్త్రవేత్తల వ్యాఖ్యానాలకు గురికాక తప్పలేదని చెప్పవచ్చు. "భారతదేశపు రాజధాని ఢిల్లీనుంచి వాషింగ్టన్‌కు మార్చబడింది" అని ఒకరూ; "మన దేశపు ఆర్థిక స్వేచ్ఛకు ఈ ఋణం సంకెళ్లు వేసింది" అని మరొకరూ; "మన ప్రభుత్వం దేశాన్ని తాకట్టుపెట్టి అత్యధిక మొత్తంలో అప్పు తెచ్చుకుంది" అని ఇంకొకరూ వ్యాఖ్యానించడమైంది. మన దేశంలో వున్న పత్రికలూ, అంతర్జాతీయ ఖ్యాతి గల 'టైమ్' 'న్యూస్ వీక్' 'న్యూయార్క్ టైమ్స్' లాంటి పత్రికలూ ఈ గొప్ప ఋణంవల్ల ఏర్పడే పరిణామాన్ని ఈస్ట్‌మన్ కలర్‌లో ఎత్తిచూపాయి. అయితే మన కేంద్ర ఆర్థిక మంత్రి శ్రీ వెంకట్రామన్ మాత్రం "మన జాతీయ విధానాలకు వ్యతిరేకంగా ఈ ఋణానికి ఎలాంటి షరతులనూ భారతదేశం లొంగలేదు" అని ప్రకటన ద్వారా తెలియజేశాడు. మన కేంద్ర ఆర్థిక మంత్రి ప్రకటన కాటుక కంటినీరు తుడిచేదిగా వున్నదని చాలామంది అభిప్రాయపడ్డారు అంతర్జాతీయ ద్రవ్య సంస్థకు ప్రైవేటు రంగానికి ప్రాముఖ్యం ఇవ్వడంపైనా, ప్రైవేటు వ్యక్తులు విదేశీ పెట్టుబడులు పెట్టడంపైనా, బహుళ జాతీయ సంస్థల విస్తరణ పట్లా, దిగుమతుల మీద ఆంక్షల సడలింపు పట్లా విశేషమైన విశ్వాసముంది. ఈ విశ్వాసాలకు మన జాతీయ విధానాలకు అంతగా పొత్తులేదు. ఈ విషయమై మన ప్రతిపక్ష నాయకులు, అర్థశాస్త్రజ్ఞులు, మేధావి వర్గం ఆందోళన వ్యక్తం పర్చడం జరుగుతూన్నది.

అంతర్జాతీయ ద్రవ్యసంస్థ నుంచి మనం కొత్తగా ఋణాన్ని పొందడం లేదు. 1957 నుంచి 1980 లోపల మన దేశం దాదాపు 2,000 మిలియన్ల S. D. R. ఋణాలను వివిధ అవసరాల నిమిత్తం పొందింది (ఒక్కొక్క S. D. R.=రూ. 10). అభివృద్ధి చెందిన, చెందుతూన్న దేశాలు ఆ సంస్థ నుంచి ఋణాలు పొందడంలో ఆశ్చర్యంలేదు. 144 దేశాలు సభ్యులుగా ఉన్న ఆ సంస్థనుంచి గ్రేట్ బ్రిటన్, జమైకా, జపాన్, లైబీరియా, టాంజానియా, శ్రీలంక, ఇటలీ మొదలైన దేశాలెన్నో అప్పులు తీసుకున్నాయి. ఈ భారీ ఋణాన్ని సద్వినియోగం చేసుకోవడంలో మన ప్రభుత్వం పలు జాగ్రత్తలు తీసుకోవాల్సి ఉంది. ధరల పెరుగుదల రేటు ఎక్కువ కాకుండా చూడాలి. వ్యావసాయిక, పారిశ్రామికోత్పత్తులు అధిక మయ్యేట్టు ప్రయత్నించాలి. ఎగుమతుల్ని పెంచుకోవాలి. అర్థిక వ్యవస్థ ఆరోగ్యానికి అన్ని విధాలా చర్యలు తీసుకోవాలి. ఋణంమొత్తాన్ని ఉత్పాదక ప్రయోజనాలకు ఉపయోగించి, ఆర్థిక వ్యవస్థ సర్వతోముఖాభివృద్ధికి అకుంఠిత దీక్షతో పాటుపడినప్పుడు అధిక మొత్తంలో చేసిన అప్పును సమర్థించడానికి అవకాశ మేర్పడగలదు.

---

నవంబరు నెల యువ భావ పరిచయ పోటీ

రు. 25–00 బహుమతి పొందిన వ్యాఖ్య

"నేల మీద జైలుశిక్ష
వింగియె శ్రీరామరక్ష"

— కె. సుధాకరరావు, అదోని.

# జరుగుతున్న చరిత్ర

మానవజాతి సమకూర్చుకోగల మహా సంపదలో సహస్రాంశం ఇప్పటికీ లభించలేదు. పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ, నిర్మాణయుక్తంగా, ఐక్యరాజ్యసమితిని వినియోగించుకుంటూ, పెద్ద-చిన్న రాజ్యాలన్నీ కలిసికట్టుగా కృషిచేయడమే తరువాయి. అప్పుడే మనం పురోగమించినట్లు గుర్తు.

కాని జరుగుతున్న దేమిటి? మనం సంపాదించుకున్న గోచిపాతంత సంపదను సంరక్షించుకోవడానికి పెద్ద ఆర్భాటాలు, జగడాలు! లోకంనిండా గోచిపాత రాయుళ్ళు, మన కింతవరకు దొరికింది గోచిపాత, దాని రక్షణకై మారణాయుధాలతో చెలగాటం! ఇదీ వరస.

అమెరికన్ కాపిటలిజం, స్వీడిష్-ఆస్ట్రియన్ మాడల్ డెమాక్రటిక్ సోషలిజం, రష్యన్ మాడల్ కమ్యూనిజం, చైనా మాడల్ కమ్యూనిజం, యుగోస్లావియా-రుమేనియాల ఎర్రటి మాడల్స్, జపాన్ మిశ్రమం, బ్రిటిష్ - జర్మన్ మాడల్ మిశ్రమం, తృతీయ ప్రపంచపు రకరకాల మిశ్రమాలు, నియంతృత్వాలు, ప్రజాస్వామిక వేషధారణలు, ఇంకా అనేక రకాలైన కలయికలు- ఇవన్నీ కలిసి ఈ ప్రపంచంలో సాధించిన దెంత? అందులో ఎవరి భాగా లెంత?

పరమ దారిద్ర్యం - మహాభాగ్యం దేశంలోని ప్రజల మధ్య, విభిన్న తత్వాల దేశదేశాల మధ్య సహజీవనం ఇంకెన్నాళ్ళు? సాటి మానవులారా, ఇది సిగ్గుచేటు కాదా? పైగా ఈ అసంబద్ధమైన సహజీవనాన్ని రక్షించడం కోసం యుద్ధసామగ్రిని సమకూర్చుకుని, కుప్పలుగా పోసుకుని, ఉక్కిరిబిక్కిరై చస్తున్నారా? భావి తరాలవారు మనలను చీదరించుకోరూ?

ఇంత కఠినంగా పలికినందుకు కారణం లేదంటారా? లేకుంటే మన ఎదుట నడిచే అవాక్-చెవాక్ గందరగోళానికి అర్థమేమిటి?

సౌదీ అరబ్బులకు అమెరికన్లు అవాక్‌లు ఇచ్చి, ఇస్రాయిలీ యూదుల చెవాకులను అందుకుంటున్నారు. ఉభయులు అమెరికా మిత్రరాజ్యమండలి వారే. ఐనా, ఉభయుల మధ్య పచ్చిగడ్డి వేస్తే భగ్గుమంటుంది.

మన ప్రాంతానా అదే గదా పరిస్థితి! మనము - మన పొరుగువారు ఇద్దరం

---

మండలి జగన్నాథం

---

అమెరికా బంధుకోటిలోనివారమే (ఇది మనలో మాట). ఐనా, మన పొరుగు వారికి అమెరికా ఇచ్చే F-16 సాధనాలు మనపై వినియోగపడగలవనే భయం కలుగుతున్నది.

ఈ భయానక వ్యవహారం ప్రపంచంలో తనకు పోటీరాజ్యమైన సోవియన్ యూనియన్ (రష్యా) ఎత్తులకు పైఎత్తులు వేయడానికని అమెరికా చేస్తున్నది. ఈ పోటీ రాజ్యాలలో ఎవరు సన్మార్గాన్ని అనుసరిస్తున్నారు, ఎవరు దుర్మార్గంగా సంచరిస్తున్నారు— అనే వివాదం ఇక మనకు అప్రస్తుతం.

పోటీ రాజ్యాలను కట్టడిచేసే పద్ధతిని గూర్చి మన దేశంవంటి రాజ్యాల ముఖ్యులు, మన ప్రధాని వలెనే, అనేక ప్రపంచసీమల వేదికలపై ప్రసంగిస్తున్నారు. ప్రసంగం చాలదని విజ్ఞులంటున్నారు. తృతీయ ప్రపంచ సీమల ఆందోళనకు, ఆవేదనకు ఒక సాంగోపాంగమైన రూపం రావలసివున్నదని వారి అదుర్దా. చూదాం, ఏమవుతుందో?

(అవాక్స్) AWACS — పూర్తి పేరు Airborne Warning and Control System. ఇందులోవి Radar Planes ఎదుటివారి విమానాల తీరుతెన్నులను సూక్ష్మంగా గమనించి ముందుగా తెల్పగల విమానాలు- రష్యా తంత్రాంగాన్ని దృష్టిలో ఉంచుకొని అమెరికా సౌదీ అరేబియాకు ఈ విమానాలను సప్లయి చేయడానికి పూనుకున్నది. తన అభిమాన సీమ అయిన ఇజ్రాయిల్ రాజ్యానికి ముందుగా చెప్పి, వాటిని అమెరికా సౌదీ అరేబియాకు ఇద్దామనుకున్నది. వినీ - వినగానే ఇజ్రాయిల్ నిప్పులు తొక్కింది. కాని ఫలితం శూన్యం. పాలస్తీనా రాజ్య నిర్మాణానికి అంగీకరించి, అమెరికా-రష్యా-అంబ్సీ సీమల సమష్టి గ్యారంటీ ఆధారంపై ఇజ్రాయిల్ తన అస్తిత్వాన్ని నిల్పుకోవలసిందే. గత్యంతరం లేదు అన్లే, చైనా కూడా తైవాన్‌తో తానై రాజీపడి అమెరికాతో పేచీ ఆ విషయంలో మానుకోవడం మంచిదని పరిశీలకుల అభిప్రాయం. ఆ ధోరణిలోనే చైనా అలోచనకు దిగుతున్నదని వినికిడి.)

* * *

ముబారక్ ఏమంటాడు? సాదత్ నాజర్ సాహెబును అనుసరించలేకపోయినాడు. ఇక సాదత్ మార్గాన్నే నూటికి నూరుపాళ్ళు అనుసరించి ముబారక్ మనలేడు. మార్పు రాక తప్పదు. పాలస్తీనా విమోచన శక్తులు, అంబ్సీ సీమలు కోప్పదే విధాన ఈజిప్టు కొత్త నాయకుడు ప్రవర్తించి, ఇజ్రాయిల్ సిసిసి దారికి తేక తప్పదు ఈ పంథాను అనుసరించడానికి తన పూనికను గట్టిగా వెల్లడిచేస్తే అమెరికా అర్థంచేసుకుంటుంది. రష్యా కూడా ఈజిప్టుతో తన వైరుధ్యాన్ని సాగించవలసిన పని వుండకపోవచ్చును.

పోలాండ్ ఆఖరుకు ఏమైపోతుందనే ఆందోళన అత్యధికమైనది. ఇంతలో ఆశారేఖ కనిపించింది. కార్మిక - కర్షక శక్తిలోని అతివాదులు తగ్గివస్తే, ఆ శక్తిపట్ల నడిపే వ్యవహారంలో మరీ కఠినంగా ఉండనక్కరలేదని పోలిష్ కమ్యూనిస్ట్ పార్టీకి సోవియట్ యూనియన్ సంజ్ఞచేస్తే, నూటికి తొంభై మంది పోలిష్ ప్రజలు నేటికీ ఆదరించే కాథలిక్ మత గురువులు సహకరిస్తే పరిస్థితి ఆ సీమలో కుదటపడవచ్చునని పోలిష్ ప్రజల హితైషులు ఆశించారు.

తాజా వార్తలను పరిశీలించగా, వారికి ఆశాభంగం కలగదని తోస్తుంది. చూదాం, పర్యవసానం ఏ విధంగా వుంటుందో!

* * *

యుద్ధ సామగ్రిని తగ్గించుకుందామని అనుకుంటూ హెచ్చించుకుంటూ, ఒకర్నొకరు అపనమ్మకంతో చూచుకుంటూ రెండు పెద్ద పోటీ రాజ్యాలు సాగించే నడక భయంకరమైన పరిణామానికి దారితీస్తుందని భయపడి యూరప్‌లో ప్రజానీకం వైపు నుంచి పెద్దయెత్తున శాంతి ప్రదర్శనలు జరిగినవి. ఈ మేల్కొల్పు పోటీరాజ్యాలకు జ్ఞానోదయాన్ని కలిగించగలదని ఆశింతాం.

అమెరికాలో రీగాన్ హయాం వచ్చిన తర్వాత, పరిమితంగా న్యూక్లియర్ సంఘర్షణ జరిగినా, మహా భయంకరంగా వుండదనే భావం, న్యూట్రాన్ బాంబు తయారై ప్రయోగంలోకి కొంత వరకు వచ్చినా ప్రపంచం సర్వనాశనమైపోదనే ధోరణి ప్రబలినవి. ఇందువలన రష్యన్ ప్రజలలో కలవరం కలిగింది. మొదట – యుద్ధపు వికటాట్టహాసాన్ని వారు విపరీతంగా అనుభవించారు! – తత్ఫలితంగా రష్యా నాయకులు తీవ్రమైన ప్రకటనలతో 'ఇదేమి వైపరీత్యం' అన్నట్లుగా అమెరికా అధ్యక్షుణ్ణి సంబోధించారు. పశ్చిమ యూరప్‌లో పోటీ రాజ్యాలు నిల్పే క్షిపణుల ( missiles ) పరిణామం అత్యంత హానికరమవుతుందనే భయం పశ్చిమ యూరప్ ప్రజలలో ఇంతలో, వ్యాపించింది. ఆ దెబ్బతో ప్రదర్శనలు విజృంభించినవి.

* * *

నిర్యుద్ధ సంధి పాకిస్తాన్‌తో ఇంతకూ మనం చేసుకుందామా వద్దా? అనే మీమాంస విచిత్రంగా వచ్చిపడింది. మొదట పాక్ వైపునుంచి మనకు నెహ్రూ హయాంలోనే ఉమ్మడి రక్షణకై ఒక సూచన వచ్చింది. ఎవరిని ఎదిరించి (Against Whom?) మనం మనలను రక్షించుకోవలెను?—అని వెంటనే మన వైపునుంచి మనం ప్రశ్నించినాము. అదక్కడికి ఐపోయింది. ఆ పిమ్మట మనలో మనకే యుద్ధాలు జరిగినవి.

చివరకు సిమ్లా అగ్రిమెంట్ జరిగింది. ఆ వాతావరణంలో మనకూ పాకిస్తాన్‌కూ మధ్య ఒక నిర్యుద్ధ సంధి జరిగితే బాగా వుండునని అభిప్రాయం కలిగింది. పాకిస్తాన్ విని ఊరుకున్నది. ఇటీవల నిర్యుద్ధ సంధికి సిద్ధమేనని పాక్ నియంత బహిరంగ ప్రకటన పత్రికల ద్వారా వెల్లడించారు. అప్పటికే మనకు అందో ళన కలిగించే యుద్ధసామగ్రిని అమెరికా తనకు సప్లయి చేసే పథకం పూర్త యింది.

అటువంటప్పుడు నిర్యుద్ధసంధి వల్ల వచ్చే ప్రయోజన మేమిటి? అనే సంశ యం మనవారికి సహజంగా కలిగింది. ఐనప్పటికీ, మనం అన్నిటికీ సంసిద్ధమై, సంధికి సరేనని అంటే తప్పేముంది? మనం అంగీకరించడంవల్లనైనా మంచిది -సంధికి విరుద్ధంగా పాకిస్తాన్ ప్రవర్తిస్తే దోషం ఆ వైపుననే స్థిరపడుతుంది- లోకులు మనల్ని అంతర్జాతీయ వేదిక లలో నిందించలేరు-అని కొందరు సలహా యిచ్చారు. మన సందిగ్ధావస్థను మన ప్రధాని లోకానికి వెల్లడించింది. దీనిని అర్థంచేసుకున్నట్లు రష్యా పత్రికలలో కొన్ని ప్రకటనలువచ్చినవి అమెరికాలో కూడా మన పరిస్థితిని తెలిసినవారు లేకపోలేదు అమెరికా అధ్యక్షునితో స్వయంగా మన ప్రధాని మెక్సికో వెళ్ళి నప్పుడు మాట్లాడి వచ్చింది.

అఫ్‌గానిస్తాన్‌లోకి రష్యన్ సేనల ప్రవేశంతో పాకిస్తాన్‌పై అమెరికన్ శ్రద్ధ అధికమైంది. తత్ఫలితంగా మనకూ పాకిస్తాన్‌కూ పేచీ వచ్చింది.

కోడెలు కోడెలు కొట్లాడితే లేగల కాళ్ళు విరుగుతున్నవి.

కోడెల కొట్లాట సమసిపోగల నూత్న అంతర్జాతీయ వ్యవస్థ న్యాయ మైనది రావాలని అందుకనే అందరం (లేగలన్నీ) కోరుకోవడం! అట్టి వ్యవస్థ కోసం పోరాటం అత్యవసరమనివిషయజ్ఞు లంటున్నారు. ఇప్పటి మన (మనదేశం వంటి దేశాల ప్రజల) మహాసంకటానికి మహాదురవస్థకు ఇదే విరుగుడు అని వారి నిశ్చితాభిప్రాయం

• • •

మనం అలీనులం ఆ విధంగానే మన ప్రధాని పర్యటనలు వుంటున్నవి. ఈ పంక్తులు వ్రాసే సమయంలో బల్గేరియా, ఇటలీ, ఫ్రాన్సు దేశాలలో పర్యటన కార్యక్రమాలు ముగియ వస్తున్నవి. ఈ దేశాల తీరుతెన్నులు విభిన్నమైనవి. ఐనా అవి భారతదేశాన్ని అర్థంచేసుకు న్నట్లు తోస్తున్నది. ప్రజలందరికీ అహారం అందవలసిన అంశంలో, ఉన్నవారు లేనివారికి సహాయపడవలసిన విషయంలో అభివృద్ధికి వచ్చే దేశాలు స్వయంశక్తిని పెంచుకోవలసిన కార్యక్రమంలో మన అభిప్రాయాలను ఈ పర్యటనలో అందరు వినేటట్లుగా వెల్లడించడం జరిగింది.

ఫ్రెంచి సోషలిస్ట్ ప్రభుత్వం మన విధానాలను సరిగా అవగాహన చేసుకుని మనతో కలిసి అనేకమైన అంశాలలో కృషిజేయడానికి సిద్ధమైనట్లు తెలుస్తున్నది. బ్రిటిష్ ఇది బాధాకరంగా వున్నదట, దానికి మనమేం చేయగలం? మనం ఎంత శ్రమపడి నెమ్మదిగా మన వైఖరిని వివరించినా మదాం థాచర్ (బ్రిటిష్ ప్రధాన మంత్రి) వినిపించుకుంటేనా? అమెరికా-పాక్-ఆయుధ సప్లయి గొడవ మనల్ని వేధిస్తు వుంటే, తాను వెళ్ళి ఆ పాక్ నియంతలకు తన దేశపు మద్దతును నిస్సంకోచంగా ప్రకటించె! అందువలన, బ్రిటిష్ మానసిక వ్యధి స్వయంకృతాపరాధం!

* * *

ఐతే, మరొక రంగాన బ్రిటన్ మంచి పని చేసింది. (అంగ్లసీమకు వలసవెళ్ళి కాపురం జేసే మనవారికీ, బ్రిటిష్ వలస ప్రజల పరిస్థితికి అన్వయమయ్యే కొత్త చట్టం. ఇటీవలి అల్లరుల మూలాన కలిగిన ఆందోళన ఎక్కువగా ఉపశమింపక పోయినప్పటికీ, ఆ కారణంగా బ్రిటన్ ఎక్కడైనా మంచిమాట చెబితే, మంచిపని చేస్తే మనం కాదనము) బ్రిటిష్ విదేశాంగమంత్రి సౌదీ అరేబియాకు వెళ్ళి పశ్చిమాసియా ప్రశాంతగా వుండే నిమిత్తం ఆ సీమద్వారా వెల్లడియైన సూచనలను చర్చించి, ఆమోదించి వచ్చినాడు.

ఆ సూచనలు ఇజ్రాయిల్ రాజ్యానికి గిట్టనే గిట్టవు. ఆ రాజ్యాన్ని కాదని అవాకులను సౌదీ అరేబియా కిచ్చిన అమెరికా ఈ సూచనల విషయంలో ముఖావంగా వున్నది. ఇంతలో బ్రిటన్ వాటిని ఆమోదించే సరికి, అమెరికా విదేశాంగమంత్రి ఉగ్రుడైపోయినాడు. ఇదా బ్రిటన్ చేయవలసిన పని ? అని ఆక్రోశించాడు.

కాని బ్రిటన్ చేసిందే ఒప్పు - అమెరికా వైఖరి తప్పు - ఈ అంశంలో - ఇది నిష్పక్ష పరిశీలకుల అభిప్రాయం.

ఈజిప్టు కొత్తనాయకుడైన ముబారక్ అమెరికా స్నేహాన్ని విడువకున్నా, పశ్చిమ ఆసియాలో ప్రశాంత పరిస్థితి రావడానికి సౌదీఅరేబియా తదితర అరబ్‌సీమలతో కలిసి కృషిజేసేటట్లున్నది. పాలస్తీనా రాజ్యనిర్మాణం, ఇజ్రాయిల్ భద్రంగా వుండే పథకం అరబ్బులకు యూదులకు ఇక సంఘర్షణ లేని పద్ధతిలో వ్యవహారం - ఈ కార్యక్రమానికి ఈజిప్టు అనుకూలమైనట్లు తెలుస్తున్నది. తనవద్ద లోగడ చేరిన రెండు అమెరికన్ అవాకులను ముబారిక్ మహాశయుడు వాపసు చేశాడని కూడా విన్నాము.

---




విశాలమయిన ఆ భవనంలో —

రాత్రి పదిగంటలవేళ– "అమ్మా!" అన్న పిలుపు.

శారిక తత్తరపాటుతో నిలబడింది. ఆమెకు ఆనందంగానూ ఉంది, ఆందోళనగానూ ఉంది ఆ పిలుపు వింటూంటే.

"అమ్మా!" మళ్ళీ అదే పిలుపు. ఆ పిలుపులో దేనికో ఆరాటం. ఆ పిలుపు నిండా ఆర్తి. శారిక హృదయం ఆనందంతో పొంగిపోయింది ఇంత

1981 చక్రపాణి ప్రథమ అవార్డు పొందిన నవల

సేపూ తను సిద్ధార్థ కోసమే ఆరాటపడింది. అన్వేషించింది. అతను కనపడకనే కంగారుపడింది. తొమ్మిదిన్నరకు అలవాటుగా అతని గదివేపు నడిచింది. న్యాయంగా అతనప్పటికి నిద్రలో ఉంటాడు. తొందరగా పడుకుని తొందరగా లేవడం శారీరకారోగ్యానికేకాక మానసికారోగ్యానికి కూడా చాలా దోహదం చేస్తుందనీ, ప్రాతఃకాలాన మేల్కొనేవాళ్లు పాపభీతి కలవారై ఉంటారనీ, సూర్యోదయాన్ని దర్శించేవాళ్లు సృష్టిరహస్యాన్నరయ గలుగుతారనీ తన నమ్మకం. సిద్ధార్థవీ తన విశ్వాసాలే. నిద్రపోతున్న సిద్ధార్థ ముఖం ఎంత స్వచ్ఛంగా అమాయకంగా నిర్మలంగా ఉంటుంది! ఆ ముఖం చూసేకనే తన హృదయం ప్రశాంతంగా అయి-నిద్రవొస్తుంది. అందుకే రోజూ పడుకోబోయే ముందు సిద్ధార్థ ముఖం చూసి మరీ తన గదిలోకి వొచ్చి మేను వాలుస్తుంది. ఇవాళా అలాగే అతని గదికెళ్లింది. శయ్యమీద సిద్ధార్థ లేడు! ఆశ్చర్యం వేసింది. కొంచెంసేపు ఎదురుచూసింది ఏ బాత్‌రూముకో వెళ్లాడేమో అని. ఊహూఁ. అతను పదినిముషాలయినా రాలేదు. తన మనసు పరిపరివిధాలపోయింది. కీడు శంకించింది. అతనికోసం గదిగదీ తిరిగి వెదికింది. అతను కనపడలేదు. గుండె ఝల్లుమంది. ఏంచేయడానికీ తోచక గదిలోకి వొచ్చి నీరసంగా కూలబడి పోయింది. సిద్ధార్థ ఏమయ్యాడు? వేళకాని యీవేళ ఎక్కడికి వెళ్లాడు? తనతో చెప్పకుండా గడపదాటడే! తన అనుమతి తీసుకోనిదే ఎక్కడికీ వెళ్లడే పగటి పూటే? ఈ రాత్రివేళ- ఏ బలమైన కారణం అతన్ని బయటకు పంపగలిగింది? సిద్ధార్థ తన చేయిదాటిపోతున్నాడా? ఇంకా సమయం రాలేదే! అసహనంగా కిటికీలోంచి శూన్యంగా బయటకు చూస్తూ- నిప్పులమీద నిలబడినట్లు గడపసాగింది క్షణక్షణమూ యుగంలాగ. తను అనుబంధం చిత్రమైనదే కాదు. అతి బలీయమైనది కూడా. దీనిని సిద్ధార్థ అంత త్వరగానూ తేలికగానూ త్రెంచలేడనే నమ్మకంవున్నా, ఎందుకో హృదయం ప్రమాదాన్ని శంకిస్తూంది. ఆరాటపడుతోంది. ఎంత ఆత్రపడింది తను సిద్ధార్థకోసం!

ఇప్పుడు

"అమ్మా!"

ఆ కంఠంనిండా ఎంత తహతహ. ఆ అన్వేషణలో ఎంత ఆర్తి!

ఆ పిలుపు - తన మనసుని సాంత్వనపరుస్తూంది. సిద్ధార్థ అలా తనను వెదుక్కుంటూంటే ఎంత హాయిగా ఆనందంగా శాంతిగా తృప్తిగా గర్వంగా ఉంది! ఈ అనుభూతి చాలనిపించడంలేదు. కాని - అతన్ని ఎంతసేపు యిలా బాధించడం? వొద్దు సిద్ధార్థ తను సంవత్సరాల తరబడి శ్రమించి గీసిన

అద్భుత చిత్రం. తన ఊహలకూ భావాలకూ ఆశలకూ ఆశయాలకూ అహ రహమూ అతికష్టపడి నిర్మించిన అపురూప శిల్పం. ఐతే- యింకా తుది మెరుగులు దిద్దేకని మిగిలిఉంది. తన భావన సఫలమయితే సిద్ధార్థ- పురుషోత్తముడే ఔతాడు. ఆదర్శ మానవుడౌతాడు. మనిషికి నిర్వచనంగా నిలిచిపోతాడు. కొంచెం తుదిమెరుగులు. అంతే.

"అమ్మా! " మళ్లీ పిలుపు ఈసారి మరింత గట్టిగా.

దీపాలు వేసుకుంటూ త్వరత్వరగా గదులు దాటుతూ ఆ ద్వారం చేరింది శారిక. అప్పుడు- హటాత్తుగా- ఆ ద్వారంవద్ద ఆమెలో చలనం ఆగిపోయింది. గుండె వేగం ఒక్కసారి పెరిగిపోయింది. ఎన్నడూ లేనిది- యీ వేళలో సిద్ధార్థ యిటు వచ్చాడేం? ఈ దిశలో యిప్పుడతనికేం పని?

తడబడుతున్న హృదయంతో- తలుపు తెరచింది.

"అమ్మా!"

ఎదురుగా - సిద్ధార్థ. క్షణంలో ఆమె అతన్ని ఆపాదమస్తకమూ కంటి చూపుతో పరీక్షించింది.

అతని ముఖంలో కాంతిపుంజాలు. ఆ కన్నులలో వెన్నెల వెలుగులు వదనమండలం అప్పుడే వికసించిన తామరపువ్వులా స్వచ్ఛంగా పవిత్రంగా

కాని అతని దుస్తులనిండా రక్తపు మరకలు. ఇంకా అవి తడితడిగా మెరుస్తూనే ఉన్నాయి అప్పుడే అరతున్న రక్తచందనపు పూతలా. సిద్ధార్థ చేతులు రక్తసిక్తమై ఇంక చూడలేకపోయింది శారిక. ఆమెలోని మాతృహృదయం తల్లడిల్లిపోయింది. సిద్ధార్థకు గాయాలయ్యాయా! ఏమిటీ రక్తం?

ఆమె భయపడి- కళ్లు గట్టిగా మూసుకుంది. "సిద్ధార్థా! ఏమిటీ రక్తమండలాలు శరీరంనిండా? దెబ్బలేమయినా తగిలాయా?" వణుకుతున్న కంఠంతో నీరసంగా ప్రశ్నించింది. "ఏమైంది?"

అతను మందహాసంతో- "నేను పరిపూర్ణ మానవుడి నయ్యానమ్మా! నువ్వు చెప్పావే అలాగే ప్రవర్తించాను-" అన్నాడు విజేతలా.

ఆమె కళ్లుతెరిచి ఆశ్చర్యంగా చూసింది. "ఏమిటి బాబూ నువ్వంటున్నది? నీకేమీ కాలేదు కదా? అమ్మయ్య నా గుండె కుదుటపడింది. మనస్సు స్థిమితపడింది. ఆందోళన తగ్గింది -" గుండెలనిండా ఊపిరిపీల్చుకుంది శారిక.

"జీవితంలో- తొలిసారిగా అన్యాయాన్నెదుర్కొన్నాను. అంతంచేశాను.

ఆ సంఘర్షణ . పోరాటం తాలూకు చిహ్నాలే నమ్మా యివి." గర్వంగా-నవ్వుతూ చెప్పాడు.

"ఏంచేశావు?" ఆత్రంగా అడిగింది శారిక.

"నీ కళ్లతో నువ్వే చూద్దువు గాని. ప్రత్యక్షంగా చూసి- నన్నాశీర్వదిద్దువుగాని-" శారిక చేయి అందుకోబోయాడు.

ఆమె అర్థంకానట్లు చూస్తూ- "ఎక్కడికి?" అంది విస్మితురాలై.

సిద్ధార్థ- బయటకు చూపుతూ- "అక్కడ చిన్న యిల్లు లేదూ? అక్కడికి-" అన్నాడు. శారిక ఆపాదమస్తకం కంపించిపోయింది విద్యుద్ఘాతం తిన్న లతలా. ఆమె మనసులోని ఆందోళన అవధులు మీరిందొక్కసారిగా.

బోట్ హౌస్ సిద్ధార్థ తర్జనితో చూపినది అటు ప్రక్కకే.

ఆమె అతని చేయి అందుకోకుండానే వేటగాడిచే తరమబడిన లేడిలా పరుగుతీయసాగింది. ఆమె నందుకోవటం- యౌవనంలో అడుగుపెడుతున్న సిద్ధార్థకే కష్టమౌతూంది. శారిక మెదడులో భయంకరమయిన అనుమాన పిశాచం. అదే ఆమెను తరుముతూంది బొట్ హౌస్ దిశగా. రెండు నిముషాలకంటె ముందుగానే ఆమె గమ్యంచేరి - తెరచిఉన్న ద్వారంలోంచి ఆత్రంగా గదిలోకి చూసింది. గదిలో- విద్యుద్దీపం ప్రకాశవంతంగా వెలుగుతూంది. ఆ కాంతిలో నేలమీద- రక్తంలో పడిఉన్న-

"సిద్ధార్థా!" గావుకేక పెట్టింది శారిక.

"నేను - మనిషినయ్యాను కదమ్మా? నన్నాశీర్వదించవూ?"

ఆమె కళ్లు చీకట్లు క్రమ్ముతున్నాయి. హృదయం అంధకార బంధురమైపోతూంది.

యావత్ప్రపంచమూ తానూ శూన్యంలోకి లీనమైపోతున్నట్లు..

సిద్ధార్థ ముఖంనిండా వెలుగు. ఆమె ముఖంలో కటిక చీకటి.

అతని పెదవులమీద చిరునవ్వు. ఆమె- వెక్కిపడుతూంది ఏడుపాపుకునే ప్రయత్నంలో. అతని కన్నులలో గర్వం. ఆమె కన్నులనిండా దైన్యం.

"ఎంతపని చేశావు సిద్ధార్థా!" ఎలాగో అందామె గొంతు పెకలించుకుని.

"ఎంతో మంచిపని చేశాను కదమ్మా నిద్రపోయేందు కుపక్రమిస్తున్నాను. ఎక్కడినుంచో పెనుకేక వినపడింది. త్రుళ్లిపడి- క్షణం ఆలస్యం చేయకుండా- కేక వచ్చిన దిశగా పరుగెత్తాను. ఇక్కడ ఈ గదిలో .. ఒక మగవాడు తాగినట్లున్నాడు. వాళ్లు తెలియని మత్తులో అబల అయిన



ఒక స్త్రీని చెరచబోతున్నాడు. త్రాగడం నేరం అపైన . ఒక స్త్రీని బలాత్కారించడం- మరీ నేరం. ఆ క్షణంలో నువ్వే జ్ఞాపకం వొచ్చావు. హృదయంలో నీ మాటలూ బోధలే మార్మోగాయి. ఎదురుగా అతని చేతిలో విలవిలలాడుతున్న అబల. భరించలేకపోయాను. నేనేం చేస్తున్నానో నాకే తెలియనంత ఆవేశం ఆవహించింది. అతని చేతిలోని సీసాను లాక్కుని- దానితోనే అతని తలమీద కొట్టాను. అతను కుప్పకూలిపోయాడు. అన్యాయం అక్రమం నేల కూలిపోయాయి. అరె ఆ స్త్రీ ఏదీ?"

గుండె నెవరో పిండుతున్నట్లే వుంది శారికకు అతని ఒక్కొక్క మాటా వింటూంటే.

"దుష్టరక్షణా శిష్టరక్షణా గావించేను. అదే కదమ్మా మానవత్వం? నేను సవ్యంగా నువ్వు చెప్పినట్లే చేశానా?" అమాయకంగా అడుగుతున్న అతన్ని చూస్తూంటే ఆమెకు పిచ్చెక్కిపోతూంది.

"నువ్వు శిక్షించింది - హత్యచేసింది - మీ నాన్నగారిని! నీకు జన్మనిచ్చిన తండ్రిని "

"కాదు. నేను శిక్షించింది హత్యచేసింది - దౌష్ట్యాన్ని దౌర్జన్యాన్ని దుర్మార్గాన్ని " స్థిరమయిన కంఠంతో - చెక్కుచెదరకుండా బదులుచెప్పాడు.

"నువ్వు రక్షించినది శిష్యురాలిని కాదు. ఓ వ్యభిచారిణిని. తుచ్ఛమైన ధనంకోసం పవిత్రమైన శీలాన్ని కుదువబెట్టే పణ్యాంగనిను-" నిస్సహాయత నుంచి పుట్టే అపరిమితమయిన ఆగ్రహంతో అందామె.

"ఊహుఁ ఒక అబలను మగవాడి బలానికి బలిఐపోతున్న ఒక స్త్రీని. దేవతలు కూడా పూజించవలసిన స్త్రీమూర్తిని. ఆదిశక్తిని. సృష్టికి మూలమూ త్యాగానికి నిలయమూ ఐన ప్రకృతిని." బీరుపోని కంఠంతో బదులిచ్చిన సిద్ధార్థను వెర్రిదానిలాగే చూసింది శారిక. ఒక్కసారి ఆమెలో విచిత్రమూ అతి భయంకరమూ అయిన అనుభూతి కలగసాగింది. శారిక- రెండు భాగాలుగా విడిపోతూంది విడిపోయింది. ఒక్క క్షణం ఆ రెండు భాగాలూ ఒకదానితో ఒకటి కలహించుకోడం ప్రారంభించాయి. ఆ పోట్లాట తీవ్రంగా పరిణమించసాగింది. చివరకా ఘర్షణ తీవ్రాతితీవ్రమై దుర్భరంగా మారసాగింది. రెండు చేతులకోనూ తలపట్టుకుని - గట్టిగా మూసుకుంది. కళ్లు ఆ సంఘర్షణ కంతులేనట్లుంది. అది ఆగకుండా సాగుతూంది. ఆమె భరించలేకపోయింది. ఒక్కసారి కళ్లు తెరచింది. ఎదురుగా- విద్యుద్దీపపు వెలుగులో తననే సూటిగా చూస్తూ ప్రశ్నిస్తున్నట్లు- వారి కళేబరం! రక్తంలో వికృతంగా పగిలిన శిరస్సు. దానినుంచి యింకా స్రవిస్తూన్న రక్తపుధారలు.

"సిద్ధార్థా!" అరిచింది శారిక.

"అమ్మా! నువ్వే కద నాకు నిజమయిన గురువు లేదా గుర్విణివి. ఇదే నీకు నా గురుదక్షిణ బహుమతి "

మతిపోయింది ఆమెకు. ఇదా నాకు గురుదక్షిణ! ఇదా తనకు బహుమతి! వైధవ్యమా తనకు బహూకృతి! సిద్ధార్థా! నువ్వేమంటున్నావో నీకు తెలియడంలేదు! నువ్వేంచేశావో నీ కర్థంకావడంలేదు! నువ్వు నీ చేతులతో నువ్వే - నీ తండ్రిని హత్యచేశావు

"రాజ్యంకోసం తండ్రిని హత్యచేసిన కొడుకులున్నారు!

ఆస్తికోసం తండ్రిని చంపిన కొడుకులున్నారు!

స్త్రీకోసం తండ్రిని చంపిన కొడుకులూ ఉన్నారు- చరిత్రలో. కాని- యీ హత్య చరిత్రలోనే ప్రత్యేకంగా ఆశ్చర్యంగా మిగిలిపోతూంది సిద్ధార్థా!

యీ హత్య నువ్వు చెయ్యలేదు. నేనే చేశాను ! నిజంగా నేనే చేశాను "

"ఈ రక్తంతో నాకు విజయతిలకం దిద్దవూ అమ్మా? పరిపూర్ణ మానవుడిని కమ్మని హృదయపూర్వకంగా ఆశీర్వదించవూ !" అడుగుతున్నాడు సిద్ధార్థ. అతని ముఖం ఎంత అమాయకంగా ఉంది !

ఈ బహుమతి తాను స్వీకరించలేననీ అతను యిస్తున్నది గురుదక్షిణ కాక తనకు శాశ్వత దుఃఖమనీ తా నతనికి తెలియజేయగలిగితే – అతనేమై పోతాడు? నిజంగా అతను నిజం ఆకళింపు చేసుకోగలిగితే నిలువునా కూలి పోడూ ? ఉహుఁ అతని కెంతమాత్రమూ యీ చేదునిజం అవగతం కాదు. సిద్ధార్థ యింకా మనిషి కాలేదు. అతను - తను పూర్తి చేయని చిత్రం. ఇంకా మెరుగులు దిద్దవలసిన అసంపూర్ణ శిల్పం. జరిగిన హత్యకు బాధ్యత అతని దెంతమాత్రమూ కాదు. వాస్తవంగా– తనే హంతకురాలు.

కాని – ఇది లోకం విశ్వసిస్తుందా ? చట్టం అనుమతిస్తుందా ?

"చట్టాన్ని నీచేతుల్లోకి తీసుకుని – నువ్వే శిక్షించడానికి నీకేమీ అధికారంలేదు. అది ఘోరమయిన నేరం. అందుకు" – అంటూ సిద్ధార్థని శిక్షించదూ ? న్యాయ స్థానానికి చెవులేకాని కళ్ళుండవంటారే. మరి దానికి మెదడూ హృదయమూ ఉంటాయి ? భగవాన్ ఎటువంటి పరిస్థితి తెచ్చిపెట్టావు.

"నన్నే చంపెయ్యలేకపోయావా సిద్ధార్థా!" భోరుమంటూ ఏడ్చేసింది శారిక. సిద్ధార్థ తెల్లబోయాడు. అతని కేమీ అర్థంకావటంలేదు. అంతా అయోమయంగా వుంది. అమ్మ తనని అభినందనలతో ముంచెత్తుతుందనుకుంటే- అశ్రువులతో అభిషేకం గావిస్తున్న దెందుకని ? తాను చేసిన నేరమేమిటి ? అమ్మ చెప్పినట్లే విన్నాడు. విన్నదే ఆచరించాడు. అందులో తప్పేముంది ?

శారిక భర్త కళేబరాన్ని పట్టుకుని కన్నీరుమున్నీరుగా విలపిస్తూంది. ఆమెకేం చేయటానికీ పాలుపోవడంలేదు. ఈ హత్యానేరాన్ని తనమీద వేసుకుని సిద్ధార్థ జైలుపాలుకాకుండా కాపాడేందుకు మార్గమేమైనా ఉందా అని ఒకవంక ఆలోచిస్తూనే ఉంది అంత దుఃఖంలోనూ. ఉండీ ఉండీ ఆమె విశ్వనాథ్ ముఖంవేపు చూస్తూంది. రక్తం కారి భయంకరంగా తయారయిన అతని ముఖాన్ని చీరచెంగుతో తుడిచి శుభ్రంచేసింది. అతని ముఖం యిప్పుడామెకు స్పష్టంగా కనిపిస్తూంది. ఆ కళ్ళు ఆమెను ప్రశ్నిస్తూన్నట్లే ఉన్నాయి. "శారికా ! నువ్వు నన్ను నిజంగా ప్రేమిస్తున్నావా ?"

ఆమె తడబడింది. తను– విశ్వనాథ్ని ప్రేమిస్తుందా ? ఉహుఁ, ఎంత

ఋ 'త్రయీయా లదు. మరి- అతన్ని ద్వేషిస్తూందా ? ఏమో ఊహుం అతన్ని ద్వేషిస్తున్నట్లూ అనిపించడంలేదు. ప్రేమకి- ద్వేషానికీ మధ్య ఏదైనా భావం ఉంటే ఏమిటది ? శారికకు విశ్వనాథ్‌పట్ల మిగిలినది అభావంవంటి ఆ భావమేనా ?

# 1

**విశ్వనాథ్ :-** శారికా ! పంచభూతాలలో కలిసిపోతున్నా యిహలోకబంధాలు పూర్తిగా తెగిపోలేదింకా. ఏదీ నేను ప్రాణంకోల్పోయి గంటయినా కాలేదుగా. ఏడవకు శారికా, ఏడవకు. నేను నీ కన్నీరు తుడవలేను. మరణించినవారికి ఆత్మశాంతి కోరుతారుగా జీవులు? నా ఆత్మకు శాంతి లభించాలంటే నీ నయనాల నుండి స్రవిస్తున్న దుఃఖాశ్రువులు తక్షణం ఆగిపోవాలి. ఏంచేసేది? నేను వొట్టి దుర్మార్గుణ్ని. నిన్ను కనీసం స్వేచ్ఛగా విలపించనయినా విలపించనీయడంలేదు కదూ ? చచ్చికూడా నిన్ను సాధిస్తున్నాను కదూ ? నిన్ను క్షమించమని కోరను శారికా. నేనొక వింతమనిషిని. నా దృష్టిలో క్షమాపణ అనేది అర్థరహితమూ వ్యర్థమూ అయిన పదం. విచిత్రమయిన మనస్తత్వం అనుకుంటారేమో మామూలు మనుషులు. అనుకోనీ ప్రపంచం గురించి నేనెప్పుడు పట్టించుకున్నాను? నేనొక స్వేచ్ఛాజీవిని. ఎంత స్వేచ్ఛానువర్తినంటే – ప్రేయసిగా, భార్యగా - నీకు కూడా అర్థంకాని మనిషిగా మిగిలిపోయానంటే నేను కాలంతోనూ, లోకంతోనూ సమాంతరంగా బ్రతికిఉండకపోవచ్చు. తప్పొప్పుల బేరీజుకి పూనుకోవడంలేదు శారికా. ఎలాగూ భగవంతుడి పంచాయితీకి సన్నద్ధుడినే ఔతున్నాను. కాని - నేనేమిటో నీకు - ముఖ్యంగా సిద్ధార్థకు అర్థం కావాలి, అతని క్షమాపణ ఆశించి కాదు. ఈ ప్రపంచంలో- మనుషుల మధ్య జీవించవలసినవాడు. జీవితమంతా ముందే ఉంది అతనికి. అందుకని. అదేకాక సిద్ధార్థ హంతకుడు కావటానికి నేను దోహదం చేశాను. అం దుకని కూడా.

గగనసీమలో తేలియాడే మబ్బుతునక-దృష్టిని కేంద్రీకరించి వీక్షించడం ప్రారంభిస్తే - దర్శించేవారి స్థాయిని బట్టి ఒక్కొక్కరికి ఒక్కొక్క రూపంలో కనిపిస్తుంది. ఇది ఎవరికయినా ఎదురయ్యే అనుభవమే.

జీవితమూ అంతే. ఒకరికి-జీవితం సుఖపడడానికి మాత్రమే. మరొకరికిదొక పవిత్రమైన బాధ్యత. ఇంకొకరి కిది ఉత్తమ లోకాలను చేరుకుందుకు మార్గమధ్యంలో తగిలే మజిలీ. అందరి దృక్పథాలూ సరి ఐనవే. వీటిలో తప్పు అనేది ఉందనుకోను. వ్యసనపరులకి కూడా విశాల హృదయమూ ఆలోచించగలిగే అంతరంగమూ ఉంటాయి సుమా శారికా! నేను అసత్యం పలకడం

లేదు. సజీవంగానే నేను చాలా మేరకు సత్యాన్ని పాటించగలిగాను. యవ్వనం- ఎత్తున ఉన్న నీరు వంటిది. పల్లానికి పారడం నీటి స్వభావమైతే పరుగులు తీయడమూ ఉరకలువేయడమూ యవ్వన సహజం. స్త్రీ వంక పురుషుడూ, పురుషుని వంక స్త్రీ - పరస్పరాకర్షితులౌతారు. ఆ ఆకర్షణ చాలా బలంగా వుంటే-వారి మధ్య బంధం ఏర్పడి అది శాశ్వతమౌతుంది.

ఎందుకు వచ్చాను నేను నెలవంక? ఏమో. జ్ఞాపకంలేదు. బహుశా చూడ డానికేమో. అక్కడ నిన్ను చూశాను శారికా! జ్ఞాపకం ఉందా? అది ఎటువంటి దివ్యమైన క్షణం? మనం తొలిసారిగా ఒకరినొకరు చూసుకున్న క్షణం?

నీ పాదాలముందు సెలయేరు పారుతూంది. సంధ్యాకిరణం ఏటి నీటి మీదపడి-ప్రతిఫలించి-నీ చెక్కిళ్ళను గులాబిరంగులో మెరిపిస్తుంది. ఎక్కడో కోయిలలూ రామచిలుకలూ ఆటలాడుకుంటూ ఆనందంగా కూస్తున్నయ్. ఆకాశ తలంమీద రంగురంగుల మబ్బులు చివరి సూర్యకిరణాలు ప్రసరణంలో చిత్ర విచిత్రంగా మెరుస్తున్నయ్. నువ్వు - దిగంతాల అవతలివేపుకి దృష్టి సారించి దీర్ఘాలోచనలో నిమగ్నురాలివై ఉన్నావు. అత్యద్భుతమైన భంగిమ అది. చిత్ర కారుడికి చక్కని చిత్రం గీసుకుందుకు ఆధారం కాగలగే ప్రతీక అది. నివ్వెర పోయాను. పరవశంతో - ప్రతిమలా నిలిచిపోయాను. నీ సౌందర్యాస్వాదనలో తాదాత్మ్యం చెందుతూ సుప్రభాతాన విరిసిన సంపెంగ రెక్కలా పచ్చని నీ శరీరం మీదనుంచి - పరచిన సౌందర్యరేకవంటి నీ వొంటిమీంచి అస్తమయ భానుడు తన ఆఖరి వెలుగు కిరణాన్ని ఉపసంహరించుకుంటున్న అద్భుత దృశ్యాన్ని ఆదమరచి తిలకిస్తూ నిలచిపోయాను.

హృదయం కాంక్షతో నిండిపోయింది. నాకు తెలీదు నిజంగా అది కాంక్ష అని. మోహమే కావొచ్చునని. ప్రేమనుకున్నాను. భక్తుడు దేవతకోసం పరిత పిస్తాడే అలాగ పరితపించసాగాను నీకోసం. మనసులో ఒకే ఒక గాఢ మయిన వాంఛ. నిన్ను నాదాన్ని చేసుకోవాలి. నీ సౌందర్యాన్ని నా కౌగిటిలోకి ఎంత త్వరగా తీసుకోగలనా అని యౌవ్వనం తొందరచేయసాగింది. జీవితాని కొకేఒక అర్థమూ గమ్యమూ శారిక ఐపోయింది. వయసు మహా శక్తి వంతమైనది సుమా! వలపు మనిషిని మరి దేనిమీదకూ దృష్టిని పోనివ్వకుండా కట్టిపడేస్తుందేమో కనిపించని బంధాలతో.

"శారికా! నిన్ను నేను ప్రేమిస్తున్నాను-" హృదయం తొణికిసలాడు తూంటే, శరీరం చిరుచెమటలు పోస్తుంటే, పెదవులు కంపిస్తూంటే - ఎలాగో

అన్నాను. గుండెబరువు ఒక్కసారి తగ్గినట్లు తేలికగా ఐంది. ప్రకటించని ప్రేమ ఎంత భారం! నువ్వు చూశావు పద్మ పత్రాలవంటి కన్నులతో. ఆ చూపులు వెన్నెల కిరణాలలాగ సోకి నా హృదయంలోని ఆర్తికి శాంతి నిచ్చాయి. నీ పెదవుల నడుమ చిరునగవు. నిశ్చయంగా అది ఆమోదం కాదు. హాస్యముద్రే హేళనా చిహ్నమే.

"మేఘాలు భూమిమీదకు దిగడమూ, నదులు ఆకాశతలంలోకి ఎగయడమూ అసంభవాలు కావూ!"

"ప్రేమ దేనినయినా సాధించగలదు. ప్రేమకి అసాధ్యమనేది ఉండదు-" నా కంఠంలో కచ్చితానికి నువ్వు కొంచెం చలించినట్లున్నావు. ఒక్కసారి నా కళ్ళల్లోకి చూసి-ఆ ఒక్క చూపుతోనే నన్నూ నా అంతర్యాన్నీ బేరీజు వేయగలిగినట్లు చిరుహాసం చిందించి వెళ్ళిపోయావు నా ఎదుటినుంచి. కాని - నా హృదయంలో మాత్రం మరీ స్థిరమైపోయావు! భౌతికంగా దూరమౌతున్నకొద్దీ మానసికంగా మరింత ప్రభావితం చేయటం ప్రేమ శాలూకు ముఖ్య లక్షణం కాబోలనుకున్నాను. క్షణక్షణమూ నీ ధ్యాసే. నిరంతరమూ నీ నామస్మరణే. శారిక ఎంత అందమైన పేరు, నీలాగే! నువ్వు లేనిదే జీవితమే లేదని పించింది

నవ్వుతున్నావు కదూ? నమ్మలేకపోతున్నావు కదూ? కాని-శారికా నేను చెప్పేదానిలో కొంచెమయినా అసత్యంకానీ అతిశయోక్తికానీ వుండవు.సత్యహరిశ్చంద్రుడినని అననుకానీ అబద్ధమాడడం నామట్టుకు నాకే నీచంగా కనిపిస్తుంది. మొదటినుంచీ అసత్యమంటే అసహ్యం నాకు. అనృతమంటే ద్వేషం.

ఈ విషయంలో - జీవితంలో ఒకే ఒక్కసారి రాజీపడ్డాను. నీ కోసం. అది నీకు తెలుసు- అప్పుడు కూడా చాలా నీచంగా దిగజారాననుకోను. అర్ధాంగి అడిగినది కాదనలేక- కొంచెం ఆత్మవంచన చేసుకున్నానంతేనేమో.

జమీందారునీ లక్షల కధికారినీ యువకుడినీ ఐన నేను నిన్ను వివాహం చేసుకుందు కేమంత కష్టపడనక్కరలేకపోయింది. మీ నాన్నగారికొక్క కబురు. చిన్నమాట. ఆయనెంత పొంగిపోయారో అమాయకులు! "నా శారిక కేనా యింత అదృష్టం?" ఉక్కిరిబిక్కిరై పోయారు. "కోరీ వేడీ జమిందారు నాకు జామాత కానున్నాడా!" వెర్రివాడు నా ఆస్తిమాత్రమే చూడగలుగుతున్నాడు కాని తన అమ్మాయి ఎంతవిలువైనదో గ్రహించుకోలేకపోతున్నాడు.ప్రాణంలేని బంగారం కంటె ప్రాణమున్న బంగారుబొమ్మ శారిక ఎంత అమూల్యమైనదో ఆయన

అర్థం చేసుకోలేకపోతున్నాడు. అస్తిత్వంకంటె అంతర్యం విలువ అపరిమితమని తెలుసుకోలేని అమాయకుడు. ప్రపంచంలోని ఐశ్వర్యమంతా కలసినా ఒక మనిషికీ మనసుకీ సాటిరాదు. ఇది నిజంగా నిజం.

శారికా! నీ మెడలో మాంగల్యం ధరింపజేస్తుంటే ప్రపంచాన్నే జయించినంత ఆనందం కలిగింది. నిజంగా అదృష్టవంతుడి ననిపించింది. నువ్వు నీ నిరుపమాన సౌందర్యం అరుదైన అంతర్యం అన్నీ నా వయ్యాయి. కొన్నినెలలపాటు ప్రపంచాన్నీ పరిసరాలనీ కాలాన్నీ కూడా విస్మరించి నీ సన్నిధిలో గడుపుతూ ఉండిపోయాను. నువ్వే సర్వస్వమూ అయ్యావు. కాని నన్ను లోకం క్షమించకపోనీ, నువ్వూ క్షమించకు, కాని ఎంత చేదుగాఉన్నా ఆ మాట నీకు చెప్పకుండా నీ నుంచి దాచలేను. ప్రేమ విసుగేసింది; సౌందర్యం మొహంమొత్తింది; కార్య బోరుకొట్టింది. అంతర్యం మార్పు కోరింది. మనసూ తనువూ కూడా వైవిధ్యంకోసం వెంపరలాడసాగాయి. ఈ చపలతనీ చాంచల్యాన్నీ సహించలేదనుకుంటాను ప్రేమ కాని - నేనేం చేసేది? మొదటినుంచీ నాకు బలహీనమైన వ్యక్తిత్వమే నేమో. ఆపైన అన్నీ అవకాశాలనూ అందుబాటులో ఉంచుతూ అపరిమితమయిన ఆస్తి - అగ్నికి వాయువులా. సమయానికే- నువ్వు మీ యింటికి వెళ్ళిపోయావు గర్భంధరించిన కారణంగా. చాంచల్యాన్నీ చపలత్వాన్నీ స్త్రీకి అన్వయిస్తారు కానీ నా కందులో అట్టి నిజం కనిపించదు. ఉద్యోగంలాగే అవీ పురుషలక్షణాలే అనిపిస్తాయి. సరే . నా పరిస్థితి నీ కర్థమైందనుకుంటాను. దార దూరంగా ఉంటే పురుషుడు దారంలేని గాలిపటమే. తాత్కాలిక సుఖాలూ అనుభవాలూ నాకు కొత్తకావు. వివాహాత్పూర్వమే చిన్న చిన్న అనుభవాలున్నాయి. నాలో సంఘర్షణ ఆరంభమైంది. వివాహితుడిగా పరస్త్రీతో సంపర్శించడం అపరాధమేమో అన్న శంక. కాని - వయసు శరీరాన్ని వేడెక్కించి నిలువనీయదు. ఈ తాపం భరించడం సులభంకాదు. నాలాటి నిగ్రహశూన్యులకి, ప్రేమలాగే వయసూ మనిషిని వివేకశూన్యుణ్ణి విచక్షణారహితుణ్ణి గావించగలిగేంత బలమైనదే. ఈ తాపాని కుపశమనం స్త్రీ శరీరస్పర్శే- అని తొందరపెడుతూంది మనసులోని ఒక సగం. వొద్దు వొద్దని పగ్గంపట్టి లాగుతూంది మరో సగం. మనసు రెండు ముక్కలై- పరస్పరం సంఘర్షణ భరించ శక్యంకాక - మదిరను ఆశ్రయించాను. నేను మధువుని తాగుతున్నంతసేపూ నేను నేనుగానే మిగిలిఉన్నాను. అందులో సుఖమూ కనిపించలేదు. కాని - హద్దుమీరి - మధువు నన్ను త్రాగడం మొదలు

పెట్టాక- మెల్లమెల్లగా హాయిగా నేను మరెవరినో కాసాగాను. 'అహం' భావం అంతర్ధానం కాసాగింది. అనంతరం అద్భుతమయిన ఆనందం. అదే బ్రహ్మానందం కాబోలు వేదాంతులు చెప్పే చిదానందం. ఈ స్థితిలో మనిషి తనకు తాను పూర్తిగా అతీతుడై పోతాడు. దీని తరువాతి దశ మానిని – సరిగ్గా- యిలాగ వొళ్లుమరచిన స్థితిలోనే ఓ స్త్రీ నన్ను పేద తీర్చింది తన కౌగిలిలో. తప్పొప్పుల ప్రసక్తి లేదు. నరాలలో తాపం. శరీరంలో మధువు రగిలిస్తున్న జ్వాలలు, ఆ వేడికి నిలువలేక ఆమె కౌగిలిలో ఆశ్రయం పొందాను. మగవాడి మనుగడకే ఆధారమైన స్త్రీ, ఆమే నాచెంత చేరకపోతే జ్వాలలలో నేను దగ్ధంకాకుండా మిగిలేవాడినా? ఆ చలివేంద్రమే నన్నాదుకోకపోతే దుర్భర మైన తాపంలో బూడిదై పోయేవాడిని కానూ?

నెలలు గడిచాయి. నువ్వు వొచ్చావు- బాబునెత్తుకుని. "సిద్ధార్థ-" మీ నాన్నగారు సూచించిన నామధేయం కదూ? చెప్పావు నువ్వు. ఆ పేరే ఖాయం చేద్దామన్నాను. బాలసారె- జమీందారీ ఫాయిదాలో మన భవనంలోనే జరిపించాం. వేడుకలూ వినోదాలూ అయ్యేసరికి చాలా రాత్రే అయింది; సిద్ధార్థని చూసేసరికి శారికా!- నాలో అనిర్వచనీయమైన అనుభూతి కలిగింది. అది- ఇతమిత్థమని స్పష్టంగా ప్రకటించలేనిది. గర్వం తృప్తి ఆనందం జయించినట్లు . యిటువంటి అనుభూతులన్నీ కలిపితే అటువంటిది. చాలా ఎత్తు కెక్కితే ఎలాగ ఉంటుందో అలాగ అనిపించింది సిద్ధార్థను చూసుకోగానే. కాని- యింకా ఆ గులాబి మొగ్గలను కొనవేలితో మీటనేలేదు! ఆ మందార రేకుల పెదవులను లీలగా ముట్టుకోనేలేదు. ఆ పట్టుకుచ్చు జుత్తుని నిమురనే లేదు! కలువపూవులాటి ఆ చిన్ని శరీరాన్ని నా హృదయానికి హత్తుకోనే లేదు! నక్షత్రాలలాటి చిన్ని కళ్లను హాయిగా చూడనేలేదు! ఔను. ఇంటినిండా బంధువులు హడావిడి. ఈ సంతోష సంరంభాలతో మనకి ఏకాంతం లభించ లేదు. నువ్వూ ప్రయత్నించి ఉండవు. మిత్రులతో గడిపి - వేళమీరినా చాలా కోర్కెలతో నీ గదిలోకి వొచ్చాను శారికా! ఆ- బాలసారెనాటి రాత్రి నువ్వు- మాతృమూర్తిపై కొత్త అందాలు సంతరించుకున్నావు. సిద్ధార్థను తనివితీరా ముద్దాడాలి.

నీ నవసౌందర్యాన్ని కౌగిటిలోకి తీసుకోవాలి- యిన్ని నెలల విరహా నంతరం. బహుశా నీ గదిలో నేనడుగుపెట్టిన క్షణం దుర్ముహూర్తమేమో!

సిద్ధార్థ ఉయ్యాలతొట్టిలో నిద్రపోతున్నాడు. నువ్వు మేలుకు నే

ఉన్నావు- నా కోసం నిరీక్షిస్తూ కాబోలు. శయ్యమీద- మేను వాలిస్తే తలలో పూలు నలిగిపోతాయనేమో కూర్చునే ఉన్నావు. ద్వారం దాటి నీ వంక రెండడుగులు వేశానో లేదో- "అక్కడే ఆగండి. ముందుకి రాకండి-" అరిచావు గట్టిగా త్రుళ్లిపడి- అర్థంకాక ఆగిపోయాను. నీకేమయింది?

"దయచేసి- మీ గదికివెళ్లి నిద్రపొండి." నీ కళ్లల్లో కన్నీరు. కంఠం రుద్ధమైంది. అయోమయంగా చూశాను. "శారికా!"

"త్రాగినవారితో ప్రసంగించడం కూడా నిరుపయోగమే దయచేసి వెళ్లండి."

నా అపరాధం అర్థమైంది. శారికకు మధుసేవకులమీద మంచి అభిప్రాయం లేదు. తప్పుచేసినవారికి- వారు కాని కలవాటు పడిపోవడంవల్ల- అది తప్పుగానో ప్రత్యేకంగానో కనపడక- సహజంగానే అనిపిస్తుంది. అందుకే ఎవరి తప్పుని వారు తెలుసుకోలేరు- ఎదుటివారు ఎత్తిచూపితే తప్ప. నేనూ అంతే అయ్యాను.

అభిమానానికీ అహానికీ చిన్న దెబ్బ తగిలింది. అయినా - మెల్లగా అన్నాను. "సిద్ధార్థను ఒక్కసారి తృప్తిగా చూసుకుని- మనస్ఫూర్తిగా ఆశీర్వదించి వెళ్లిపోతాను." నువ్వు తల అడ్డంగా తిప్పుతూ- "వాడి నొసట ఆ శాపాన్ని విధించకండి. త్రాగినవారి మాటలకు అర్థమూ ఉండదు. ఆశీస్సులకు బలమూ ఉండదు" అన్నావు అతి కఠినంగా.

విషదంష్ట్రి గుండెలలో గ్రుచ్చినట్లే గ్రుచ్చుకుంది నీ మాట. గిలగిలలాడిపోయాను. శారికా! సుకుమారీ సుందరీ ప్రేమమయీ ఐన నీలో యింత కాఠిన్యమూ పరుషత్వమూ ఉండగలవని నేను ఊహించనయినా ఊహించలేదు. అందుకే అంత విస్తుపోయాను. విభ్రాంతి చెందాను. సువాసన నాఘ్రాణించాలని సంపెంగను అందుకుంటే అది మిన్నాగై కాటువేస్తే? అలాగ అయింది నా పరిస్థితి. నీకు సమాధానం చెప్పలేక కాదు. నీ మీద నా అధికారం ప్రదర్శించలేకా కాదు. నన్ను నేను సమర్థించుకోగలిగినా- మౌనంవహించి వెను తిరిగాను. ఐశ్వర్యం అభిజాత్యం వీటి లక్షణాలు నీ కెలాగ తెలుస్తాయి? నువ్వు సామాన్యకుటుంబం నుంచి వచ్చిన స్త్రీవి. నీకు నా అనురాగమే తెలుసు తప్ప నా వంశంలోని మగవాళ్ల ప్రవర్తనలతో కొంచెమూ పరిచయంలేదు మరి. జ్ఞానమూ లేదు. కయ్యానికీ వియ్యానికీ నెయ్యానికీ సమానులే ఉండాలన్నది నిజమే అనిపించావు. మనసుకి తగిలిన గాయాన్ని మధువు మాన్పింది. హృదయం

లోని ఆర్తిని మాదిని చల్లార్చింది. అలాగ గడిచిందా శేషరాత్రి. నే నెక్కువ నష్టపోయాననుకోను.

ఒకవారం గడిచింది సుమారుగా. ఈ వారమూ మనం ఒకే భవంతిలో ఉన్నా మన మధ్య సందర్శనమూ లేదు, సంభాషణా లేదు. కొన్ని లక్షల యోజనాల దూరం ఏర్పడిపోయింది. ఆ సాయంత్రం— నువ్వు కబురందించావు వొస్తున్నానంటూ. హృదయం ఆనందంతో పున్నమినాటి సముద్రమే అయింది. నేను ఓడిపోవడం నాకెంత అయిష్టమో నువ్వు ఓడిపోవడమూ నాకంత అప్రియమే. కాని— యిప్పుడు తప్పదు. ఎవరో ఒకరు సంధికి వొస్తే తప్ప యిద్దరమూ సుఖపడలేము. దూరం తరిగి దగ్గర కాలేము. నేను పశ్చాత్తాపపడ్డాను. నాదే అవివేకమేమో అనుకున్నాను. కనీసం నీ దృష్టిలో తప్పు చేసినవాడిని నేను. నేనే నిన్ను క్షమాపణ వేడవలసిందేమో. నువ్వు పరాయిదానవు కావుగా? ప్రేయసివి. అర్ధాంగివి. నీ ముందు నేను అభిజాత్యమూ అధిక్యతా ప్రదర్శించడమేమిటి అవివేకమూ తొందరపాటూ కాకపోతే? మగతనం తాలూకు బింకమూ పౌరుషమూ నీ ముందు ప్రదర్శించడమేమిటి? పశ్చాత్తాపపడుతున్నాను— మనసులో. అంతర్యం గందరగోళంగా ఉంది. నువ్వొచ్చి- నాహృదయంలోని యీచిరుతుఫాను నాపి మళ్ళీ ప్రశాంతను ప్రసాదించాలి. ఆ క్షణంకోసం ఆత్రంగా నిరీక్షిస్తూ కూర్చున్నాను.

నువ్వొచ్చావు.

శారికా! నిన్ను చూస్తూనే నాహృదయం ఎందుకో కీడు శంకించింది. స్నానంచేసి ఆరబెట్టుకొన్న జుత్తు, ముడివేసుకోలేదు, జడావేసుకోలేదు ఇంక పూలు ముడుచుకోవడం అన్న ప్రశ్నేక్కడ? తెల్లనిచీర ధరించావు. వొంటిమీద అలంకారాలు అసలు లేవు. నుదుట మాత్రం బొట్టుంది. అది - చిత్రంగా- కనీ కనిపించకుండా. కలువపూవు అలంకారాలు లేకపోయినా అందంగానే ఉంటుంది. నువ్వు సహజ సుందరివే. కాని- రూపం మనోభావాలకు కొంతవరకూ ప్రతిబింబం ఔతుంది. మనిషి ఉద్దేశాన్ని అలంకరణ కొంతమేరకు సూచిస్తుంది. అందుకే- నేను ఆత్రత చెందాను. భయపడ్డాను. దానికి తగినట్లే నువ్వు- చేతిలోని సిద్ధార్థను యిరువురి మధ్యగా ఉన్న బల్లమీద ఉంచి- నా కెదురుగా- కాని దూరంగా— ఆసీనురాలివయ్యావు. నేనేమీ ఎరుగనట్లు అమాయకత్వం నటిస్తూ . సిద్ధార్థ నందుకోబోయాను.

"దయచేసి- ఆగండి."

ఆగి— చూశాను. నువ్వు తల వంచుకున్నావు. ఏదో చెప్పాలనుకుంటున్నావు.

క్షణాలు లెక్కిస్తున్నాను.

"మీరు— మామూలుగానే ఉన్నారనుకుంటాను—"

చేదుగా వినిపించిందా మాట. "ఊఁ, రాత్రులలు తప్ప మధుపానం గావించను."

"మంచిది. మీ రాత్రి కార్యక్రమాలు మిగిలినవి నాకు చెప్పవలసిన పని లేదు. ఒక్కమాట చెప్పండి. ఆ అలవాట్లు మానుకోలేరా? నేను లేనప్పుడు మీ రెలా గడిపారో వివరంగా తెలుసుకున్నాను, నే నున్నప్పుడు మీరు వాటి నాశ్రయించలేదు—"

"శారికా! నా గురించి కొంచెం తెలుసుకోడం మంచిదే ఉభయుల క్షేమం దృష్ట్యా. నాకీ అలవాట్లు మొదటినుంచీ ఉండేవి. మధ్యలో— నీతో గడిపిన కొన్ని నెలలు— మార్పువొచ్చింది. నువ్వెళ్ళిపోయావు, మళ్లీ నేను పూర్వపు మనిషినై పోయాను. మూడో మనిషిని నా గురించి అడిగి అరాలు తీయడం నాకు చాలా అవమానకరం. వంశానుగతంగా ఐశ్వర్యం మూలంగా నాకు కొన్ని వ్యసనాలు సంక్రమించాయి. అవి నా రక్తంలోనివి. వాటిని వదులుకోగలనని— అసాధ్యమూ అసంభవమూ అయిన శుష్క వాగ్దానాలు చేయను." కచ్చితంగానే చెప్పాను.

నువ్వు సూటిగా చూశావు— నా కన్నులలోకి. "ఎంత బలహీనులు!"

"కాని— నాకూ ఒక బలమయిన సుగుణం ఉంది. అది— చాలా అరుదైన పరిస్థితులలో తప్ప అసత్యమాడకపోవడం."

నా మాటలు పట్టించుకోనట్లే— "అంత బలహీనులూ వ్యసనపరులూ మీ రెలాగ ప్రేమించ గలిగారు?" అంటూ అడిగావు. నీ అజ్ఞానానికీ అమాయకత్వానికీ జాలిపడుతూ నిట్టూర్చి — వ్యసనపరులకు హృదయం ఉండదని నీ వనుకుంటే క్షమించు నువ్వు చాలా తెలుసుకోవలసింది మిగిలిపోయింది. నిజానికి వాళ్ల హృదయాలే మరింత విశాలంగా ఉంటాయేమో!" అన్నాను. ఎందుకనో నీముందు కటువుగా ఉండలేకపోయాను. సూటిగానూ వాడిగానూ బదులుచెప్పి శరాలవంటి నీ పలుకులకు ములుకులవంటి మాటలతో తిరిగి గాయంచేయగలిగినా — మెత్తగానే మాట్లాడాను. కారణం— నా సంస్కారమో, నీమీద ఉండే ప్రేమో, భార్యాభర్తల అనుబంధమో. నీ మాటల వెనుక—నన్ను

ప్రేమించినందుకో పెళ్లిచేసుకున్నందుకో నువ్వు చాలా పశ్చాత్తాప పడుతున్నట్లు కనిపించావు. నా అహానికి గట్టి దెబ్బే తగిలింది.

"వ్యసనాలు హృదయాలని విశాలం చేస్తాయన్నది - కొత్తగా వినపడు తోంది." వ్యంగ్యంగా అన్నావు నువ్వు

"అది- నీ అజ్ఞానం-" నోరు జారాను నేను కూడా.

నిజమే నేను అజ్ఞానురాలినే . నేను వొచ్చింది మీతో వాదించడానికెంత మాత్రమూ కాదు. ఇప్పుడు - మన వివాహం వెనక్కి తీసుకోలేని తప్పటడుగనీ పెద్ద పొరపాటనీ స్పష్టమూ అయింది. దీని కెలాగూ నిష్కృతి లేదు. నా జీవితంలో నేను కోరుకున్న దొక్కటే. శీలవంతుడైన భర్త. స్త్రీకే కాక పురుషుడికీ శీలం అతిప్రధానమే అని మనస్ఫూర్తిగా నమ్మేవారిలో దురదృష్టవశాత్తూ నేను ఒకతెను. ఆ కోరిక ఎలాగూ పగిలిపోయింది అందుకు విచారిస్తున్నా- మిమ్మల్నొకటి వేడుకుంటున్నాను-"

దీనంగా ఉన్న నీ ముఖం చూస్తూ ఆశ్చర్యంగా అడిగాను. ఏమిటి?"

"సిద్ధార్థను నాకివ్వండి "

"శారికా! ఇదేం కోరిక? నీ ఉద్దేశమేమిటి? సిద్ధార్థ నీవాడు కాక మరెవరివాడు."

"మన యిరువురికి వాడిమీద సమానాధికారాలుండాలి న్యాయంగా. కాని- చట్టరీత్యా అలాగకాదు. సర్వాధికారాలు మీకే చెందుతాయి. కాని- ఒక స్త్రీగా... సిద్ధార్థకు తల్లిగా మీ భార్యగా . నేను ప్రత్యేకంగా కోరుకుంటున్న దేమిటంటే- వాడిమీద సర్వాధికారాలూ నాకే చెందాలని. అంటే వాడి విషయంమేరకు ఎప్పుడయినా నా నిర్ణయమే తుది కావాలని."

నీ భావం నేనర్థంచేసుకోగలుగుతున్నాను మెల్లగా. నువ్వెందు కిటువంటి విపరీతపు కోరిక కోరావో కూడా అవగతమౌతూనేఉంది. శారికా! నీ నిర్ణయం చాలా అన్యాయం సుమా! ఏ మనిషి ఔన్నత్యమేనా వారి క్షమాగుణం బట్టే నిర్ణయించబడుతుంది. తప్పుని క్షమించడం నీకసలు చేతకాదా! భర్తపట్ల కూడా నీ పట్టుదలకీ సిద్ధాంతాలకీ సడలింపు ఉండదా? ఎటువంటి వ్యక్తిత్వం నీది!

"నేను సిద్ధార్థని తీసుకుని మా వూరు వెళ్లిపోతాను." అన్నావు నువ్వు. నీ మాట నన్ను కలవరపరచింది. అందుకే అన్నాను. "శారికా! అలాగ నేసి నన్నవమానపరచకు. నలుగురిలోనూ నన్నా్లపాలు చేయకు."

"ఐశ్వర్యం - అభిజాత్యాన్ని వ్యసనాలని మాత్రమే యిచ్చేదయితే

మా కంపెనీలో పనిచేస్తున్న అరవై మందిలో ఏభైమంది మగవాళ్లు. అందులో పాతికమంది పెళ్లికాని కుర్రాళ్లు!




సాక్షాత్కరించద మేమిటి. సరసాలలో సరాగాలలో రేయికొక సుందరి. అనాఘ్రాత పుష్పం. యౌవన విలాసం నా ముందు నాట్యాలు సలిపేది. నా పొందుకోసం పరితపించేది. అద్భుతమయిన అనుభవాన్నందించి రేయిని సార్ధకంచేసేది. చందమామలో మచ్చ ఉంటుంది. ఆ సౌందర్య నిలయాల శరీరంమీద మచ్చుకొక్క మచ్చయినా కనిపించదు. ఆ నీలాలను చూసి నీలి మేఘాలే సిగ్గుతో తలవొంచుకోవాలి. ఆ శరీరకాంతికి సువర్ణమే సిగ్గుతో మగ్గి పోవాలి. మరి అంతటి అందాల భామలను పొందుతున్నా అంతర్యం ఎందుకు నీకోసం కొట్టుకోవాలి? ప్రతి రేయీ వసంతమే ఔతున్నా నీ సన్నిధిలో గడపాలని ఎందుకా వెర్రికోరిక? నన్నవమానించే అసహ్యించుకునే నీవేపే ఎందుకు మొగ్గాలి మనసు? ఇక్కడ నన్ను శృంగార స్వర్గాలలో తేలియాడిస్తూ, నన్నపరిమితంగా గౌరవించే కాంక్షించే సుందరీమణు లిందరుండగా నా నుండి నీవేపుకి వీచే గాలిని కూడా అసహ్యించుకునే నీకోసం ఎందుకు తాపత్రయపడటం? అదే నాకూ అర్థమయ్యేది కాదు. నిన్ను మరచిపోడానికే మధువు సేవించేవాడిని. చిత్రంగా- మధువిచ్చే నిషాలో నువ్వు మరింత ఆక్రమించుకునేదానివి నా అంతరంగాన్ని.

ప్రపంచంకోసమని- వారానికొకటి రెండుసార్లు నీ భవనంలో గడపడా నికి వచ్చేవాడిని. లేకపోతే నువ్వు చులకనై పోతావు బంధువుల దృష్టికి నౌకర్ల దృష్టికీ. అప్పుడు నువ్వెంత నిర్దయగా ప్రవర్తించేదానివి! భోజనం వడ్డించి- వైదొలగేదానివి. నీకు తెలుసు- నే నిక్కడకు వొచ్చింది భోజనంకోసం కాదని. నామీద కసి తీర్చుకుందుకు నన్నలాగ శిక్షించేదానివి. నేను ఎలాగో భోజనం చేసినట్లు నటించేవాడిని. రాత్రి- నా గదిలో శయ్యమీద పొర్లేవాడిని. ఎంతకీ నిద్రరాదు. ఔను. నువ్వొస్తావేమో అని మిణుకుమిణుకు మంటున్న ఆశ- ఏ వేళకి వొస్తావో అని నిరీక్షింపజేస్తూ- నిద్రపోనిచ్చేది కాదు. ఆ ఆశకు ఆధారమా? మనిషి మనసులో దృక్పథంలో ఏ క్షణంలో అయినా ఎటువంటి మార్పయినా రావొచ్చు. మధువూ మానినీ అంత క్షమార్హంకాని నేరాలు కావే! నేను చోరుణ్ని కాను. అబద్ధాలాడేవాడినీ కాను. నువ్వు నన్ను క్షమించవచ్చు నేమో ఏ శుభక్షణంలో అయినా? అలాగ ఆశతో ఎదురుచూసేవాడిని. మధువు కూడా లేకుండా నిరీక్షించడం ఎంత నరకమో తెలిసేది. మెల్లగా తెల్లవారేది. నిరాశగా నిద్రలోకి జారిపోయేవాడిని. నువ్వు చాలా కఠినాత్మురాలివే శారికా! మూర్ఖురాలివి కూడా. నన్ను శిక్షించడంలో- నువ్వేం కోల్పోతున్నావో ఒక్క- సారీ ఆలోచించుకోవేం? వెనుదిరిగి చూసుకోవేం? నన్ను బాధపెట్టేందుకు- నువ్వు బాధపడవలసి వొస్తోందని ఎందుకు గ్రహించుకోవు? అమాయకురాలివి శారికా! యౌవనం అందం ఆరోగ్యం కాలంతోపాటు కరిగిపోడం లేదూ?

ఒక్కొక్కసారి నీతో అవన్నీ చెప్పెయ్యాలన్నంత ఆవేశం కలిగేది. కాని - నువ్వు నన్నేం మాట్లాడడానికీ అవకాశం యిచ్చేదానివి కావు. నా గుండె మండిపోయేది. చాలా కోపంతో- ఒక్కసారి నిన్ను బలవంతంగా కౌగిలిలోకి తీసుకుని- నువ్వు కదలకుండా బంధించి- నేను చెప్పదలచుకున్నవన్నీ చెప్పె య్యాలని ఉద్రేకపడినా- వివేకం తలఎత్తి- "అర్ధాంగి మీదనా అత్యాచారం? అని ప్రశ్నించేది. అంతేకాక నాకింకో భయం కూడా ఉండేది. నేను నీ కిచ్చిన వాగ్దానాన్ని ఏమాత్రం భంగపరచినా మిగిలిన జీవితమంతా నా ముందు నేనే అపరాధిలా నిలబడాలి.

నన్ను మరో రకంగా కూడా అతి దారుణంగా శిక్షించావు శారికా! ఆ చిత్రహింసను తలచుకుంటే యిప్పటికీ మనసు జలదరిస్తోంది.

సిద్ధార్థ ముద్దుగా బొద్దుగా ఉండేవాడు. పసిపాపగా మరీ చక్కగా ఉండే

చూడు తల్లీ· ఉద్యోగంలో చేరేముందు ఇక్కడి నిబంధనలు కాస్త అర్థం చేసుకుంటే మంచిది నువ్వు!




సిద్ధార్థను దానినుంచి దూరంగా ఉంచాలనే నా కాంక్ష." కచ్చితంగా చెప్పావు.

"ఐశ్వర్యమే నీకు దూరంగా ఉంటుంది."

అంటే? అన్నట్లు చూశావు. కొంచెం ఆలోచించి చెప్పాను. "ఎలాగూ ఔట్ హౌస్ ఉండనే ఉంది. నా మకాం అక్కడికి మార్చుకుంటాను."

"ఆ పని నేనే చేయగలను. వైభవం నాకేమీ అలవాటు కాదు_" _నేను విలువ యిచ్చే సంపద వేరు.

"కాని_ నేను అంత ఉన్నత వ్యక్తిత్వం కలవాడిని కాననుకుంటాను. జమీందారు భార్యగా నువ్విక్కడ ఉండడమే నాకు గౌరవం. గౌరవాభిమానాల గురించి నాకు పట్టింపు ఉంది మరి. ఎప్పుడో వస్తూంటాను నేనీ భవనంలోకి. అదీ_ లోకం కోసమే. నీకే విధమయిన అసౌకర్యమూ కలిగించను. నీ వ్రతానికి భంగం కలిగించను."

వాగ్దానం చేశాను. నువ్వు కళ్లెత్తి చూశావు_ నిజమేనా అన్నట్లు.

"మొదటే చెప్పాను నాలో ఒక సుగుణం_ సత్యవ్రతం_ కూడా ఉందని."

మౌనంగా సిద్ధార్థని చేతుల్లోకి తీసుకుని వెళ్లిపోయావు. నిజంగా నాకా క్షణంలో ఒక గాఢమయిన కోర్కె ఉంది మనసులో. అది- సిద్ధార్థను గుండెలకు హత్తుకుని- ఆ పాలబుగ్గలను ముద్దాడాలనీ ఆ సిల్కు జుత్తు నిమురాలనీ, కాని- సిద్ధార్థమీద నాకేమీ అధికారంలేదు. కొన్ని క్షణాల క్రిందటే నీకు ధారాదత్తం చేసేశాను. అడిగి- వెలితపడడం నాకిష్టముండదు. అందుకని కోర్కెనే చంపుకున్నాను సిద్ధార్థ- ఎంత ఆలోచించి పెట్టిన పేరో! ఎంత దూరదృష్టితో చేసిన నామకరణమో. తల్లితండ్రు లిద్దరిలోనూ- సగమే- తల్లి మాత్రమే- సిద్ధించింది వాడికి. జాలివేసింది వాడిమీద. హృదయం అర్థమైంది. తరువాత నా జీవితం నీవరకూ అసిధారావ్రతమే అయింది. నీ భవనం మెట్లెక్కుతూనే నేను అయిష్టంగానయినా మరో మనిషిని కావలసివచ్చేది. ఆ మెట్లెక్కడానికి- నేను మధుపానంచేసి ఉండకూడదు. సిగరెట్‌ని కూడా దూరంగా ఉంచాలి. ముఖంమీదకు చిరునవ్వు తెచ్చుకోవాలి. దేముణ్నే నమ్మని నేను- నీ పూజామందిరంలోకి- బూట్లు విప్పి- పవిత్రంగా ప్రవేశించి- నువ్వు అన్యమనస్కంగా యిచ్చే తీర్థప్రసాదాలు స్వీకరించాలి. ఆ భవనంలో ఉన్నంతసేపూ గంభీరంగానే మసలాలి. కొత్త అవతారం ఎత్తాలి. ఎందుకింత శ్రమ తీసుకున్నాను, ప్రపంచంకోసం, లోకాన్ని మభ్యపెట్టడంకోసం. శారికా! నిజంగా నాకీ నటన ఎంతమాత్రమూ అంగీకారంకాదు. మనిషి ఒక్క జీవితమే జీవించాలనేది నా అభిలాషా సిద్ధాంతమూ కూడా. శ్రీమంతుడినయిన నేను నిన్ను త్యజించి- నా కిష్టవచ్చిన రీతిలో జీవితం గడపలేకకాదు. నువ్వంగీకరించినా మానినా నిజం ఏమిటంటే- ఎక్కడో నీవంటివారు నూటికి కోటికి ఒకరు తప్ప మిగిలినవారందరూ సంపదకు సలాముచేసేవారే. ధనానికి దాసులే. నేను కోరితే తిరస్కరించే స్త్రీ ఉంటుందనుకోను. కాని- నా కింకెవరినీ పునర్వివాహం- ద్వితీయం- చేసుకోవాలని అనిపించేదికాదు ఎన్నడూ. అంతర్యపుటడుగుపొరలలో నీమీది ప్రేమ చిరంజీవిగా నిలచిఉందేమో. అర్థబలమూ అంగబలమూ అవసరమయిన దానికంటె అత్యధికంగానే ఉన్న నేను- నిన్ను త్యజిస్తే- లోకమేకాదు, చివరికి నీ తండ్రికూడా యిదేమని నన్ను ఎదురుగా వచ్చి ప్రశ్నించడానికి భయంతో వణుకుతాడు. బాహాటంగా మనం విడిపోతే పదిమంది దృష్టిలోనూ నువ్వే నేరస్తురాలిగా అనుమానించబడతావు కానీ మగవాడిని కనుక నన్నెవరూ పల్లెత్తుమాట అనరు. ఈ వ్యవస్థలో- విచ్ఛిన్నమయిన ఏ సంసారానికయినా స్త్రీనే హేతువుగా పరిగణిస్తుంది సమాజం. అదీ నాకు

తెలుసు. నే నే పాపంచేసినా దానితాలూకు మలినం నా చేతులకంటదనీ తెలుసు అయినా నేనటు అడుగూ వేయలేకపోయాను, ఆలోచించనూ లేకపోయాను. ఎందుకని?

పంతాలూ పట్టింపులూ మనని శారీరకంగా దూరంచేసినంతగా మానసికంగా విడదీయలేకపోయాయేమో! వివాహబంధం అంత సులభంగా వీడిపోయేది కాదేమో. నువ్వు నన్ను తీవ్రంగానే అవమానించినా నీ యెడల పూర్తిగా అభిమానం చంపుకోలేకపోయాను. నిన్ను త్యజించి- అవమానాలపాలూ అవహేళనలపాలూ చేయడానికి నాకు మనస్కరించేదికాదు. నీ పట్ల ఆ అభిమానమూ ఆపేక్ష అంతఃకరణా శాశ్వతంగా మిగిలిపోయినాయి నా అంతరంగంలో. అంతేకాదు, ఇప్పుడు సిగ్గువిడచి అహాన్నీ అభిమానాన్నీ చంపుకుని చెబుతున్నాను. మళ్ళీ నువ్వు నన్ననుగ్రహిస్తావేమో అన్న ఆశకూడా నా హృదయకుహరంలో దీపకళికలా రెపరెపలాడుతూనే ఉండేది. అది- శాశ్వత జ్యోతి. నా ఆశ పూర్తిగా నిరాధారమని భావించను. ఎందుకంటే .

ప్రపంచం ఒక పెద్ద మాయ ఐతే మనిషి అందులో చిన్న వింత. మనిషికి అటు వరమూ యిటు శాపమూ కూడా మనస్సే. ఆ మనసు మనిషిని ఆడిస్తుంది. అందుకేకాదూ అన్నాడు మిల్టన్- నాకమయినా నరకమయినా మానవ హృదయంలోనే ఉంటుంది, బాహ్యంగా కాదని. ఇంత సత్యం శోధించి మానవాళి కందించిన మహాకవి గురించి కూడా- నిజమో అబద్ధమో తెలీదు కానీ ఓ అపప్రధ ఉంది. వివాహం కాగానే పారడైజ్ లాస్ట్ వ్రాశాడనీ, భార్యావిరహం ప్రాప్తించాక పారడైజ్ రిగెయిన్డ్ రచించాడనీ. అది- సరదాగానే తీసుకుని వదిలేద్దాం. మనిషి తాలూకు మనస్సు యిదే తప్పొప్పుల నిర్ణయంచేసి చూపే న్యాయాధికారి. ఒక్కొక్కరి మనస్సు లౌకికంగాకాక ఎదురుతిరిగి ఆలోచిస్తుంది. అతను- విప్లవకారుడో, మేధావో, పిచ్చివాడో ఔతాడు. నా మనసు నన్నలాగ తయారుచేయలేదు కానీ- నీ ముందు దోషిగా నిలబడవలసిన అగత్యం కలిగించింది. శారికా! నిర్మలమయిన అంతరంగంతో ఆలోచించు. ఈ క్షణాలలో- ఎందుకో నీ పంచాయితీలో నన్ను నేనే నివేదించుకోవాలనిపిస్తూంది. నేను తప్పు చెయ్యలేదని నీకు మాత్రం చెప్పుకోవాలనిపిస్తూంది.

తప్పు!. ఈ పదం అతి మోసపూరితమైనది సుమా! ఏ యిద్దరు మనుషులూ ఒకే పోలిక కలిగి ఉండనట్లే ఏ యిద్దరి మనసులూ ఒకే విషయాన్ని

తప్పుగా చూడవేమో. ఎవరికి వారే తమ పరిస్థితులనుబట్టీ వాతావరణాన్నిబట్టీ తప్పొప్పులు నిర్ణయించుకుంటా రనుకుంటాను. మనిషి సుఖపడడం నేరమని ఎవరనగలరు? ఈ సుఖం ఒక్కొక్కరికి ఒక్కొక్కచోట లభిస్తుంది. నువ్వెంతో ద్వేషించే మధువు - నాకు మహదానందం యిస్తుంది. తెగ్రతాగి-వొళ్లుమరచి శవంలా పడుండడం ఏం సుఖమని నువ్వు ప్రశ్నించవొచ్చు. శారికా! జీవితమనే విసుగునుంచి విశ్రాంతి కల్పించేది మృత్యువు. పగటి విసుగును పారద్రోలేది రాత్రి. చైతన్యంవల్ల కలిగే గ్లానిని నిర్మూలించేది నిద్ర. నిద్రలో సుఖమేమిటి? నిషాలోనూ అదే సుఖం. చైతన్యమండి జాగ్రదావస్థనుంచి సుషుప్తిలోకి క్రమంగా మెల్లగా జారడానికి చేయూతనిచ్చేది మధువు. జాగ్రదావస్థకి సుషుప్తికీ మధ్యావస్థ ఎంత హాయైనది! అది అనుభవైకవేద్యమేతప్ప అనిర్వచనీయం. మధువుని సేవించడం- జమీందారుగా నాకొక లక్షణం. కాలమూ, ధనమూ కూడా నా కందుబాటులోనివే. పరస్త్రీ వాంఛ ఐశ్వర్యవంతాలూకు అవలక్షణమని అతి తేలికగా తీసిపారేశావు కాని-లోతుగా ఆలోచించు. ఎవరు పరులు? ఏ క్షణంలో నా హృదయంలో ఒక స్త్రీపట్ల కోరిక కలిగిందో- ఆ క్షణంలోనే ఆమె నాది. రాగరంజితమైన నా హృదయం ఆమె సౌందర్యానికి అర్పితమౌతుంది. ఆ అందాన్ని ఆర్తిగా వాంఛిస్తుంది ఆమెకోసం సర్వమూ త్యజించడానికి సంసిద్ధమౌతుంది. ఏ సాహసమయినా చేసి, ఎంత శ్రమయినా తీసుకుని ఆమెను సాధించి- పొందు అందుకునేవరకూ మనసు నిలవదు. హృదయం కుదురుగా ఉండదు వయసు చేసే అల్లరి కాబోలిది! మరి- నాలో లోపమో, ఆ సుందరుల అల్పత్వమో కాని- ఎవరిమీదా ఎక్కువకాలం మనసు లగ్నంకాదు. ఏ అందమూ శాశ్వతంగా నా అంతర్యాన్ని కట్టిపడేసుకోలేదు. నా మనసు- ఏ పూవుమీదా మరో క్షణం నిలువని భృంగమేమో. కాని- శారికా! నువ్వు విశ్వసించ గలిగితే నా మనసు నీముందు పరుస్తాను. నిన్ను ప్రేమించాను. వయసులోని మనసు- వలపు వలలో చిక్కుకోడమే కావొచ్చు. నీమీది ప్రేమమాత్రం క్షణికం కాలేదు. అది- హృదయంలో ఆరని జ్యోతే అయింది. దానికి నీప్రేమ అనే తైలం లభించకపోయినా, నీ సౌందర్యం నిత్యనూతనంగానే భాసించేది. ఔను శారికా!

బోట్‌హౌస్‌లో నా విలాసాలకేమీ లోటులేదు. పగలంతా విందులు, వినోదాలు. అటు సూర్యుడు అస్తమించడమేమిటి, యిటు మధుపాత్రతో మావివి

వాడు. చంటిపిల్లలు పారాడుతూంటే అది ఎంత అద్భుతమైన దృశ్యమని! పాలరాతి గచ్చుమీద పరచిన తివాచీమీద సిద్ధార్థ పాకేవాడు నల్లని దుబ్బుజుత్తు వేసుకుని విశాల నయనాలతో ప్రతి వస్తువునీ ఉత్సాహంగా పరికిస్తూ- ఎంతో ఆనందంగా కొంచెం కొంచెం ముందుకు జరుగుతూ వాడు పారాడుతూంటే మధ్యమధ్య నావంక కన్నెత్తి చూస్తూ అమాయకంగా బోసినవ్వులు నవ్వుతూంటే నా హృదయం ఒక్కసారి వాడినెత్తుకోవాలని ఎంత పరితపించిపోయేదో! వాడు నావంక చేతులు చాచేవాడు. తనని ఎత్తుకో మని చెబుతున్నట్లు- చిన్నచిన్న కేకలుపెట్టేవాడు. నాలో చలనం లేకపోయే సరికి- కోపంవొచ్చినట్లు పిడికిళ్ళు బిగించి మూతి సున్నాలా పెట్టి పెద్దగా అరిచేవాడు- నన్నొక వింత మృగాన్నిలాగ చూస్తూ. అదుగో అటువం టప్పుడే మనసుకి పగ్గాలువేయడం అతి కష్టమైపోయేది. శారికా! మనిషి ఎంత వ్యసనపరుడయినా పసిపాపలపట్ల వాత్సల్యాన్నీ ప్రేమనీ అనుబంధాన్నీ ప్రద ర్శించకుండా ఉండవలసిరావడం చిత్రహింసే. అందులోనూ అందంగా ఉండి అల్లరిచేసే చిన్నపిల్లలను చూస్తూ చేరదీయకుండా ఉండమంటే హృదయానికి రంపపుకోతే. పసితనం- అమితాకర్షణీయం. ఎవరి పిల్లలో అయినా చక్కగా అనిపిస్తే బుగ్గమీద చిటికెవేసి నవ్వించకుండా ఉండలేము. సిద్ధార్థ చిన్నప్పుడు మరీ కాశ్మీరపు యాపిలుపండులా ఉండేవాడు బూరెబుగ్గలతో. ఎంతో ముద్దొచ్చే వాడు. వాడిని. ఆ బుగ్గలను ఒక్కసారి స్పృశించాలని నా పితృ హృదయం పరితపించేది. మనసు ముందంజవేసేది. కాని- ఎక్కడినుంచో నీ కుపితనేత్రాలు రెండూ ఆగమని గద్దిస్తున్నట్లు భయంగా నా చేతులని వెనక్కి తీసుకునేవాడిని. నేను ముట్టుకుంటేనే వాడు మలినపడిపోతాడా శారికా! నా చేతులు పరిశుద్ధమైనవే. ఇవి ఎవరినీ హత్యచేయలేదే! కనీసం- శిక్షించనయినా లేదే! మ రెం దు క ని యివి అపవిత్రమయిపోయాయి? ఓహో! యివి మధు పాత్రనందుకుంటాయి. పరస్త్రీని ప్రేమగా నిమురుతాయి. అందుకనేకదూ? అయ్యో శారికా శిఖ్పొప్పులమధ్య నువ్వు గీసిన గీతలే పవ్యమైనవైతే నీ శిక్షాస్మృతే ధర్మమైనదైతే -ప్రపంచంలో అందరూ కాకపోయినా ఎక్కువ మంది తండ్రులకి తమ బిడ్డలను ముట్టుకునే అర్హత మిగలదే! నా నమ్మకం ఏమిటంటే-యీ లోకంలో మంచివారిగా మిగిలిన అనేకులు-అవకాశాలు లభిం చకనే. నువ్వు నిర్ణయించే మంచివారి సంగతి నేను చెప్పాను. నా దృష్టి మంచి చెడులకి అర్హతానర్హతలు వేరు. మనసుకి తనువుకి ఉపశమనమూ సాంత్వనా

కలిగించే మధు మానినులు నా దృష్టికి తప్పులేదు. అసత్యమూ, అపహరణమూ కృత్రిమమూ, వంచనా యివే నా భావనలో దుర్గుణాలు. నా వరకూ మాత్రమే. ముందే చెప్పాను, యీ తప్పొప్పుల నిర్ణయం మనిషి మనిషికీ మారుతుందని. మెల్లగా నేనూ రెండు బ్రతుకుల కలవాటుపడిపోసాగాను. ఎంతో అయిష్టంగానే. ఒకనేనే నేను. రెండవ నేను నేనుకాను. బోట్ హౌస్‌లోనే నా జీవితం. నీ భవనంలోది కేవలం నటన మాత్రమే. ఉండీ ఉండీ నా మనసు బాధపడేది. నేనెంత ఒంటరిని! భార్య ఉంది, దాంపత్యం లేదు. పుత్రుడున్నాడు, వాత్సల్యం లేదు. వారికి నేనేమీకాను! ఈ ప్రపంచంలో–మనిషికి పెద్ద శిక్షేమిటో తెలుసా శారికా? భౌతికంగా అయినా మానసికంగా అయినా ఒంటరితనం! అందుకే కాబోలు జైలుశిక్ష విధిస్తుంటారు నేరస్థులకి. నీ కొక సందేహం కలగ వొచ్చు. పగలు మిత్రులతోనూ రేయి రమణులతోనూ గడిపే నాకు ఒంటరి తనపు బాధ దేనికని. మనిషి తానెవరిని కోరుకుంటాడో వారే తనవారు. వారి సన్నిధిలో ఉంటేనే అతనికి పదిమందిమధ్య ఉన్న తృప్తి భావనా కలుగుతాయి. వారికి దూరంగా– మిగిలినవారెందరి మధ్య ఉన్నా అతను ఏకాకే. అతని మన సుకి నిండుదనం దొరకదు. ఆ రమణుల శరీరాలతో ఆటలాడుకుందుకే కాని వారి అంతర్యాలలోకి నేను తొంగిచూసిందెన్నడు? వారూ అంతే. వారికి కావల సింది నేనిచ్చే కానుకలు. ఖరీదయిన కానుకలు. నా హృదయం వారికి అక్క ర్లేదు. ఇవ్వడానికది నావద్ద లేనూ లేదు. సుఖమనేది కొంతవరకూ మాత్రమే శరీరంతో పొందగలము. అధికభాగం అది మానసికమే.

సిద్ధార్థమీద నాకు అధికారాలయితే లేకుండా చేయగలిగావు కాని శారికా, వాడిమీద నా ఆశలను నాశనంచేసుకోమనలేదు కరుణామయివై. నే నతనిమీద ఆశలు పెంచుకోసాగాను. ఒకనాడు... సిద్ధార్థ ముద్దుముద్దుగా మాటలు నేర్చు కుంటున్నాడు. నువ్వు నేర్పుతున్నావు. ఆ పదజాలం. ఆ రాత్రంతా వింటున్నాను, అమ్మ...రామ...తాత...మామ్మ... శివ అంతే. అక్కడాగిపోయింది. వాడి నోట నాన్నా అనే పదం పలకడంకాదు వినకంఠగింపే అది గ్రహింపుకి వచ్చాక–నా గుండెల్లో శూలమే గుచ్చుకుంది. జీవితంలో ఎన్నడూ అంత అవ మానమూ ఆవేదనా ఎరుగను. నీ గుండెల్లో జాలే లేదా? లేశమయినా కరుణ లేదా? ఇంత కఠినురాలవా శారికా! ఔనులే. నువ్వు సుగుణాలరాశివి. తప్పు చేయవు. తప్పులని క్షమించవు. నీ హృదయం సున్నితంగా ఎలా ఉండ గలదు? సిద్ధార్థని నువ్వేం చేయదలచుకున్నావు? నా మీద నీ పగ తీర్చుకుందుకు

వాడినొక ఉపకరణంగా తయారుచేయదలుచుకోలేదు కద ? నాపై కసి తీర్చుకుందుకు ఆ పసివాడిని పావుగా తీర్చిదిద్దదలుచుకుంటే అంతకంటె అన్యాయం మరేమీ ఉండదని గ్రహించుకో శారికా. వాడిమీద సర్వాధికారాలూ నీవే కాని-ఆ హక్కులని నాశనంకోసం వినియోగించకు. నువొక్కసారి న్యాయం ఆలోచించు. సిద్ధార్థ మన యిద్దరికీ సంతానమే. వాడికి నా వ్యసనాలు దుర్గుణాలూ రాకూడదని నువ్వు కోరుకోవడం ఏమీ అసమంజసం కాదు. కాని-నా దృష్టికి నీ మొండితనమూ క్షమించలేని గుణమూ, యివికూడా మనిషిలో చోటుచేసుకోరానివే. అందుచేత వాడిమీద నువ్వు నా ప్రభావం పడకూడదని ఎలా వాంఛిస్తావో, నేను నీ వొత్తిడికూడా వాడిమీద ఉండకూడదని కోరుకుంటాను. అది న్యాయం కాదూ ? వాడిని స్వతంత్రంగా పెరగనీ. వాడి భావాలూ ఆలోచనలూ ఊహాలూ ఉద్దేశాలూ సిద్ధాంతాలూ విశ్వాసాలూ వాడివే కానీ. మనిషి వ్యక్తిత్వం స్వతంత్రంగానే రూపొందాలి. ఒక చెట్టునీడలో-దాని విత్తునుంచి మొలకెత్తినదే అయినా-మరో మొక్క ఆరోగ్యంగా పెరగిలేదు. సిద్ధార్థ స్వతంత్రుడై-మనలో ఎవరిది తప్పని తీర్పుచెబుతాడో ? నన్ను తండ్రిగా స్వీకరిస్తాడేమో వ్యక్తి అయ్యాక ? అది నా ఆశ శారికా. దాన్ని మూలంలోనే ముక్కలూ చెక్కలూ చేసెయ్యకు-అని ప్రార్థిద్దామనుకున్నాను. కాని, నా ప్రార్థన యిసుకనుంచి తైలం పిండబోవడమే ఔతుందనిపించి విరమించుకున్నాను. తప్పటడుగులు వేస్తున్న తన సంతానాన్ని చేయూతనిచ్చి నడక నేర్పించలేకపోవడం-తన కళ్ళముందే వాడు పడుతున్నా ఏమీ సహాయంచేయకుండా చేతులు కట్టుకుని మిగిలిపోవలసిరావడం-ఎంత బాధాకరమో అనుభవిస్తేనే తెలుస్తుంది.

సిద్ధార్థ పెరుగుతున్నాడు. బడికి వెళ్ళే వయసు వచ్చింది. అక్షరాభ్యాసం అతి ఘనంగా చేయాలని నా సంకల్పం. కాని నువ్వా ప్రసక్తి తీసుకురావడం లేదు గారాబంతో ఆ విషయం మరిచావేమో అని ఆవేళ కదిపాను. "శారికా! సిద్ధార్థకు విద్యాభ్యాసం ప్రారంభించగలిగే ప్రాయం వొచ్చిందనుకుంటాను"

"ఊఁ" అన్నావు నిర్లిప్తంగా.

"త్వరలో-వైభవంగా ఆ ఉత్సవం జరిపిద్దామా?"

"వొద్దు-" అనేశావు కఠినంగా.

"శారికా!" ఉలిక్కిపడ్డాను. ఆ సమాధానం నేనెన్నడూ ఆశించనిదీ అంగీకరించలేనిదీ. విద్యలేని మనిషికి విలువేముంటుంది? అయినా సిద్ధార్థకు విద్యావిహీనంగా ఉండవలసిన కర్మేమిటి? "సిద్ధార్థకు చదువు వొద్దా?"

"చదువు చెబుతాను. చెబుతున్నాను కూడా దానికి ఆర్భాటమూ హడావిడీ అవసరం లేదంటున్నానంతే."

"సిద్ధార్థ మీద అన్ని అధికారాలూ నీవే. కాని-వాడిది జమీందారీ వంశమని విస్మరించకు. వేడుకలకు వాడిని దూరం చెయ్యకు-"

"వాడిని-మనిషిని చెయ్యాలని నా ఆశయం-" నీ వెంత వ్యంగ్యంగా హేళనగా మాట్లాడగలవు! ఎదుటివారి గుండెలలోకి ఎంత సూటిగా గురిచేయ గలవు నీ మాటలని! నీ వ్యంగ్యవు పలుకులు ఈటెలూ బాకులు అయి నా హృదయాన్ని చీల్చి చెండాడుతూంటే-మరో నిముషం అక్కడ నీ ఎదురుగా ఉంటే నిగ్రహం సడలి- తొందరపాటులో నిన్నేం చేస్తానో అని భయపడి - రివ్వున లేచి వెళ్ళిపోయా నక్కడినుంచి. నే నాగ్రహావేశపరుడను కాను కానీ రెచ్చగొడితే సహనం ప్రదర్శించగలిగే శాంతమూర్తినీ కాను. నీ ముందు మాత్రం నాలో ఎక్కడలేని శాంతమూ వొచ్చేది. వాదించి నిన్ను గెలవగలిగినా ఎందుకనో నీ ముందు ఎక్కువ మాటలాడాలనిపించేది కాదు.

నిజానికి- సిద్ధార్థ విద్యాభ్యాసంమీద నాకు చాలా ఊహలూ ఉద్దేశాలు ఉండేవి. కాలం మారుతోంది. మనుషులూ విలువలూ మారుతున్నాయి. విద్యకు కూడా విలువలూ మారుతున్నాయి. సిద్ధార్థకు ఆంగ్లవిద్య అలవర్చాలి. అందుకనువైనవి మిషనరీవాళ్ళ నిర్వహించే కాన్వెంటులే. కొంచెం మతప్రసక్తి ఉన్నా ఆంగ్లభాషను అంగంగానేర్చుకోవాలంటే కాన్వెంటులే సరిఅయిన విద్యాలయాలు. అవి-మనిషిని తీర్చిదిద్దగలవు కూడా. ఇది నీకు చెప్పాలనుకున్నాను. కాని నేనేం చెప్పినా నిష్ప్రయోజనమే అని విరమించుకున్నాను. నా కాశ్చర్యం కొలిపిన విషయమేమిటంటే-నువ్వు సిద్ధార్థను బడికి పంపలేదు. ఉపాధ్యాయులు యింటికి వొస్తున్న చిహ్నాలూ కనిపించవు. మరి-సిద్ధార్థ విద్య సంగతేమిటి? ఒక్కసారి విచారించాను. సిద్ధార్థ మీద కొంచెమయినా అధికారాలుంచుకోనందుకు పశ్చాత్తాప పడ్డాను. అప్పుడు నాకు-నా బిడ్డమీద నా కుండవలసినవి అభిమానానురాగాలేకాని అధికారాలు కావనిపించింది. పుత్రుడిమీద అధికారం చూపడమనే భావనే నా కసహ్యంగా తోచింది. కాని-నువ్వు-నీకు సంక్రమించిన హక్కులను దుర్వి వియోగపరుస్తూంటే నా భావాలు మారాయి. మూన్నాళ్ళ ముచ్చటే అయిన మన వైవాహిక జీవితపు తాలూకు ప్రభావం కొంతయినా నామీద ఎందుకు శాశ్వ తంగా మిగిలిఉందో ఎన్నటికీ చెరుగని మచ్చలాగ! నే నెక్కువ పరితపిస్తున్నది సిద్ధార్థకు దూరంగా ఉండవలసి వొస్తున్నందుకు. నన్ను నువ్వు వాడికి కూడా

మనసూ మనసూ కలసి ఎవరితోనైనా అక్కడి వాళ్ళతో
నువ్వు ప్రేమలో పడితే నాకేం అభ్యంతరం లేదు కాని....




నిషిద్ధవ్యక్తిగా చేసి వొదిలినట్లున్నావు. సిద్ధార్థ కూడా నా ముందుకు రాడు సాధ్యమైనంత వరకూ. తండ్రిగా నా ముచ్చట్లు నాలో దాచుకోవలసిందే. అలాగ దాచుకున్న సరదాలు గుండెలను ఊచకోతకోసేవి ఇదేమి సంసార జీవితం? నా భవంతిలో నే నతిథిని! నా ధర్మపత్నికి, నేను పరపురుషుడిని!! నా పుత్రుడికి నేను అపరిచితుడిని!! శారికా భార్యగా నువ్వు కోరాలి. భర్తగా నేను తీర్చాలి. పుత్రుడిగా సిద్ధార్థ అడగాలి. తండ్రిగా నేనందించాలి. అందులోనే ఎంతో తృప్తి ఉంది. మనిషి కోరుకునేదదే. కాని నాకు కొంచెమయినా లభించనిదీ అదే. ఐశ్వర్యం పూడ్చలేని లోటు, అర్థం-అనుబంధాలు కలిగించేంత ఆనందం కలిగించజాలదు.

శిల్పానికి రూపే తప్ప భావాలు ఉండవు. బయటకు నేను శిల్పంలాగే రాతిముఖం వేసుకుని ఉండడం అలవరచుకుంటున్నాను. హృదయంలో రేగే అగ్నికీలల వేడి నా శరీరం మీదకు ప్రసరించకుండా అప్రమత్తంగా ఉంటున్నాను. అందుకే - నాలో నిరంతరమూ జరిగే సంఘర్షణ తాలూకు ఛాయలైనా ఎవరికీ తెలియవు. కనీసం నీకు కూడా. హృదయస్పందనను కూడా నిబిడీకృతంగా ఉంచుకోవలసిరావడం చాలా పెద్ద శాపం సుమా.

రెండు పడవలమీద ప్రయాణం వంటిదే రెండు ముఖాల బ్రతుకూ. మొదటిది మనిషిని శారీరకంగా చంపితే, రెండవది మానసికంగా అనుక్షణమూ హింసించి హింసించి వొదులుతుంది. రెండు రకాల జీవితమంటే నాకు పరమ అసహ్యం. కాని – నా నొసట అదే లిఖించావు.

మీ యింటికిరాక తప్పదు నాకు. లోకంకోసం నా కోసమూ.

మీ యింటి మెట్లెక్కుతూనే పవిత్రుడినై పోయేవాడిని. ఉహుం. ఆ పాత్ర నటించేవాడిని. నిజంగా నాకు తెలియదు నా నటన సిద్ధార్థను నాశనం చేస్తుందని. తెలిస్తే నీ కిచ్చిన మాటను వెనక్కితీసుకుని అయినా వాడి జీవితాన్ని రక్షించేవాడినే.

శారికా! ఏందుకలా కన్నీరు పెడుతున్నావ్? నీమీద నిజంగా నీకే కొంచెమయినా ప్రేమ ఉందా? ప్రేమలేనిచోట కన్నీరుకి తావుండదు. అది – నటనే ఔతుంది. నీకు నటించవలసిన అవసరమేముంది? నీ హృదయం శిలాసదృశమే. తప్పుని క్షమించలేక నా జీవితం నాశనంచేశావు. నీదీ అనుకో. విచిత్ర దాంపత్యమూ వింత జీవితాలూ అయిపోయాయి మన్వి. మనని చూసి ప్రపంచం తెలుసుకోవలసినదీ జాగ్రత్తపడవలసినదీ ఉందేమో. మంచిని నేర్చుకోడంతో సరిపోదు. చెడుని కూడా తెలుసుకుని దూరంగా ఉండాలి. వెలుగులో కనిపించని కొన్ని నిజాలు చీకటిలోనే కనిపిస్తాయి. జీవితం- వెలుగు చీకట్ల ద్వంద్వమే. ఈ నలుపుతెలుపు గడలను దాటుకుంటూ ముందుకి సాగేదే మానవజీవితం కేవలం తెల్లగడులనే నమ్ముకుంటే జీవనఖేల రసమయంగా ఉండదు మన దాంపత్యంలాగే తయారౌతుంది. నీ కన్నీరు తుడవాల నాకుంది. కానీ చేసిన వాగ్దానం వెనక్కిలాగుతూంది. ఏడవకు శారికా ఏడవకు. నీ కనుల నీళ్లు నే చూడలేను. నేను వెళ్ళిపోతున్నాను శాశ్వతంగా. ఏడవ ఏడవకు

* * * *

శారిక:- ఏ పురాక నాకు మిగిలిందేముంది? ఏడవక నేను చేయగలిగే ముంది? నా పరిస్థితిలో ఉన్న ఏ స్త్రీ మాత్రం దుఃఖించడంకంటె ఏం చేయగలదు? ఎటువంటి దయనీయమయిన పరిస్థితి యిది! కన్నకొడుకు – భర్తని హత్యచేశాడు. ఆ హంతుడు నా పుత్రుడు. ఆ భర్త – నా భర్త. ఆ యిరువురి మధ్యని నిలబడడానికి నేనెంత వాణిపోతున్నాను! అంతరంగం నిలదీసి ప్రశ్నిస్తూంది – నువ్వు చేసింది తప్పుకాదా అని. ఏది తప్పు, ఏది ఒప్పు? తిరిగి అడగాలనిపిస్తుంది.

నేను ఆయన్ని ప్రేమించలేదేమో అని విశ్వనాథ్ అనుమానం. ప్రేమిస్తే మరోలాగ ప్రవర్తించి ఉండేదాన్నని ఆయన ఉద్దేశం కాని యీ విషయంలో ఆయన పొరబడ్డారని చెప్పక తప్పడంలేదు. వలపు గిలక రించకపోతే ఆ సాయంసంధ్యలో ఆయన నివేదించిన ప్రేమను నిర్లిప్తంగా వొదిలెయ్యక హృదయంలోకి తీసుకునేదాననేనా? ఆ ముహూర్తం .. మే మిరు వురమూ పరస్పర వీక్షణం గావించుకున్న క్షణం ఎంత దివ్యమైనది! ఎంత ప్రతిభావంతమైనది!

ఏటిగట్టున నిలబడి - అవతల - కొండల కవతల చిత్రంగా పొతున్న సూర్యాస్తమయాన్ని తిలకిస్తున్నాను. ఆకాశంలో రంగురంగుల రంగవల్లులు తీర్చిదిద్దినట్లున్న మేఘాలు. సూర్యకాంతి పడని కొండలు నలుపుకి తిరుగు తున్నాయి. ప్రకృతి - నిత్యసుందరమే. పరవశించి - పరధ్యానంగా నిలుచున్న నేను - ఉలిక్కిపడ్డాను. తల తిప్పిచూశాను. వారు! ఎవరో తెలియదు. కాని - గౌరవించాలన్న భావన కలిగింది. స్ఫటికంలాంటి శరీరకాంతి. స్వచ్ఛతా సరళతా మూర్తీభవించినట్లున్న ముఖం. సుందరమయిన విగ్రహం. చంద్ర కాంతశిలలో మలచిన మహారాజులా — ఆయన. ఒక్కసారి ఎందుకో నా కన్నె మనసు తొణికింది హృదయం అర్ధమయింది. గుండె జల్లుమంది. అంతలోనే — "యత్ర రూపం తత్ర గుణాః", అన్న అర్యోక్తి మెదిలింది మెదడులో. ఇంత సుందరుడు ఎంత సంస్కారవంతుడో! ఎంత సుగుణశీలో! ఊహించుకో సాగాను. ఆయన కన్నులలో ఎంత ఆరాధన! పలుకెంత తీయన! నాకు తెలి యదు వారు జమీందారని. మొత్తంమీద నాకు వెర్రికేమ వైభవంమీద వ్యామోహంలేదు, ఆడంబరాలమీద కోరికా లేదు, కాని— వారు నా ప్రేమనడిగి నప్పుడు- వారి నొకవ్యక్తిగా మాత్రమే పరిగణించి - అంగీకారం తెల్పాను. నమ్మినా మానినా యిదే నిజం విశ్వనాథ్! నాన్నగారు మీ వివరాలు చెప్పి నప్పుడు నాకు భయంవేసింది మీ అంతటివారు నన్నెందుకు స్వీకరించదలచు కున్నారో నా అపరిపక్వ మేధ కందలేదు. కాని- మీపట్ల నాకప్పటికే ఏర్పడి పోయిన ఆకర్షణ నన్ను మరోమాట చెప్పనీయలేదు. అమ్మా నాన్నా పొంగి పోతున్నారు. నాకు లభించుతున్న అదృష్టాన్ని తలుచుకుంటూ. నిజంగా వాళ్ల ఒకరకంగా అమాయకులే ఏమో. కాకపోతే పురాణాలూ ఉపనిషత్తులూ జీర్ణించు కొగలిగిన నాన్నగారు- మనిషి సుఖం లక్షలలో ఉంటుందని భ్రమపడడ మేమిటి?

నన్ను అమ్మా నాన్నా ఎలా పెంచారని? సంస్కృతాంధ్రాలలో కొంచెం జ్ఞానం కలిగించారు. బడిపంతులయిన నాన్నారు నాకు దేశచరిత్రను తెలియ చేశారు. అమ్మ- పతివ్రతల కథలు చెప్పేది. అయితే అవి స్త్రీ వ్యక్తిత్వాన్ని కించపరిచేవీ కొంచెంచేవేవీ కావు. ఆ పాతివ్రత్యం - పతిని తీర్చిదిద్దగలిగేది. సన్మార్గంలో పెట్టగలిగే సాహసాన్నీ శక్తినీ యివ్వగలిగేది.

"స్త్రీ- మగవాడి నీడకాదు శారికా! అతనికి అవసరాన్నిబట్టి నీడ నివ్వ గలిగేది. అతిన్ననుసరించడం అంటే - గుడ్డిగా అతను చెప్పేది ఆచరించడం కాదు. సదసద్వివేచక్షణ గావించి అతన్ని సన్మార్గంవేపు నడిపిస్తూ అతనికి తోడుగా అడుగువేయడం. పుట్టిన క్షణంనుంచీ పురుషుడిమీద స్త్రీ ప్రభావం ఉంటూనే ఉంటుంది. శీలమనేది స్త్రీకెంత ముఖ్యమో పురుషుడికీ అంత ముఖ్యమే. పురుషుణ్ని శీలవంతుడిగా ఉంచడం స్త్రీ బాధ్యత ." ఇలాగ చెప్పేది అమ్మ. నా వ్యక్తిత్వం అలాగే వికసించసాగింది. నాలో అవే భావాలు చైతన్యం సంతరించుకునేవి. నావి- అనే ఉద్దేశాలూ సిద్ధాంతాలూ స్థిరపడసాగాయి. బలమైన విశ్వాసా లేర్పడసాగాయి. నీకు అప్పుడు నిజంగాతెలియదు నే నేర్పచు కుంటున్న ఆదర్శాలే భవిష్యత్తులో నాపట్ల ఉరితాళ్ళౌతాయని. తప్పుచేసి పశ్చాత్తాపపడి,- క్షమనర్థించడం కాదు. తప్పు చేయకపోడమే ఔన్నత్యం. మనిషికి నిజమయిన సంపద- శీలమే. ఎవరి జీవితమైనా స్వచ్ఛంగానూ పవిత్రంగానూ ఉండాలి ఒక్క- ఉప్పుగల్లు కడివెడు పాలనూ విరుస్తుంది. ఒక్క- వ్యసనం దుర్గుణం జీవితాన్నంతటినీ చెరుస్తుంది. వివాహమై మీ యింటికి వొచ్చాను. ఇల్లంటే . అదే భవనం .. మీ భవంతి నన్ను సాదరంగా ఆహ్వానించింది. చేరదీసింది. కాని అదెన్నాళ్ళు? ఆశయాలు ఆ ధర్మాలు ఉన్నా నేనేమీ అతీతురాలిని కాను సామాన్య స్త్రీనే. నాది స్త్రీ హృదయమే. మీరు చూపుతున్న అనురాగానికి మురిసిపోయాను. మీ ప్రేమవాహినిలో తలమునకలయ్యాను. గర్భవతినయ్యేవరకూ అనుక్షణమూ నేను మీ వలపుజల్లులలో అమృతస్నానాలే చేశాను. గర్భందాల్చాక నా ఆనందం మరీ అధికమైంది. జన్మకు సార్థకత లభిస్తున్నట్లు తృప్తి. ఈ సృష్టికి నేనూ సహకరిస్తున్నాను.ప్రకృతి నామీద ఉంచిన బాధ్యతను సక్రమంగా నిర్వహించగలుగుతున్నాను. నేను- పరిపూర్ణ స్త్రీని. మీకు అనురాగమయి అయిన అర్ధాంగిగా నా పాత్ర చక్కగానే నిర్వహించిగలుగుతున్నాను. కొంచెం కాలంలో "అమ్మ" పాత్ర కూడా అద్భుతంగా అతి సమర్థవంతంగా పోషించ గలగాలి. అమ్మ !- ఎంత తీయని పదం. ఏ భాషలో నయినా అతిమధుర




మయినా పదం 'అమ్మ' మాత్రమే అనుకుంటాను. నాలో ఊహలు తీవెలు సాచుకుంటున్నాయి. కలలు పదేపదే తలలెత్తుతున్నాయి సాగరంలో అలల లాగ. జన్మించబోయే శిశువు స్త్రీ అవాలని కానీ పురుషుడు కావాలని కానీ ప్రత్యేకమయిన కోరికేమీలేదు. భగవంతుడి దృష్టిలో- సృష్టిలో స్త్రీ పురుషులు సమానులే. ఒకరి అధిక్యతాలేదు, మరొకరి అల్పత్వమూ లేదు.

బాబు పుట్టాడు. సిద్ధార్ధ- అనేది నాకే తట్టిన పేరు. నాన్నగారి సూచన కూడా ఉన్నా అది వేరే విషయం ః జీవితానికి వాడొక అర్థం చెప్పుకోగలగాలి. జీవితం వాడి కర్థంకాగలగాలి. అందుకని వాడు- 'సిద్ధార్థ'. వాడిని పురుషోత్తముడిగా తీర్చిదిద్దాలని నా ప్రగాఢవాంఛ. వాడు మరో శివాజీ కావాలి. జిజియాబాయి పాత్ర ధరించడానికి నేను సంసిద్ధురాలినే. ఇంతవరకూ నా ధ్యేయం మిమ్మల్ని ఆనందపరచడం. సిద్ధార్ధ పుట్టాక నా లక్ష్యం వాడు. సంతానవతి కాగానే స్త్రీ దృక్పథంలో యీ మార్పు సహజమనుకుంటాను.

భవనంలో వాడితో అడుగుపెట్టాను. మీకోసం మనసు తహతహలాడుతోంది. దేవతలపాపలాటి సిద్ధార్ధను మీకు నేను చూపించి మీరు తృప్తిగా వాడివంక చూస్తుంటే నేను గర్వపడాలి. నా జీవితం సఫలత చెందిందని సంతోషించాలి. తనువు మీ కౌగిలిలో కరగిపోవాలనీ, మనసు మిమ్మల్ని పెనవేసుకోవాలనీ,

అ(త్రతత చెందుతున్నాయి. అవకాశంకోసం ఎదురుచూస్తున్నాను. పుత్రోత్సా హంతో మీరు చాలా ఆర్భాటం చేస్తున్నారు. విందులు . వినోదాలు భవంతి కోలాహలంగా ఉంది. మనకి ఏకాంతం లభించడానికి వాయిదా పడుతోంది. సరిగ్గా అప్పుడు . తెలిసింది. కాలకూట విషంకంటె చేదునిజం. పాము కోరకంటె ప్రమాదకరమయిన నిజం. నేను లేనివేళ_ మీరు సాగించిన జీవితం .. దానిని మీరు విలాసమంటారు కాబోలు. నేను వ్యసన మంటాను.

జూదం పానం జారత్వం .. మూడింటికి మూడూ వ్యసనాల్లో శిఖరాలే. మీరు వాటికి వశులయ్యారు! నా హృదయంలో కార్చిచ్చు చెలరేగింది. నేనెటు నిర్ణయించుకోవాలి?

వ్యసనం అంటే స్వప్నంలో కూడా ద్వేషమే. త్రాగుబోతనే పదం వింటేనే వొళ్లు కంపరమెత్తి శిరస్స్నానం చేసేవరకూ శరీరమూ హృదయమూ స్తిమితపడవు. మీరు - నాభర్త - పరస్త్రీ స్పర్శతో అపవిత్రులయ్యారు! నేను పశ్చాత్తాపపడ్డాను, మిమ్మల్ని ప్రేమించి నందుకు. మీవంటి కల్మషులకు నాకన్యాత్వాన్ని సమర్పించినందుకు. దేవుడనుకుని -దెయ్యానికి యీ శరీర కుసుమాన్న ర్పించానే అని పశ్చాత్తాపపడ్డాను. ప్రాయశ్చిత్తం చేసుకోవాలి. లేకపోతే నాకు తోచదు. మీరు దీనిని సంకుచిత హృదయమనే అనండి. మరేమన్నా అనండి. నేను తప్పుచేయను. తప్పుని క్షమించనూ క్షమించను.ఇది నా బలహీనత అయినా సరే. స్త్రీలోలురూ మధుసేవకులూ అయిన మీతో కొన్ని నెలలు గడిపిన నేరానికి నాశేషజీవితమంతా మీ స్పర్శకు దూరంగా ఉండడం_నాకు నిష్కృతిగా అని పించింది. ఈ శిక్ష సరి అయినదే. అని మనసూ అంతరాత్మా అంగీకరించాయి. పాతివ్రత్యం సంగతి? మీరు ప్రశ్నించవచ్చు. దానికి ముందే చెప్పాను సమాధానం పాతివ్రత్యం కంటే కూడా శీలమే ప్రధానమని వాచా మనసా కర్మణా విశ్వసించిన వింతస్త్రీని నేను. నిర్ణయం తీసుకుందుకు ఎంత సంఘర్షణకు లోను కావలసి వచ్చిందని!

సిద్ధాంతాలూ విశ్వాసాలూ నియమాలూ ఎన్నిఉన్నా నేను స్త్రీనే. నాలో స్త్రీత్వం నాకెదురుతిరగసాగింది. మనసుకీ తనవుకీ మధ్య జరిగిన హోరాహోరీ పోరాటమది. అంకరంగం కోలాహలమయమైంది. శరీరానికనుభూతులు కావలి.అనుభవాలు కావాలి. వయసుచేసే వొత్తిడి కొంచెంకాదు. అందులోను మిమ్మల్ని అమితంగా ప్రేమించానంతవరకూ. మిమ్మల్నిచేజేతులా వొదులు కోడం దూరంచేసుకోడం -నాకిష్టమౌతుందా? సులభంగా సాధ్య పడుతుందా?

ఈ అసిధారావ్రతం చివరివరకూ నిలుపుకోగలనా? నేను నాకు విధించుకుంటున్న దేమిటి? భర్త ఉండగానే వైధవ్యం!.... మంగళసూత్రం ఉండీ భర్తలేనట్టే భావాన్ని పెంచుకోడం! ఎవరయినా క్షమిస్తారా నన్ను? స్త్రీలోకం గర్హించదూ నన్ను? నాతిగల బ్రహ్మచర్యం అన్నపదమే ఉంది భాషలో-వాడుకలో. నేను చేయబోతున్నది-పతిగల బ్రహ్మచర్యం అనే పదాన్ని వాడుకలోకి ప్రవేశ పెట్టడమే ఔతుందా?

ఆదర్శం....అనుభూతి....రెండింటిలో ఎటు మొగ్గాలి?

వ్యక్తిగత విశ్వాసం-పాతివ్రత్యం....ఏది గొప్ప?

సంప్రదాయం....విప్లవం.... దేనిది పైచేయి కావాలి?

నాకు తెలుసు....నాలాటి స్త్రీ లెందరో పరిస్థితులు తెచ్చిపెట్టిన-పతిత్వం లేని భర్తలతో కాపురంచేస్తూనే ఉన్నారు. పతివ్రతల కథలూ చాలా మట్టుకు అలాగే ఉన్నాయి. సుమతి-భర్తను స్వయంగా వేశ్యాంగన వద్దకు మోసుకు వెళ్లిందట. ఇవన్ని నా ఆలోచనలలోకి రాకపోలేదు. మరి-అవి ఎటువంటి క్షణాలో?....పాతివ్రతం కంటే వ్యక్తిత్వమే ముఖ్యమన్న కొత్త క్షణాలోనే జీవితాన్ని నడంపిచాలనుకున్నాను. నేను తలపెట్టినది త్యాగమని తెలుసు. యజ్ఞమనీ తెలుసు. కాని-మనసు మార్చుకోదలుచుకోలేదు. ఇదిగిది ప్రేమని నాపట్టుదలే జయించింది. ఎంత గుండెదిటవు చేసికోవలసివచ్చిందని మీకా మాట చెప్పడానికి! ఎంత కఠినత్వం ప్రదర్శించగలిగాను!....“మీరు నన్ను మెట్టి కున్నారో....నేను మీకు దక్కను. నన్ను. నేనే వహించుకుని ఆత్మత్యాగం చేసుకుంటాను. నాపడకగదిలోకి పొరపాటుగా కూడా మీ రడుగు పెట్టరాదదు.”

“స....రే....”

మీ రంగీకరిస్తారనికోలేదు. మన మధ్య జరిగిన కొంత వాదనకేం, అది పెద్దలెక్కలోనిదికాదు. మీ రెందుకంగీకరించారు? జీవంలేని కట్టెలాగ ఎందుకూ పనికిరాకుండా-నామమాత్రపు భార్యగా నేను మీకుండి ఏం ప్రయోజనం? అదే అడిగాను మిమ్మల్ని ఆశ్చర్యంగా చూస్తూ. “లోకంకోసం. నువ్వు నన్ను విడచిపెడితే లోకం నవ్వుతుంది. ఇదీగాక నాకో ఆశ కూడా ఉంది.”

“ఏమిటి?”

“నీ పంతం శాశ్వతంకాదేమో అని. నాకు తెలుసు శారికా నీకు నామీద చాలా ప్రేమ.”

"ఆ ప్రేమంతా యిప్పుడు ద్వేషంగా మారిపోయింది. మీరు వ్యసన పరులన్న అనుమానం లవలేశం కలిగినా మిమ్మల్నీ మీ ప్రేమనీ ఏంత మాత్రమూ అంగీకరించి ఉండేదాన్ని కాను."

"నువ్వేవి వ్యసనాలంటున్నావో అవి - ఐశ్వర్యవంతుల జీవితంలో సామాన్యమైన భాగాలే."

"ఐశ్వర్యం గురించి నాకు తెలియదు. పేదకుటుంబం నుంచి వొచ్చిన దాన్ని సరే. కయ్యానికేమో కాని నెయ్యానికి మాత్రం సమానులు కావాలన్న దాన్లో చాలా సత్యమున్నట్టుంది."

"నేను నిన్ను ఎగతాళి చేయలేదు శారికా?"

"అలాగని నేనూ భావించడం లేదు. ఈ సంపదా ఐశ్వర్యమూ నావి. కాంతాకనకాలు మీకెంత సంతృప్తినీ గర్వాన్నీ అతిశయాన్నీ యిస్తాయో నా విశ్వాసాలూ భావదైన్యమూ నాకంతకంటే ఎక్కువ తృప్తినే కలిగిస్తాయి. నా జీవన విధానంలో నాకు పూర్తి నమ్మకం ఉంది. ఈ ప్రపంచం సుఖశాంతుల తోనూ నిజమైన మనుషులతోనూ విలసిల్లాలంటే ఉపకరించేవి నా విశ్వాసాలే తప్ప మీ భ్రమలు కావని స్పష్టంగా చెప్పగలను."

"శారికా?"

"క్షమించండి. ఇలాగ జరిగాక నేను కొంచెమూ దాచుకోదలచలేదు. సిద్ధార్థని నాదిగా నేను కోరుకుంటున్నాను. ఈ కోరిక తీర్చితే.., నిజంగా నేను అదృష్ట వంతురాలినౌతాను. నేను గడపబోయే నిస్సారజీవితానికి అర్థమూ ధ్యేయమూ ఏర్పడతాయి. సిద్ధార్థ నాకు అచ్చంగా కావాలి. నాకే అంతా కావాలి. వాడిని నా యిష్టానుసారం పెంచుతాను. నాకు నచ్చిన రీతిలో మలుచుకుంటాను. నేను కోరుకునే వ్యక్తిత్వాన్ని వాడిలో రూపొందిస్తాను. వాడిమీద అన్ని అధికారాలూ నాకే చెందాలి. వాడి పెంపకంలో మీ ప్రమేయం ఏమీ ఉండకూడదు. మీ ఐశ్వర్యం తాలూకు అవలక్షణాలేమీ వాడికి సంక్రమించకూడదు. మీ వ్యసనాల వారసత్వం వాడిని వరించకూడదు. అదీ నా ప్రగాఢ వాంఛ. నేను కోరుతున్నది చాలా తీవ్రమైనదీ కఠినమైనదీ అని తెలుసు. కాని గత్యంతరంలేదు. నేను గడపబోయే రసవిహీనమైన జీవితం - విసుగుకొల్పకుండా ఉండాలంటే - నా బ్రతుకు నాకే శుష్కంగానూ వ్యంగ్యంగానూ తోచకుండా ఉండాలంటే - నా ముందొక లక్ష్యం ఉండాలి, అది నిర్దిష్టమైనది కావాలి. సిద్ధార్థని నేనలా తీసుకోవాలని మనస్ఫూర్తిగా కోరుకుంటూ మిమ్మల్ని యీ భిక్ష పెట్టవలసిందిగా వేడు



కుంటున్నాను."

"ఆవేశపడకు శారికా! ఆవేశం ఆలోచనను హరిస్తుంది. నీ ఊహ అసమంజసమే కాదు, అన్యాయం కూడా"

"ఎందుకని?"

"పూవుని బలవంతంగా వికసింపజేయడంలాటిదే ఒకమనిషిని తయారు చేయబోవడమూను. పుష్పం సహజంగా వికసిస్తేనే అందం. వ్యక్తిత్వ వికాసమూ అంతే. గిరిగీసిన బ్రతుకులో సహజత్వం లోపిస్తుంది-"

"సహజత్వం పేరిట రాక్షసుడు రూపొందడం కంటే- అసహజంగా నయినా వికసించిన మానవుడే మేలు."

మీరు దెబ్బతిన్నట్లు చూశారు.

మెల్లగానే అన్నాను. "నాకూ రెండు ముఖాల జీవితమంటే అసహ్యమే. సూటిగా బ్రతకగలగాలనే కోరుతాను. అందుకే మీముందు నన్ను నేను స్పష్ట పరుచుకున్నాను. చెప్పండి.సిద్ధార్థను- బేషరతుగా- నాకు శాశ్వతంగా ధారాదత్తం చేయదలుచుకున్నారా ?"

మీరు సాలోచనగా సిద్ధార్థవంక చూడసాగారు.

ఇద్దరికీ మధ్య- బల్లమీద- పరచిన కంబళిమీద పవళించి ఉన్నాడా పసి పాప.

"ఒక్కసారి వాడిని లాలించి ముద్దిడి ఆశీర్వదించనీ "

"క్షమించండి. మీరు ముట్టుకుంటే వాడు అపవిత్రుడౌతాడు. మీ స్పర్శంటే ఏర్పడ్డ జుగుప్స కారణంగానే కదా నేను మీకు అస్పృశ్యనౌతున్నది ?"

"శారికా !" అరిచారు మీరు. మీ వదనాన్ని ఆగ్రహం ఆవరించింది. మీ నేత్రాలు అరుణిమను తెచ్చుకున్నాయి. నేను జంకలేదు.

"శరీరానికి నువ్వెందు కింత ప్రాధాన్యత నిస్తున్నావు మూర్ఖంగా ? సంస్కృతగ్రంథాలు చదివినదానవే శాస్త్రాలూ పురాణాలూ ఘోషించలేదూ, పాపమనేది ఆత్మకే కాని శరీరానికి కాదని ?"

హేళనగా నవ్వాను. "దానినే మెట్టవేదాంతం అంటారు. తప్పుచేసేవాళ్ళు వెదుక్కునే రక్షణ అది అంతరాత్మకలవాళ్ళు వెదుక్కునే రక్షణ అది. అంతరాత్మకలవాళ్ళు నిగ్రహరహితులై ప్రవర్తించరు. మనోనిగ్రహం కలవారికి శారీరక నిగ్రహం అతిసులభం. తేల్చి చెప్పండి, సిద్ధార్థను నాకిస్తున్నారా మీరు తీసుకుంటారా ? వాడిని - ప్రపంచం గర్వించే మనిషిగా తయారుకానిస్తారా, లేక మధుపాత్రల వెనుకా వెలయాలుల వెనుకా క్రీనీడల బ్రతుకుపాల్జేయ దలుచుకున్నారా?"

ఒక్కసారి నా కళ్ళల్లోకి సూటిగా చూశారు. ఆ చూపుని తట్టుకోడం కష్టమే అయింది. అవి నా గుండెలనే చీల్చాయి. హృదయంలోకే చొచ్చుకు పోయాయి.

"తీసుకో-"

ఎప్పుడు మీ నోట ఆ మాట వొస్తుందా అని ఆత్రంగా ఎదురుచూస్తున్నా నేమో, మీరు అలా అనడమేమిటి, చటుక్కున సిద్ధార్థను చేతుల్లోకి తీసుకుని యివతలకి వొచ్చేశాను, ఆలస్యం అయితే ఆ అమృతం ఫలం చేజారి పోతుందేమో అన్న భయంతో నా గదిలోకి వొచ్చేశాను పరుగుపరుగున. తలుపులు మూసుకుని- తనివితీరా దుఃఖించాను. అప్పటికి గుండెలు తేలిక పడ్డాయి.మనసుకి కొంచెం ఊరటకలిగింది తాత్కాలికంగా అయినా.

మనిషి మంచి చెడులు మరణంతో సరి అంటారు పెద్దలు. ఈ క్షణంలో మీమీద నాకేమీ పగా లేదు ద్వేషమూ లేదు. అందుకే - మనసు విప్పి - నిజం మీకు నివేదించు కుంటున్నాను. ఎందుకో తెలుసా? మీక్షమాపణ లర్థించి? నిజమే. ఎందుకో నేను చేసింది తప్పేమో అని సందేహం కలుగుతూంది. అంతేకాదు, సిద్ధార్థని హంతకుణ్ని చేసింది నేనే అంటున్నది అంతరాత్మ. జీవితాన్ని వెనక్కి తీసుకో గలిగే శక్తే నా కిప్పుడు భగవంతుడు ప్రసాదిస్తే-నిశ్చయంగా నేను రెండో మార్గాన్నే ఎన్నుకుంటాను.

ఏ రెండు ముఖాల బ్రతుకునయితే నే నమితంగా ద్వేషించేదాన్నో, దేని కోసం మిమ్మల్ని దూరంచేసుకున్నానో అటువంటి బ్రతుకే మిగిలింది నాకు. మీ ముందు-ఎంత కఠినంగా కనిపించేదాననో, మీ వెనుక అన్ని కన్నీళ్లు కార్చే దానను. మీకు సిద్ధార్థమీద ప్రేమ అధికమేనని నాకు తెలుసు. వాడిని మీకు దూరంచేయాలని నేను కఠినంగానే ఆంక్షలు పెట్టేదాన్ని. అన్నింటినీ భరించి- వాడిని కనీసం కళ్ళతోనయినా చూసుకుందామని మీరు తరచుగానే భవనానికి వొచ్చేవారు. మీ అవస్థకు మనసులో జాలిపడేదాన్ని, కాని-బయటకు మాత్రం క్రూరంగానే ప్రవర్తించేదాన్ని. ఏ క్షణంలోనూ నేను బలహీనురాలిని కాకుండా అతి జాగ్రత్తపడేదాన్ని. నాకు జరిగిన అన్యాయం తలుచుకునేదాన్ని తరచుగా. ఎప్పటికేనా- మీరు "క్షమించు శాంతా! నీకోసం....మన ప్రేమకోసం....నే నన్ని వ్యసనాలనూ త్యజించాను. ఇక నుంచి వాటన్నిటికీ దూరంగా ఉంటాను. నన్ను చేర్చుకోవూ?" అని అడుగుతారేమో అని ఆశపడేదాన్ని. ఎదురు చూసేదాన్ని. మీ రలాగ వొస్తే క్షమిస్తానని కాదు. ఆ మార్పు మీలో వొస్తే సంతోషిద్దామని. అంతే. ఆ క్షణం-మీ జీవితంలో చివరివరకూ రాలేదు. ఎందుకు వొస్తుంది? వ్యసనాల ఊబిలో అడుగుపెట్టి జారిపోవడమే తప్ప బయటపడడం అనేది అరుదు. అదీకాక మీరు మారవలసిన అవసరమూ లేదు. మీ ధనంతో స్త్రీల శరీరాలను కొనగలరు. సుఖించగలరు. మనసులోకి ఆలోచన రాకుండా మధుపానంలో

ములగగలరు. మీ దృష్టిలో సుఖం గురించి ఉన్నతమయిన ఉద్దేశాలు లేవు. ఒక రకమయిన చీకటికి అలవాటుపడిపోయి అదే వెలుగనే భ్రమలో కొట్టు కుంటూ—నిజమయిన కాంతిని చూడలేని, అర్థంచేసుకోలేని స్థితికి వచ్చేశారు. మిమ్మల్ని చూసి జాలివేసే దప్పుడప్పుడు. మీరే కాదు ప్రపంచంలో చాలా మంది అంతో యింతో మీలాగే ప్రవర్తిస్తున్నారు. నన్ను మీరు—" పంజరంలో చిలుకలాగ నీకూ ఎక్కువ ప్రపంచం తెలియదు. మనిషి ఎలాగ బ్రతుకు తున్నాడో, నేటి మానవుడి కోరికలూ ఆలోచనలూ ఏమిటో అవేమీ నీకు తెలియవు. అందుకే నీ ఆలోచనా సరళీ, జీవిత దృక్పథమూ ఛాందసంగానూ విడ్డూరం గానూ ఉన్నయ్ నాగరికత గురించి నువ్వు తెలుసుకోడం లేదు శారికా!" అన్నారు. ఐతే—మరొక విషయం గమనించలేకపోయారు. నేను ప్రపంచ ధోరణి పట్లా మనిషిలో వొస్తున్న మార్పుపట్లా అమాయకంగానూ అజ్ఞానంగానూ లేను. ప్రపంచాన్నీ మనిషినీ అర్థంచేసుకున్నాను కనుకనే నా సిద్ధాంతాలూ విశ్వాసాలూ వీటి విలువలోపాటు వాటి అవసరాన్నీ గుర్తించాను స్పష్టంగా. వీటి అవసరం—మున్నెన్నడూ లేనంతగా ఉంది యిప్పుడే. చీకటిలోనే కదా దీపాల అవసరం?

నేటి మానవుడు పురుషార్థాలు నాలుగింటిలోనూ తొలిదీ చివరదీ అయిన ధర్మ మోక్షాలను మాని—నడుమ రెండూ అయిన అర్థకామాలను మాత్రమే ఆశ్ర యిస్తున్నాడు. అవే జీవితం అనుకుంటూ అంధకారంలో కొట్టుమిట్టాడుతున్నాడు. వీటి వల్లనే అతను పతితాకర్షితుడౌతున్నాడు.

అందుకే ప్రపంచం వంచనామయమౌతూంది. సత్యం శివం సుందరం— అన్నవి దూరం ఐపోతున్నాయి సామాన్య మానవుడి జీవితంనుంచి. "మాతాపుత్ర హిరణ్యాయ—" అన్నది నిజంగా నిజమౌతూంది నేటి మానవుడి విషయంలో. ధనం ముందు—బంధుత్వం లేదు, మానవత్వం లేదు, ఏమీలేదు రక్తపాతంతోనైనాసరే లక్షాధికారి కావడమే మనిషి ధ్యేయం. తన సుఖాన్నీ విలువనీ అన్నిటినీ రూపాయల పోగుకి కుదవబెట్టుకోవడంలో మనిషి అతనేం కోల్పోతున్నాడో అర్థంచేసుకోలేక పోతున్నాడు. ఈ ధనవ్యామోహం అనే అంధకారంలో—అవినీతి, లంచగొండితనం వంచన, స్వార్థం అనే పిశాచాలు స్వేచ్ఛగా విహారాలు సల్పుతున్నాయి. ఇవి వీరవిహారంచేస్తూ మనిషిని మరింత గుడ్డివాణ్ణిచేసి నడుపుతున్నాయి. బ్రతుకు కంటె బంగారం విలువ పెరుగుతూందంటే—యిదెంత దౌర్భాగ్యం! కొద్ది రూపాయలకోసం ఎదుటివాడి ఉసురైనా హత్యచేసేందుకయినా వందే




హించడంలేదు నేటి మనిషి. అంతగా ప్రబలిపోయింది ధనవ్యామోహం నేటి ప్రపంచంలో. మరో దౌర్భాగ్యం ఏమిటంటే—జన్మనిచ్చే స్త్రీ; పెంచి పెద్దచేసే స్త్రీ; జీవితాన్ని వెలిగించే స్త్రీ; సృష్టిని నిలబెట్టే స్త్రీ; మగవాడికి భోగ్యవస్తువు లాగ మాత్రమే కనిపించడం. అతనికిప్పుడు అనుభవమే కావాలి ఆమె శరీరం నుంచి. ఆమె హృదయంనుంచి పొంగే అనురాగం అతడి కక్కర్లేదు. దాని విలువనతడరయలేడు. స్త్రీని చూసే పురుషుడు మనసులేని మృగమై పోతున్నాడు. అందుకే ఏ వార్తాపత్రిక తెరచినా మానభంగాలు అసంఖ్యాకంగా దర్శనమిస్తున్నాయి. స్త్రీకి పవిత్రతతోపాటు భద్రతకూడా అంతరించిపోతూంది నేటి నాగరికతలో. స్త్రీ శరీరం వ్యాపారవస్తువై, వ్యాపారాన్ని విస్తృతం చేయటానికే ఉపకరణం స్త్రీ సౌందర్యం. గౌరవం మాట దేవుడెరుగు, అవమానం ఘనంగానే ఎదురౌతూంది బయట అడుగుపెడితే. ఇందులో స్త్రీ బాధ్యత లేదనను. కానీ—సౌందర్యం వస్తువులోనేకాక చూసే కళ్ళల్లోనూ ఉండాలన్న స్పృహ పురుషుడిలో ఎక్కువ రావాలి. హాపివయమూనా పురుష మగవాడు చేస్తున్న మానభంగాలను చూస్తే ఎక్కువ అపరాధి అతడే ఏమో అనిపించకమానదు. ఈ ప్రపంచం కృత్రిమ నాగరికతా, కుహనా విలువలు, మధ్యాగౌరవాలనుండి ఉద్ధరించ

బడవలసిన అవసరం ఎంతయినా ఉన్నదిప్పుడు. అందుకే_ఎన్నడూ లేనంతగా సద్గుణాలు, నైతిక విలువలూ యిప్పుడు తమ ప్రభావం చూపవలసిన అవసరం ఉంది. ఆశయాలూ ఆదర్శాలూ శతసహస్రదళ కమలాలై వికసించి ప్రపంచాన్ని పరిశుద్ధంగావించవలసిన అగత్యం ఏర్పడింది. రాముడో బుద్ధుడో మళ్లీ అవతరించి మానవాళిని సంస్కరించకపోతే మానవుడు మరీ అధఃపాతాళానికి జారిపోతాడు. ఆ ప్రమాదంనుంచి ఎవరో రక్షించాలనుకోడం వివేకం కాదు. ఈ మహాయజ్ఞానికి ప్రతివారూ యథాశక్తి సహకరించి తీరవలసిందే. లేకపోతే దీని ఫలం మానవాళి కందదు. నేనూ నా శక్తిమేరకు కృషిచేయదలచుకున్నాను. ఈ కుహనా విలువల ప్రపంచం పద్మవ్యూహాన్ని ఛేదించడానికొక అభిమన్యుణ్ని తయారుచేయదలుచుకున్నాను. నా అభిమన్యుడి ఆయుధం కరవాలం కాదు. శాంతి సహనం సౌశీల్యం మనుషులలో పెంపొందించేందుకు నేనొక ఆదర్శ మూర్తిని తీర్చిదిద్దదలుచుకున్నాను. ఒక దీపం వెలిగించాలని ప్రయత్నిస్తాను. ఈ దీపం మరెన్నో వందల దీపాలను వెలిగిస్తుంది. అలాగ వెలిగిన దీపాలు మరెన్నో దీపాలను వెలిగిస్తాయి. ఈ కాంతి_ పరంపరంగాసాగుతుంది. ప్రపంచం నిండా కాంతి, మానవాళికంతటికి శాంతి. ఐతే_నేను మూర్తీభవించదలుచుకున్నది బుద్ధుణ్నికాదు. రాముణ్ని. అహింసలో నాకు చాలా ఎక్కువ ఆశలేదు. ప్రస్తుత పరిస్థితులలో అన్యాయన్ని సహించడం కాదు, దాన్ని ఎదొర్కోవాలి. అప్పుడే అది త్వరగా తలదించుతుంది. కొంచెమయినా సంఘర్షణ ఉంటేతప్ప శాంతి అనేది ఉదయించదు. శాంతికోసమే అయినా యుద్ధం అనివార్యం. అదీ యీనాటికీ తీరు. సిద్ధార్థని అలాగే తయారుచేయదలుచుకున్నాను. అందుకే వాడిని అచ్చంగా అంతా నాకే ఉండాలని మిమ్మల్ని వేడుకున్నాను. సిద్ధార్థని నేను సుగుణాలరాశిగా రూపొందిస్తాను. అతని సౌశీల్యపు సువాసనలు పరిసరాలను ప్రభావితం చేసి తనవేపుకి ఆకర్షించుకుంటాయి. అతని వ్యక్తిత్వం వారికి కూడా ప్రియమౌతుంది. దీపాలనొకదానినొకటి వెలిగించుకుంటూ వెళ్ళినట్లు వారు మరెన్నో సువ్యక్తిత్వాలను ప్రభావితం చేస్తారు. రామరాజ్యం నెలకొంటుంది క్రమక్రమంగా అ[illegible] - స్త్రీ గౌరవించబడుతుంది పురుషునికి కూడా శీలం అనేది ప్రధానమౌతుంది. సంఘంలో వ్యభిచారమనేది మచ్చుకయినా కనిపించదు. మనుషులు రెండు ముఖాలతో బ్రతకవలసిన అగత్యం ఉండదు. మానవజీవితం స్వచ్ఛంగా సహజంగా సరళంగా సాగుతుంది. అటువంటి వ్యవస్థ ఏర్పడడానికి సిద్ధార్థ ఉపకరణం ఔతాడు. వాడి జీవితానికి పవిత్రమైన అర్థమూ పరమార్థమూ

లభిస్తాయి.

నా భావాలు కొన్ని విని- మీరు- "అంగ్లంలో ఉటోపియా అంటారు నువ్వు వర్ణించిన ఊహా ప్రపంచాన్ని. అది - ఎన్నటికీ సాధ్యమయ్యేది కాదని విజ్ఞులే అంగీకరించారు. ఆదర్శం అన్న పదానికి అద్దమనే అర్థముందని నీకూ తెలిసేఉంటుంది. అద్దంలో కనిపించేవి మిథ్యాబింబాలు. ఇంకా - సాపేక్ష సిద్ధాంతం ఒకటుంది. ప్రపంచం దానిమీదే ఆధారపడి సాగుతూందని ఐన్‌స్టీన్ అనే మహాశాస్త్రజ్ఞుడు సెలవిచ్చాడు. క్లుప్తంగా చెప్పాలంటే - నలుపు లేనిదే తెలుపు లేదు. చెడులేనిదే మంచిలేదు. చీకటిలేని వెలుగు - అర్థరహితం. జీవితానికి రెండోపక్క- మృత్యువు. సుగుణం విలువపొందేది వ్యసనంవల్లనే. ప్రపంచంలో మంచిమాత్రమే మిగిలితే అందరూ ఒక్కలాగే ఉండే సమానత్వం సాధించబడిందో - జీవితమంత విసుగైనదీ ఆకర్షణారహితమైనదీ మరొకటుండదేమో. అసలు- ప్రకృతిలోనే, సృష్టిలోనే అసమానతలున్నాయనీ వాటిని సరిచేయబోవడఅసాధ్యం మేకాక అవివేకం కూడా అనీ అన్నారు.

నేను ఆశ్చర్యంగా చూశాను. మీరు నవ్వి - "నేను యిప్పుడు నీకు - చదువుకున్న మూర్ఖుడిలా కనిపిస్తున్నాననుకుంటాను." అన్నారు. నేను మౌనం దాల్చాను. ఏమనగలనయినా ? తెలియనివారికయితే తెలియజెప్పగలం కానీ తెలిసియు తెలియనివారికి జెప్ప బ్రహ్మదేవుని వశమే ?

నా దీక్ష నిర్విఘ్నంగా సాగుతూంది.

సిద్ధార్థను నా పద్ధతులమేరకు పెంచుతున్నాను. వాడు ధరించే దుస్తుల నుంచీ, తినే ఆహారమూ తిరిగే మేరవరకూ నా జాగ్రత్తలు నేను తీసుకుంటు న్నాను. విద్యాభ్యాసం మొదలుపెట్టకమునుపే వాడికంట ఉత్తమగ్రంథాలు తప్ప యితర పుస్తకాలు పడకుండా అమర్చాను. వాడికి ఆదర్శవంతమయిన సూక్తులే తప్ప మామూలు మాటలు, తేలికయిన భావాలూ వినపడకుండా చేశాను, మాటలు వొచ్చినప్పటినుంచీ సుభాషితాలే పలికించసాగాను. దైవభక్తి, సాటి మానవుల పట్ల కరుణ, సౌశీల్యం పట్ల ఆకర్షణ కలిగించే నీతికథలే చెప్పే దాన్ని వాడికి చిన్నతనంనుంచి. చెడు చెప్పి ఖండించడం అనే పద్ధతి కాక మంచి చెప్పి అనుసరించమని ప్రబోధించే తీరునే పాటించాను. మీకర్థ మయ్యేలా - ఆంగ్లంలో చెప్పాలంటే - నెగెటివ్ ఎప్రోచ్ కాక పాజిటివ్ అప్రోచ్‌నే స్వీకరించాను. అప్రియాన్నెందుకు వినాలి అనవసరంగా ? ఈ కోణంలో నేను మహాత్ముణ్నే అనుసరించాను సిద్ధార్థకు తల్లిగా, గుర్విణిగా.

చెడుని కనకు వినకు చెప్పకు అదీ నేననుసరించిన పద్ధతి. మంచినే చూడు, మంచినే విను, మంచినే చెప్పు. మానవాళిమీద . నేను గీయబోయే వర్ణ చిత్రానికి — సిద్ధార్థ నాకు తూలిక. నా ఊహల సిద్ధార్థ - కొంత గౌతముడు, కొంత గాంధీ కొంత రాముడు కొంత పరశురాముడు . కొంత మానవుడు .. వీళ్ళందరిలోని సుగుణాలని కలిపితే నే నూ హిం చు కు నే సిద్ధార్థౌతాడు.

అదొక దీక్ష. అదొక తపస్సు. అదొక నిరంతర యజ్ఞం తెల్లవారినప్పటి నుంచీ సిద్ధార్థే నా ప్రపంచం. వాడే నా జీవితం. వాడితోనే నాకు కాలక్షేపం. వాడు వేసే అడుగు మంచివేపుకే కావాలి వాడు పీల్చే గాలి నిర్మలంగా ఉండాలి. వాడు తినే ఆహారం పరిశుభ్రమైనదవ్వాలి. ఆహారాన్ని బట్టికూడా గుణాలూ వ్యక్తిత్వమూ వికసిస్తాయి. అందుకనే అన్ని జాగ్రత్తలు.

సిద్ధార్థ నిదురపోయే వరకూ బాగానే గడిచిపోయేది. పగలంతా వాడితో చక్కగా కాలక్షేపం జరిగిపోయేది. వాడు నిద్రపోయాక నా సమస్య తల ఎత్తేది. ఒంటరితనం నన్ను భయపెట్టేది. శరీరం ఎదురుతిరిగేది. తీరని కోరి కలు పిశాచాల్లా చుట్టుముట్టేవి. నా హృదయం ఒక స్మశానమై అది వాటికి క్రీడారంగం అవుతూంటే పరిమితమయిన ఆవేదన ననుభవించేదాన్ని. శరీరం దహించుకుపోయేది. వొంట్లోంచి జ్వాలలు చెలరేగుతున్నట్లు మంటలు పెట్టేది. మనసు తపించిపోయేది. దేనికోసమో. తాపం.... దాహం.... దుర్భరమయ్యేవి. వెన్నెలలోకి వచ్చి కూర్చునేదాన్ని. ఫలితముండేదికాదు కొంచెమయినా. ఎంత నిగ్రహించుకుందామన్నా మీరూ మీ కౌగిలీ జ్ఞాపకం వచ్చేవి. నన్నూరించేవి. నా తపన మరీ అధికమయ్యేది. మనసు లగ్నం అయ్యేది కాదు మరో విషయం మీద. పరిపరివిధాల పోయేది. బయటకు చెప్పరాని భావాలు చెలరేగేవి. దూరంగా బోట్ హౌస్.... అందులోంచి—అద్దాల కిటికీలలోంచి—దీపాలకాంతి రంగురంగులుగా, అవర్ణనావలయాలు విరజిమ్ముతూ. నేనేం కోల్పోయానో దాని విలువ శతసహస్ర గుణితమై పశ్చాత్తాప పరిచేది. కోరిక వేధిస్తూంటే తాళలేక నేనే తప్పుచేశానంటూ మీ వద్దకు పరుగున చేరి మీ పాదాలమీద పడి- మీ కౌగిటిలోకి తీసుకుని నాలోని ఆరాటాన్ని ఆవేదననీ ఉపశమింపజేయండి అని వేడుకోవాలనిపించేది. కాని—ఒక్కొసారి నా అదృశ్యమూ దీక్షా, యజ్ఞమూ జ్ఞాపకం వొచ్చేవి. మనసు ఎటుతెగని సంఘర్షణకు ఆలవాలమైపోయేది. భరించలేక—రాత్రి అయినా—చల్లని నీళ్ళతో శిరస్నానం చేసేదాన్ని. తాత్కాలి




కంగా శాంతి లభించేది. నిద్రకోసం విశ్వప్రయత్నం గావించేదాన్ని. ఎప్పుడో వచ్చేది. ప్రతి రాత్రీ ఇలాగే అయ్యేది. శరీరాన్ని తేలికగా తీసివెయ్యడం తొందరపాటు. శారీరక నిగ్రహం కూడా సులభంగా సాధ్యమయ్యేది కాదు. ఎంత ప్రయత్నం కావాలి దీనికి కూడా? మెల్ల మెల్లగా సాధించగలిగాను-సిద్ధార్థ పదిపన్నెండేళ్ళ ప్రాయానికి వొచ్చాక. అప్పటికి హృదయం పొడారి పోయి ఎడారిగా మారింది. శరీరమూ ఆర్ద్రత గోల్పోయిందేమో స్త్రీపురుష సంబంధ సౌఖ్యం పట్ల, హృదయం స్పందించడం మానేసింది ఆ కోణంలో అంతవరకు ఎంత చిత్రహింస అనుభవించానో నా అంతరంగానికే తెలుసు. లోకం కోసమో.... సిద్ధార్థ కోసమో.... మీరు మా భవనానికి వచ్చేసేవారు. మిమ్మల్ని చూసేసరికి-నిగ్రహం సడలిపోయేది. ఒక్కసారి మిమ్మల్ని తనివిదీరా కౌగిలించుకుని తపన చల్లార్చుకోవాలన్న ఉద్రేకం ఉరకలు వేసేది. కాని-యూనగాచి నక్కలపాలు చేసినట్లు-యిన్నాళ్ళూ నిగ్రహించుకుని యిప్పుడు పతనం చెందడమా అని-వివేకం నేలొక్కనేది. ఐతే రానురానూ ఈ ఆరాటమూ సంఘర్షణా తగ్గుముఖం పట్టసాగాయి. సిద్ధార్థ పెద్దవాడౌతున్నకొద్దీ నా బాధ్యత అధికం కాసాగింది. నాకు తెలిసిందంతా వాడికి చెప్పెయ్యాలి. నా ఊహలు.... ఉద్దేశాలు.... భావాలు .... సిద్ధాంతాలు.... విశ్వాసాలు.... ఆదర్శాలు.... అన్నీ

వాడి మెదడులోకి ఎక్కించెయ్యాలన్న వెర్రి ఆత్రతలో వాడి వయిసును ఎమర్జ తనీ కూడా విస్మరించేదాన్ని, ఆవేశానికానకట్టు పడ్డాక నాపొరపాటు నాకు తెలిసి వచ్చేది. ఎడారిలాటి ఈ జీవితంలో-నందన వనం సిద్ధార్థే. నేను తరచుగా భగవంతుడ్ని ప్రార్థించేదాన్ని-"నా యీ వొక్క కోరికను మాత్రం తీర్చు. సిద్ధార్థ నా ఆశల పోగు. కలల పంట. నా జీవితం. నా ధ్యేయం. నా లక్ష్యం. అది నెరవేరనీ నిర్విఘ్నంగా." జీవితంలో ఘోరంగా ఓడిపోయిన యీ దీనురాలిపట్ల భగవంతుడికీ దయకలగలేదేమో. లేకపోతే - చక్కగా సాగుతున్న గీతాన్ని మధ్యలో కర్కశంగా త్రుంచి వేసినట్లు సిద్ధార్థ కళ్ళుతెరిచి విశాల ప్రపంచంలోకి అడుగు పెట్టకుండా యిప్పుడీ ఉత్పాతమేమిటి? అతన్ని హంతకుణ్ని చేయడమేమిటి? ఎందుకు నామీద యింత నిర్దయ భగవంతుడికి? జీవితం నన్నెందుకింత దారుణంగా వంచించి వదిలింది? నేనే నాది. కోరరాని కోరికలు కోరానని?

కన్నెవయసులో కలలు సహజమే. న్యాయమే. నేను కోరినదేమిటి? ఐశ్వర్యంకాదు. రూపసీ గుణవంతుడూ ఐన భర్తని. అత నేశీలవంతుడూ వ్యసన పరుడూ అయిఉండొచ్చాలు ననుకున్నాను దేవుడికి వినోదమో వీలుకాకపోతె కోరినవి అనుగ్రహించడమూ కోరుకున్నవి తిరస్కరించడమూ ఏమిటి? అతిచిన్న కోరిక... అందరానిదీ ఎన్నటికి పొందరానిదీ ఐపోయింది వేసిన అడుగు వెనక్కిరాదు. ఈ జీవితమిక యింతే. వైవాహిక జీవితం తలచుకుంటే విసుగేవస్తుంది వంచనే మొదలఉతుంది జ్ఞాపకాలతో. మీరు నన్నెందుకలా మోసం చేశారు. మీ వ్యాసనాలను తెలియకుండా? ఐశ్వర్యంతో మా నాన్నగారినెందుకు మభ్యపెట్టారు? మీరిలా చేయకపోతే మన యిద్దరి జీవితాలూ వేరుగా ఉండేవి కదా? మిరంటే ఒకవేపు ప్రేమ మరొకవేపు ద్వేషం. ద్వంద్వంలో పడి దగ్ధమైపోతూనే వచ్చానినాళ్లుగా. సిద్ధార్థే లేంపొతే ఏనాడో నాచేతులతో నేనే నాజీవితానికి ముగింపు పలుకుతుంనేదాన్నే ఎందుకంటే నావిశ్వాసాలకీ వాస్తవానికీ పొత్తుకుదరదు నా ఆశలకీ జీవితానికీ రాజీ కుదరదు ఇలాగని స్పష్టంగా తేలిపోయింది. ఈ పంతం సడలదు, ఈ పట్టింపువదలదు నేనిలాగ నలిగిపోవలసిందే. సిద్ధార్థ అనే నక్షత్రాన్ని చూసుకుంటూ—ఈ చీకటిలో—ఒంటరిగా అంతులేని జీవన సాగరాన్ని--చిన్న నావలో తరి చాలని ప్రయత్నిస్తున్నాను. ఉండి ఉండి విసగేస్తుంది. ఈజీవితములో రసమూ సారమూ ఏం మిగిలా యనిపిస్తుంది.

సిద్ధార్థ పెరుగుతున్నాడు నా ఆశల కనుగుణంగా. ఆశల మేరకు. చాలా మట్టుకు విద్యలు నేనే నేర్పుతున్నాను. కొంచెం మాత్రం- నేను నియమించిన ఉపాధ్యాయుడు. నేటి విద్యలో ప్రపంచజ్ఞానం అస్సలే లేదు. మనిషికి శీలం గురించీ నడవడిక గురించీ ప్రస్తుత పాఠ్యగ్రంధాలు అసలేమి చెప్పవు. పతనం చెందుతున్న వ్యవస్థకి విద్యావిధానం కూడా ముఖ్యకారణమే ఔతుంది. అసలిదే మూలకారణమేమో. కాని- సిద్ధార్థ మాత్రం జీవితానికీ భవిష్యత్తుకీ ఉపకరించే విద్యనే నేర్వగలుగుతున్నాడు. తల్లిదండ్రుల యెడల గౌరవం. పెద్దలయెడ విధేయత వినయం చక్కగా అలవరచుకుంటున్నాడు. విద్యని మెదడుతోనే కాక హృదయంతో కూడా అభ్యసించగలుగుతున్నాడు. వాడు నాకు గర్వకారణం. రేపు యీ సమాజం సిద్ధార్థని చూసి చాలా తెలుసుకుంటుంది. నేర్చుకుంటుంది. అనుసరిస్తుంది. అది చాలదూ నా జన్మ సఫలం చెందడానికి! నేను మురిసిపోవడానికి? సిద్ధార్థ రేపు తన తల్లిగురించే చెబుతాడు తన నంత గొప్పవాడిగా తీర్చిదిద్దిన వ్యక్తి ఆమే అని. అప్పుడు నేను పొంగిపోనూ! గతమంతా మరచి గర్వపడనూ?

ఈ ప్రపంచంలో ఎన్ని విధాలయిన సన్మార్గాలకు అవకాశాలున్నాయో అన్నిటినీ నేర్పుతున్నాను. పుస్తకాలు నేను చదివి అవి నిజంగా మంచివయితే వాడిచేత చదివిస్తున్నాను. వాటిలో కొంచెమే మంచి ఉంటే- మిగిలినది అప్రయో జనకరమయినదైతే ఆ మంచిని నేను చెబుతున్నాను. వాడు మిగిలినది చదవ కుండా జాగ్రత్తపడుతూ. సిద్ధార్థకు ప్రపంచంలోని మంచి మాత్రమే తెలియ జేస్తున్నాను.

సూర్యోదయంకంటె ముందుగా మేల్కొని- ముందు తల్లికి నమస్క రిస్తాడు. తరువాత భగవంతుడికి నమస్కరిస్తాడు. ఆపైన కాలకృత్యాలు తీర్చు కుని వ్యాయామం చేస్తాడు. పాలు తాగి పుస్తకం చేపడతాడు. నిత్యమూ సూర్యో దయాన్ని తిలకిస్తాడు. ప్రకృతి నారాధిస్తాడు.

అతని కంటికి స్త్రీ దేవతలా ఆరాధ్యనీయ, పూజనీయ. ఆమెకు నమస్క రిస్తాడు తప్ప నీచమయిన భావాలకు మనసులో తావివ్వడు. అంతేకాదు, అతను దేనినయితే అన్యాయమూ అక్రమమూ నేరమూ అనిభావిస్తాడో అది తన సమక్షంలో జరుగుతున్నట్లయితే అతను రంగంలోకి దూకి ఎదుర్కొంటాడు. అన్యాయాన్ని కేవలం మాటలతో ఖండిస్తే చాలదు, దానితో పోరాడి జయించాలి. అదే నేర్పాను సిద్ధార్థకు.

మధుపానమన్న మాటే అతనికి తెలియదు. మత్తు, మైకం, మాదకత యివన్నీ అతని కెన్నడూ ఎరుగని వింతలు. అంతేకాదు. తాగేవాళ్ల అతనికి శత్రువుల్లాగే కనిపిస్తారు. జూదం అన్నదీ అతనికి అపరిచిత పదమే. జూదరులూ అతనికి శత్రువులే. అతనికి తెలిసినదల్లా సుగుణాలూ సౌశీల్యమే.

ఇప్పుడు.... మీ కళేబరాన్ని చూస్తుంటే నా కిర్థమౌతూంది నేను చేసిన పొరపాటేమిటో. మీరు చెప్పినది నిజమే. ఈ ప్రపంచం సాపేక్ష సిద్ధాంతంమీద ఆధారపడే నడుస్తుందేమో.

ఇప్పుడు నా కర్తవ్య మేమిటో సెలవివ్వండి. నా కిమీ పాలుపోవడం లేదు. సిద్ధార్థకు నిజం చెప్పడమే తెలుసు. అందుచేత యీ హత్యానేరాన్ని నా మీదకు వేసుకున్నా ఫలితం ఉంటుందనుకోను. రేపు న్యాయమూర్తి ముందుకి సిద్ధార్థ హాజరుకాక తప్పదు. ఆ సమయంలో ఇతను అబద్ధ మెరుగనివాడు కనుక నిజం చెప్పకా మానడు. పుత్రుడు తండ్రిని హత్యచేయడమే వింతకాగా భార్య భర్తని హత్యచేసిందంటే విడ్డూరమే కాగలదు. అందులోనూ హతుడు జమీందారు; అందుచేత- జరిగిన సంఘటన పదిమందినీ మరింత ఆకర్షించుకుంటుంది. వారందరిముందూ - మేము దోషులుగా నిలబడాలి. ఈ హత్య నేను చేశాననీ నేనూ, తాను చేశాడని సిద్ధార్థా చెప్పడం జరిగితే న్యాయస్థానం విస్తుపోతుంది. మరింత ప్రచారం జరుగుతుంది ఓ పట్టాన న్యాయం తెగదు. అయినా- నా ధ్యేయం చెదిరిపోతుంది. నా దీక్ష చెడిపోతుంది. నా లక్ష్యమే సమూలంగా నాశనమైపోతుంది. నా ఆశ ఛిన్నాభిన్నమైపోతుంది, నా జీవితం నిరర్థకమైపోతుంది. నిజం తెలిస్తే చట్టం శిక్షిస్తుంది. అబద్ధమాడి సిద్ధార్థను రక్షించగలిగినా అదీ అతన్ని నాశనంచేయడమే ఔతుంది. నేనే అతన్ని అబద్ధం ఆడమని ప్రోత్సహిస్తే కంచే చేనుమేసిన చందమౌతుంది. అతను నా నోట అబద్ధం వింటే దిగ్భ్రాంతుడౌతాడు. అతని నమ్మకాలన్నీ కూలిపోతాయి. అతని మెదడు సుడిగుండమౌతుంది. ఏది సత్యం? ఏది సత్యం అన్న మీమాంసకు లోనవుతాడు. జీవితపు విలువలు తారుమారౌతూంటే ఆకళింపు చేసుకోలేక అయోమయంలో పడిపోతాడు. అతన్నాదుకుందుకు నేనుంటానో ఉండనో ప్రక్కనే. నేను లేకుండా- ఒంటరిగా యీ ప్రపంచంలో మనగలిగే జ్ఞానాన్ని నేనింకా సిద్ధార్థకు బోధించలేదు. నేను చేసిన పొరపాటదే. అందుకే యీ విషమ సంధిలో చిక్కుకుని గిలగిలలాడుతున్నాను. నన్ను నేను శాశ్వత మనుకున్నాను. సిద్ధార్థ యిలా తొందరపడతాడనుకోలేదు. దయనీయమేమిటంటే



తానేంచేశాడో తెలుసుకోలేని అవస్థలో ఉన్నాడు సిద్ధార్థ. అతని ముఖం చూస్తుంటే నన్ను నేనే శిక్షించుకోవాలనిపిస్తుంది నే నతనికి చేసిన ద్రోహానికి. ద్రోహం! ఔను. ద్రోహమే. మిమ్మల్ని సిద్ధార్థ హత్య చేసేందుకు మూల కారణం నేనే. నా అజ్ఞానం. నా అమాయకత్వం.

ఎంతో విజ్ఞానవంతురాలినని విర్రవీగానే తప్ప అతి ప్రాథమికమయిన విషయాన్నే విస్మరిస్తున్నానని గమనించలేకపోయాను. మీరు చెప్పినదే జీవిత సత్యం. మంచి ఒక్కటే చాలదు. చెడునికూడా తెలుసుకుని ఉండాలి మనిషి. లేకపోతే ఏనుగూ- పదిమంది గుడ్డివాళ్ళ కథలోని ఓ అంధుడే ఔతాడు మనిషి. నేను ఓడిపోయాను. ఇప్పుడు నాకు కావలసింది గెలుపు ఓటములు కావు. ఈ విపత్కర పరిస్థితినుంచి బయటపడడం. నేను సిద్ధార్థకు నేర్పవలసిన చదువులో మిగిలిపోయినదాన్ని అతనికి చెప్పడానికి అవకాశమివ్వడం. చేసిన తప్పుని దిద్దుకుందుకు అవకాశమివ్వడం.

ఇలాగ జరిగాక - నేను జైలుకి వెళ్లడానికేమీ భయపడడంలేదు. పిరికితనంతో నేనిలాగ కోరుకుంటున్నాననుకోకండి. ఇప్పుడు నేను శాస్త్రోక్తంగానే విధవనయ్యా . ఆనాటినుంచి యీనాటివరకూ నేను నా మనసులో వితంతువుగా

షటించాను. ఇప్పుడదే నిజంచేశారు మీరు. భగవంతుడిటువంటి కోరికలను ఎక్కువ ఆలస్యం చేయకుండానే నెరవేరుస్తా డనుకుంటాను.

మీరు లేని జీవితం- విధవగా యీ అపరిణత సమాజంలో జీవించడం - బందికానాకంటే బాధాకరమే. దానికంటె జైలుశిక్ష చాలా నయం. మనసులో ముళ్లగుచ్చే మనుషుల మాటలకీ; హేళనాభరితమయిన చూపులకీ దూరంగా ఉండవొచ్చు. కాని- నేను జైలుకి వెళ్లేదెలా? నేనీ హత్యానేరం నెత్తిన వేసుకుందుకు వెనుకాడడంలేదు. కాని- సిద్ధార్థ నేను పెంచిన సత్యహరిశ్చంద్రుడు అంగీకరించడే! అతను- తానబద్ధమాడడు. తనకి తెలిసిన సత్యం అసత్యంగా రంగుమారుస్తుంటూంటే భరించనూ భరించడు అందుకే కదా నాకీ మనస్తాపం!

మీరు అదృష్టవంతులు. అందుకే మీకే సమస్యాలేదు.

"నిన్ను మించిన సమస్య యింకేమిటి?" అంటారా! పంతాలూ పట్టుదలలూ ఆశలూ ఆశయాలూ నన్నయితే నరకంలోకి తోశాయి కానీ మీకేం? మీరు హాయిగా నే ఉన్నారు. మీ విలాసాలకూ భోగాలకూ అడ్డేముంది! మీకు- స్త్రీ అయితే చాలు యౌవనవతి ఐతే చాలు, ఆమె భార్య అయినా వెలది అయినా ఒక్కటే. అల్పసంతోషులు. స్త్రీ శరీరమే తప్ప ఆమె అంతర్యం మీకు అక్కర్లేదు. అందుకే కదా మీరూ నా అంత మొండిగానూ ఉండిపోయారు! నేనప్పుడప్పుడు ఆశపడేదాన్ని. "శారికా! నీకోసం తాగుడు మానేస్తాను. మధ్యాన్నే ముట్టను. పరస్త్రీని వాంఛించను. జూదంజోలికి పోను. జరిగిన దానికి చాలా చింతిస్తున్నాను. దయచేసి- గతంమరిచి- నన్ను క్షమించి- అంగీకరించవూ?" అని ఒక్కసారయినా అర్థిస్తారేమో అని! ఉహుం. నా ఆశ అడియాపే అయ్యేది ఎప్పటికప్పుడు. మీరడిగితే నే నేమని ఉండేదాన్నినా? ఎందుకులెండి. గతజల సేతుబంధనం నిష్ప్రయోజనమూ నిరర్థకమూ. సిద్ధార్థ ఎందుకు మిమ్మల్ని హత్యచేశాడో నేనూహించగలను మీరు నన్ను క్షమించాల్సి ఉంది యీ విషయంలోనూ. మిమ్మల్ని నాడికి చాలా దూరం చెయ్యకపోతే వాడు కనీసం మీ మీద అభిమానంతోనయినా ఒక క్షణం ఆగేవాడేమో! పితృవాత్సల్యం మీరు చూపబోయినా నేను సైంధవుడిలా అడ్డుపడిపోయేదాన్ని. అలాగే- సిద్ధార్థవాడా ఏ రాజకుమారుల కథలో వింటున్నప్పుడు "అమ్మా! నాకు నాన్న " అంటూ అడిగేవాడు. నేను మాట దాటించేసేదాన్ని. అంతే

కాదు. కథలు చెప్పేటప్పుడు తండ్రిపాత్రను సాధ్యమైనంతవరకూ తప్పించో, ప్రాధాన్యతను తగ్గించో చెప్పేదాన్ని. అలాగ నేను మీకూ ద్రోహంచేశాను, వాడికీ ద్రోహంచేశాను. ఇప్పుడు- నన్ను నేనే క్షమించుకోలేకపోతున్నాను.

ఆలోచించి చూస్తే - తీవ్రంగా ఆలోచించి చూస్తే - అర్థమౌతూంది దేముడు మనిషికి రెండు కళ్లెందుకిచ్చాడో రెండు చెవులెందుకిచ్చాడో, మెదడూ, హృదయమూ ఒక్కొక్కటే ఎందుకిచ్చాడో.

చీకటీ వెలుగూ రెండూ చూడాలనే రెండు కళ్లు.

మంచీ చెడూ రెండూ వినాలనే రెండు చెవులు.

అలాగ చూసినవీ, విన్నవీ - మెదడుతో శోధించుకుని ఓ అభిప్రాయం ఏర్పరచుకోవాలి. మెదడుని సక్రమ మార్గంలో పెట్టేందుకు హృదయం

సిద్ధార్థను నేను పెంచిన తీరులోపభూయిష్టమే అనిపిస్తూందిప్పుడు. వాడికి- ఒక్కకన్నే తెరిపించాను. ఒక్క చెవినే వినేందుకు సిద్ధంచేశాను. అతని మెదడు సగమే శోధించగలదు. అతని హృదయం సగమే స్పందించగలదు. అందుకే వాడు- కన్నతండ్రినే హత్యచేసేంత మూర్ఖుడయ్యాడు

పైగా- వాడినిచూసి నేను గర్వించాలిట!

ఎటువంటి పెంపకం నాది! ఎంత మోసపోయాను!

పరిమళ భరితమయిన పుష్పాలని పూస్తుందని పెంచిన మొక్క విషపు వాసనలను విరజిమ్ముతూందా! ప్రపంచంలోని అన్యాయాన్నెదుర్కొనే విప్లవకారుడి రూపొందించబోతే - తనే ప్రపంచంలో కొత్త అన్యాయానికి నాంది పలికాడు! బుద్ధుణ్ని చేయబోతే- కసాయివాడయ్యాడు!

చూడండి మీరు నన్నపార్థం చేసుకోకండి. నేను ఐశ్వర్యాన్ని ద్వేషించానేకాని మిమ్మల్ని ద్వేషించలేదు. నాకు మీ మీద పగ ప్రతీకారమూ లేదు. సిద్ధార్థచేత మిమ్మల్ని నేను హత్యచేయించానని ఊహించకండి. మీ మీద గెలుపు తీసుకోవాలనుకున్నమాట వాస్తవమే కాని- ఇలాగ అంతమూ త్రమూ కాదు. సిద్ధార్థను నేను మీకు వ్యతిరేకంగా ప్రోత్సహించలేదు, మీనుంచి దూరంగా ఉంచినా మరోలాగ పెంచినా ఆ రక్తంలోకి ఐశ్వర్యంతాలూకు అభిజాత్యమూ వ్యసనాలూ ప్రవేశించకూడదనీ, వాడు ఆదర్శజీవి కావాలనీ ప్రత్యేకంగా పెంచానంతే. ప్రత్యక్ష హంతకుడు వాడయితే పరోక్షంగా హంతకురాలిని నేను. మిమ్మల్ని నిజంగా హత్యచేసింది- నా అజ్ఞానమూ నా అమాయకత్వమూ. మేము- నీడనిచ్చిన వృక్షాన్నే నరుక్కున్నాం అవివేకంగా.

ఇప్పుడు_

సిద్ధార్థ భవిష్యత్తు అయోమయం.

నాజీవితం అంధకారబంధురం.

ఈ క్షణాలలో నేను మిమ్మల్ని ఏంకోరుకోగలను? నన్నూ సిద్ధార్థనీ క్షమించమని ప్రార్థిస్తున్నాను దురాశకొద్దీ, వ్యసనపరులయినా మీరు విశాల హృదయులు. ఐశ్వర్యవంతులయినా సున్నితమయిన మనసు కలవారు. ఆనాడు మీ ఆశీర్వచనంతో వాద్దు! సిద్ధార్థను తీసేసుకున్నాను. ఈనాడు నేనే మిమ్మల్ని వేడుకుంటున్నాను. ఒక్కసారిగా వాడిని దీవించండి. ఆశీర్వదించండి. సిద్ధార్థ కనీసం కన్నీరయినా కార్చడంలేదనా! మరి ... వాడు. నిజంగా సిద్ధార్థే. వాడికి సగమే జ్ఞానముంది. వాడికి సగమే హృదయముంది. అందుకే వాడు జరిగినదెంత ఘోరమో అర్థం చేసుకోలేకపోతున్నాడు. అందుకే శిల్పి మలచిన శిల్పంలా నిలచిపోయాడు. ఆ కన్నులలోకి కన్నీరు చిందకుండా, ఆ హృదయం స్పందించకుండా చేసిన పాపాత్మురాలిని నేనే. మనిషి కావలసినవాడిని_ సగం మనిషిని మాత్రమేచేశాను. ఈ దేశంలో స్త్రీకి_ కొడుకుకంటేకూడా భర్తే ఎక్కువ అన్న కఠోరనిజం నేనిప్పుడు చెప్పానో_ వాడు ఒక్కసారి కుప్పకూలి పోతాడు. సుగుణరాశి అయిన సుతుని కంటెకూడా వ్యసనపరుడయిన భర్తే భారతస్త్రీకి అధికుడన్న చేదునిజం వాడు అర్థంచేసుకోనూలేడు, అంగీకరించి భరించనూలేడు. అందుకే నా రెండు కళ్లల్లోనూ ఒకటి మీకోసమూ మరొకటి వాడికోసమూ యింత కన్నీరు కారుస్తోంది

8

సిద్ధార్థ:_ నా పేరు సిద్ధార్థ. నేనిప్పుడు అయోమయంలో పడిపోయాను. అమ్మ ఏడుస్తోంది. ఆమె దుఃఖానికి కారణమేమిటో నాకు తెలియదు. నిజానికామె అమితంగా సంతోషించాలి నేననుకున్నట్లు జరిగితే. ఆనందించడం లేదు సరికదా నా మాతృశ్రీ కన్నీరుమున్నీరుగా విలపిస్తోంది. అదీ_ ఓ అపవిత్రుడి శరీరాన్ని వడిలో పెట్టుకుని! అతి పవిత్రురాలయిన మాతృమూర్తి ఆ దుర్మార్గుడిని స్పృశిస్తూ ఎందుకిలాగ మలినపరచుకుంటూంది తనని తానే? నాకేమీ అర్థంకావడం లేదు. అతని రక్తాన్ని తుడుస్తూంది తన పైటకొంగుతో! అతని శిరస్సును గుండెల కాన్చుకుని కన్నీటితో ప్రక్షాళనం చేస్తూంది. ఏమిటీ విచిత్రం? ఎప్పుడూ లేనిది అమ్మ అన్నీ యిలా చేస్తూందేమిటీ రాత్రి?




ఛస్తే ఇష్టం! మా ఆఫీసులో ఒకేసారి ఇద్దరు సెలవు పెట్టకూడదు .... ఇదో నిబంధన... అండర్ స్టాండ్!!

వన్నెంతో ముద్దుగా చూసుకునేదల్లా - యిప్పుడు శత్రువుని చూసినట్లు చూస్తూందేం దుఃఖపుతెరల మధ్య? నేనేంతప్పు చేశాను, అమ్మ పెంపకంలో నేనసలు తప్పుచేస్తానా. తప్పు అంటేనే నాకు తెలియదే!

అవినీతి దౌర్జన్యం వీటిని సహించకూడదు అని విషపుపాముల కంటె ప్రమాదకరమైనవి. పాము కొద్దిమందిని మాత్రమే కాటువేస్తుంది, అదీ తన ప్రాణానికి భీతి కలిగితే మాత్రమే. దుర్మార్గుడు సమాజాన్నంతటినీ కలుషితం చేసి వదులుతాడు స్వార్థంకోసం. అందుచేత దుర్మార్గం కంటపడిందో దానిని అప్పటికప్పుడు- అక్కడికక్కడే అంతమొందించాలి. క్షణమయినా జాప్యం చేయకూడదు. అన్యాయాన్ని నోటితోనే కాదు చేతితోకూడా ఖండించడమే ఉత్తమ మానవుడి లక్షణం. పట్టాలుతప్పి కూలిపోతున్న యీ వ్యవస్థను పునర్నిర్మించడానికి శాయశక్తులా కృషి త్యాగాలూ చేయడం ప్రతి మనిషికీ కర్తవ్యం. సుకుమారి అయిన స్త్రీ పూజనీయ అని గ్రహించకుండా తన పశుబలంతో ఆమెపై అత్యాచారం చేస్తున్నాడు మగవాడు. వీళ్ల జాతికి చీడపురుగులే. అటువంటివారి నేరిపారెయ్యాలి. ఇలాగ బోధించేది అమ్మ. అన్యాయాన్ని ఖండించడంలో స్వపర భేదాలుండకూడదంది. రోజులాగే యీ రాత్రి

అమ్మ యిచ్చిన పుస్తకం- "సౌజన్యము, సౌశీల్యము" చదివి తొమ్మిదిన్నర కాగానే అలవాటుగా పాలుతాగి-దీపం ఆర్పి మంచంమీదచేరాను.భగవధ్యానం చేసుకున్నాను. నిద్రపోవాలని కళ్ళుమూసుకున్నాను. నిముషాలుగడుస్తున్నాయి కానీ నిద్ర పట్టడంలేదు. ఇదొక అరుదైన విషయం. ఎప్పుడోతప్ప యిలాగ జరగదు అమ్మ నా గదిలోకి వొచ్చింది. నేను నిద్రపోతున్నానో లేదో చూడడానికి. అదీ ఆమె క్రమశిక్షణలోని భాగమే. తిండీ, నిద్రా, విద్య ఆట అన్నీ వేళకే జరగాలి. అదే మంచిదట. అమ్మ పద్ధతులన్నీ నాకు నచ్చుతాయి. కొన్ని తప్ప. అవేమిటంటే-అమ్మ నన్ను ఒంటరిగా బయట తిరగనివ్వదు. నాయీడు కుర్ర వాళ్లతో ఆడకోనివ్వదు. వాళ్ళు మా యింటికి రావలసిందే. మేము మా భవనంలో ఆడుకుంటున్నా అమ్మ మమ్మల్ని గమనిస్తూనే ఉంటుంది రెండు కళ్ళతోనూ. అలాగ అమ్మ చూస్తుండగా ఆడుకుంటూంటే మాత్రం ఏం ఆనందంగా ఉంటుంది? ఇబ్బందిగా అనిపించేది. తరువాత మా యిష్టం వొచ్చిన ఆటలు ఆడుకోడానికి వీలులేదు. మా తోటలో ఎన్నోచెట్లున్నాయి. వాటిమీద చక్కగా కోతికొమ్మచ్చులాడుకుందామని మనసు ఉత్సాహపడేది నాకూ మిగిలిన అబ్బాయిలకీ. కాని-చెట్లెక్కితే పడిపోతామట. దెబ్బలు తగులుతాయట. మరి మా తోటమాలి అప్పుడప్పుడు చెట్లెక్కి కాయలు కోస్తుంటాడు కదా, వాడు పడడేం? వాడికి దెబ్బలు తగలవేం? ఈ సందేహాలనమ్మనడగుదామనిపిస్తుంది. కాని-పెద్దలకు విధేయుడిగా ఉండాలి. వారిమాటకెదురు చెప్పకూడదు పాఠాలు గుర్తువొస్తాయి. అవన్నీ అమ్మ చెప్పినవే. ఉండుండి ఒక్కసారిగా నాకు ఒంటరిగా అలా తిరిగి రావాలనిపిస్తుంది. కాని-అమ్మ తనుకూడా వొస్తానంటుంది. కారు తీస్తాడు డ్రయివరు. ఇవినాకు నచ్చవు. బజారుకి వెళ్ళినట్లుగా వెడితే ఏం బాగుంటుంది షికారు? పొలాలగట్లు ..చెరువుగట్టు హాయిగా ఒంటరిగా తిరిగి చూడాలనిపిస్తుంది అమ్మనడగడానికి ధైర్యం చాలదు. ఆమె కాదంటుందనికాదు ఎప్పుడూ నేనడిగింది కాదనదు. కాని-తనూ తయారౌతుంది. అదేంబాగుంటుంది? మేడమీదకయితే అమ్మ అనుమతి తీసుకోనక్కరలేదు. అందుకని ఒకణ్ణీ అక్కడికి వెళ్ళి కూర్చుంటాను. రోడ్డు దూరంగా, దానిమీద పిల్లలు నడుస్తూంటారు. హాయిగా స్వేచ్ఛగా ఆటలాడుకుంటారు.వాళ్ళని పెద్దవాళ్ళెవరూ పట్టించుకోరు. ఒక్కడినీ మేడమీద పరుగెడతాను. కాని-బాగుండదు నాకే. ఎవరూ లేకుండా ఒక్కణ్ణీ పరుగెడితే తొందరగా విసుగొచ్చేస్తుంది. సరదాగా ఉండాలంటే తోడుండాలి కదా. అమ్మ అలాగ ఒప్పుకోదు. కుర్రాళ్లతో చేరితే దుస్సహ

వాసాలలపడుతాయిట. అందుకని తనతోనే స్నేహం చెయ్యమంటుంది. అమ్మ మంచిదే. నాతో ఆడుతుంది. పాటలు నేర్పుతుంది. ఒక్కసారీ కేకవెయ్యదు. ఉండుండి నన్ను ముద్దుపెట్టుకుంటుంది. వొడిలోకి తీసుకుని. నేను చక్కగా చదువుకుని అమ్మ అడిగినవాటికి సరయిన సమాధానాలిస్తానే అప్పుడయితే— "నా బంగారుతండ్రే! రత్నాలమూట సుగుణాలరాశి మంచిబాబు—" అంటూ నా తలని వెచ్చని తన గుండెలకదుముకుంటుంది. నా తలమీద టప్ టప్ మని కన్నీరు పడుతుంది. ఆశ్చర్యపడి అమ్మముఖంలోకి చూస్తాను. "ఏడుస్తున్నావా అమ్మా! దేనికి?" "ఇది దుఃఖం కాదు బాబూ, ఆనందం. నువ్వు నా కలలను నిజం చేస్తున్నావని కలుగుతున్న సుఖం. నువ్విలాగే పెద్దవాడివి కావాలి" అంటుంది. చాలా చిన్నప్పుడు నాకు అమ్మ ప్రతిరాత్రి ఎన్నెన్నో కథలు చెప్పేది. అవన్నీ దేముళ్ల కథలూ మంచివాళ్ల కథలే. వాటిమధ్యవచ్చే రాక్షసుల గురించి అడిగితే—"అక్కర్లేదు సిద్ధార్థా. వాళ్ళగురించి నువ్వు తెలుసుకోకూడదు. ఎప్పుడూ మంచినే చూడాలి. నువ్వు మంచివాడివే కావాలి." అంటూ తప్పించేసేది. నాకుమాత్రం కొంచెం నిరాశగా అనిపించేది. అయినా—అమ్మమాట కెదు రాడకూడదుకదా? అందుకని ఊరుకునేవాడిని. నాకు మరో సందేహం కూడా కలిగేది. నాన్నగారి గురించి. నేను విన్నకథలలోనూ చదివిన వాటిలోనూ నాలాటి వాళ్లందరికీ నాన్నలుండేవారు. వాళ్లు మానాన్నగారిలా ఎప్పుడో వారానికో పది రోజులకో ఓ సారి యింటికి రావడం కాక ఆ పిల్లలతో ఆ యింట్లోనే ఉండేవారు. ఆడుకునేవారు. చదువు చెప్పేవారు. బళ్ళో వేయించేవారు. ఒకసారి ధైర్యం చేసి ఆ విషయమే అడిగేశానమ్మని. "అమ్మా! నాన్నగారు మనింట్లో ఉండరేం? ఎప్పుడో ఒకసారి వచ్చి నన్ను ఆడించకుండానే వెళ్లిపోతారేం? నన్ను బళ్ళో వేయించరేం? బడికివెళ్లి చదువుకోవాలిటగా అందరూ? బడి చాలా బాగుంటుందిటగా?" అమ్మ నావైపు అదోలా చూసింది. నాకు భయం వేసింది. "వొద్దులే అమ్మా! చెప్పొద్దులే. కోపంగా చూడకు" అన్నాను తల వంచుకుని.

"మీనాన్నగారికి పనులెక్కువ. చాలా గొప్పవారు. అందుచేత యింట్లో వుండేందుకు అట్టే కుదరదు. మరి—నీతో ఎలా ఆడుకుంటారు? బడి బాగానే ఉంటుంది కానీ అంతకంటె మంచి చదువే నీకు నేను చెబుతున్నానుగా? ఇంకా యింటికివొచ్చే టీచరు చెబుతున్నారు. బడిలో మనకి కావలసింది వాళ్లు చెప్పరు. వారు చెప్పిందే మనం నేర్చుకోవాలి. అంతకంటె నువ్వు నేర్చుకునే పద్ధతే

మంచిది." కాబోలనుకున్నాను నాకేం తెలుసు అమ్మకంటే అధికంగా ?

అమ్మనాకు సూచన ప్రాయంగా చెప్పింది-నాన్నగారితో అధిక ప్రసంగం చేయవొద్దనీ, ఆయన మీద పడకూడదనీ. నేను అలాగే ఉండేవాడిని. చుట్టు పక్కలవాళ్ళు నన్ను బుద్ధిమంతుడవి అంటున్నారుట. వాళ్ళ పిల్లల్ని నన్నుచూసి నేర్చుకోవాల అంటున్నారుట ఇవన్నీ అమ్మే చెప్పేది అమ్మ నన్ను తరచుగా పొగుడుతూనే ఉండేది. బాగా చదువుతున్నా, అమ్మ ఆశించినట్లు జవాబులు చెప్పినా నన్ను ఎక్కువగా అభినందించేది.

ఆరాత్రి-నాకు నిద్రపట్టలేదని చెప్పానుకదూ ? అంతకుముందే నాకు అమ్మ కీచకుడి కథ చెప్పింది. ఆ కథ గురించే ఆలోచిస్తున్నాను. ద్రౌపది-అమ్మ చెప్పిన ద్రౌపది-కీచకుడి చేత పరాభవించబడడం తలుచుకుంటూంటే నాకు కోపం వొచ్చేస్తుంది. ఇటువంటి కథవినడం యిదే మొదటిసారి నాకు. సరిగ్గా అప్పుడు—

దూరంనుంచి ఎవరో కేక వేసినట్లయింది.

నేను కథ గురించి ఎంత తీవ్రంగా ఆలోచిస్తున్నానంటే- ఆ కేక వేసింది ద్రౌపదే ఏమో అని అనుమానం కలిగింది. ఒక నిముషంపాటు తరువాత వివేకం మేల్కొంది. బయటకు వచ్చాను గదినుంచి. భవనంలో ఎక్కువ దీపాలు వెలగడంలేదు కానీ-బోట్ హౌస్‌లో మాత్రం వెలుగుతున్నాయి. ఆ కిటికీలకున్న రంగు రంగుల అద్దాల కాంతులు కనబడుతున్నాయి. ఒక్కసారి నాకు అమ్మ మాటలు గుర్తువచ్చాయి. ఎప్పుడో అడిగాను. "ఆ యిల్లు ఎవరిది ? ఎంతో బాగుంటుంది "

"అది-మీ నాన్నగారిది."

"ఒకసారి అది చూపిస్తావా ?"

"వొద్దు-అది మనదికాదు-"

"పోనీ, యీసారి నాన్నగారు వొచ్చినప్పుడు అడిగేదా చూపించమని ?"

"వొద్దుసుమా-" వారిస్తున్నట్లంది

"ఏం ?" అడిగాను.

"అది మనకు నిషిద్ధస్థలం. మనం వెళ్ళకూడదు. అదొక పాపకూపం. అక్కడ కాలుపెట్టామో మనమూ అపవిత్రులమైపోతాం." ఆవేశంగా అంది అమ్మ.

"వివరంగా చెప్పమ్మా లేకపోతే నాకేం అర్థమౌతుంది ?"

"వొద్దు అటువంటివి తెలుసుకోడం అనవసరం."

అమ్మ అలాగే ఆపేసిందా ప్రసంగం. నా మెదడులో ఔట్‌హౌస్ ఒక కుతూహలం రేకెత్తించేదిగా మిగిలిపోయింది.

ఔట్‌హౌస్ వైపునుంచి కేక వినిపించింది. అలాగే వినిపిస్తూంది. అక్కడ ఎవరికే ఆపద సంభవించిందో? అందులోనూ కేక వెలువడింది స్త్రీ కంఠం నుంచిలా ఉంది. స్త్రీని రక్షించడం మగవాడి కర్తవ్యంకాదూ? కర్తవ్యాన్ని నిర్వర్తించడం మానేస్తే నేరమేకాదూ?

భవనం దాటి తోటలోకి చేరాను.

వెన్నెల ఎంతబాగుంది తోటలో! చెట్లమీద పడుతూన్న వెన్నెల ఎంత వింతగా మెరుస్తూంది. పగలు ఆకుపచ్చగా ఉండే ఆకులు వెన్నెల్లో నల్లగా ఉన్నాయేమో? ఎండకీ వెన్నెలకీ యిటువంటి తేడా ఉందా రెండూ కాంతే ఐనా? ఇన్నాళ్లూ నాకు తెలియనే తెలియదు! నేను తెలుసుకోవలసినవీ నేర్చుకోవలసినవీ చాలా మిగిలిపోయాయి! అమ్మ ఎన్నెన్ని పాఠాలు చెబుతూ వచ్చిందని!

చల్లగా గాలివేస్తూంది. పైనుంచి వెన్నెల వెండినీరులా కురుస్తోంది వెన్నెల్లో తోట మహచక్కగా ఉంది. తోటలోంచి ఏవేవో పక్షులు కూస్తున్నాయి ఉండుండి. పక్షుల రెక్కల చప్పుడు.

మళ్లీ ఆర్తనాదం!

ఇంకనాకు ఏమీ తెలియదు. నేను నన్ను మరచిపోయి పరుగెత్తాను. అది-ఆ కేక-ఔట్‌హౌస్‌నుంచే వెలువడింది. ఆకేక వెలువడిన చోటికి చేరడం నా ధ్యేయం. శబ్దవేధిలా దూసుకుపోయాను. సరిగ్గా లక్ష్యాన్ని చేరాను.

అదొక విశాలమైన హాలు. అటువంటి హాలుని నేనెన్నడూ చూడలేదు మా భవనంలో. నిజానికంతకంటె విశాలమైన హాళ్లే ఉన్నాయి నేనుండే భవనంలో. ఆ హాలు గోడలకి-మా గోడలకి మెల్లె దేవుళ్ల ఫొటోలు లేవు. బుద్ధుడు లేడు, రాముడులేడు, గీతోపదేశం పొందుతున్న అర్జునుడు లేడు. సరికదా నాకెన్నడూ పరిచయం లేనివీ అసహ్యమైనవీ అయిన చిత్రాలున్నాయి. ఒక చిత్రంలో స్త్రీ పురుషులొకరి కౌగిలిలో ఒకరు కరిగిపోతున్నారు. అర్ధనగ్నంగా ఉన్న స్త్రీ ఉందొక చిత్రంలో. సంపూర్ణ నగ్నంగా ఉన్న స్త్రీ శిల్పం ఒకమూల. ఆ శిల్పం కనిపించదేమో అని కాబోలు అక్కడొక దీపం వెలుగుతూంది ప్రత్యేకంగా. ఆ గది గోడలనిండా అటువంటి చిత్రాలే మూల మూలనా

అరకం శిల్పాలే. నాకు మతిపోయినట్లయింది. తేరుకుని చూశాను. ఆ గదిలో ఒక పురుషుడూ, ఒక స్త్రీ.

మేజామీద సీసాలలో మెరుస్తున్న పానీయాలూ, పళ్లాలలో ఉన్న తిను బండారాలూ. చాండ్లియర్స్‌నుంచి పడుతున్న మెత్తని వెలుగు. గదిలో ఒకవేపు విశాలమైన మంచం. దానిమీద చక్కని శయ్య.

హఠాత్తుగా ఆ పురుషుడు_స్త్రీ వేపు అడుగువేశాడు.

అప్పటికే ఆమె అర్ధనగ్నంగా ఉంది. పాపం... ఆమెకు మంచి బట్టలు లేవేమో! అతను_ఆమెచేయిపట్టుకుని తన వేపుకి....తనమీదకు లాక్కుంటు న్నాడు. ఆమె కెవ్వుమని కేకవేసింది మళ్లీ.

ఇంక నన్ను నేను నిగ్రహించుకోలేకపోయాను. నా సమక్షంలో... నా కళ్లముందు... యిటువంటి ఘోరమూ నేరమూ జరగడానికెంతమాత్రమూ వీలులేదు. దీన్ని నేను తీవ్రంగా గర్హించడమేకాదు. ఎదుర్కొంటాను కూడా ఖండించి తీరుతాను. అతనలా పశువులా ఆమెనాక్రమించుకోకూడదు. ఆ అబ లను హింసించకూడదు. నేను సహించను. నా రక్తం ఉద్రేకంగా_వేడెక్కి మరిగిపోతూంది. అందుబాటులో ఆయుధమేదీ కనిపించలేదు. అతన్ని శిక్షించాలి ఎలా? వాళ్లు నన్నుచూసినట్లు లేదు. మూలగా ఉన్నారు. ఆమె_నేను విన్న కథలో ద్రౌపది అతను కీచకుడు. నేను భీముడినై యీ అన్యాయాన్ని_ అబలమీద జరుగుతున్న అత్యాచారాన్ని ఖండించాలి.

ఆవేశం, ఉద్రేకంగా ముందుకురికాను. అతనిమీద పడ్డాను. అతను తుళ్లిపడ్డట్టున్నాడు ఆమె కూడా. భయంగా ఒక మూలకు పరుగెత్తింది. అతను ఎదుర్కొంబోతూంటే_నాచేతికందిన సీసాతో_బలంగా అతని తలమీద కొట్టాను. ఆ దెబ్బ_ఆమెకే తగిలినట్లు కేకవేసింది_ఒక్కసారి నావేపుచూసి_ ఏదో స్ఫురించినట్లు_బట్టలు సరిచేసుకుని అక్కడినుంచి బయటకు పరుగెత్తింది. అతను కుప్పకూలిపోయాడు. నా శరీరంమీద_దుస్తులమీద రక్తం చిమ్మింది. ఒక్కసారతను కన్నులుతెరిచి నన్నుచూసి_ఎంతో ఆశ్చర్యంగా — "నువ్వా, సిద్ధార్థా_" అన్నాడంతే. తల వాల్చేశాడు.

అప్పుడు గుర్తించాను_ అతను_ మా నాన్నగారే అని! అయినా నాలో ఏమీ బాధకలగలేదు. అతనొక నేరస్తుడు. నేరం చేసినందుకు శిక్షననుభ వించాడు.

నాకెంతో ఆనందంగా ఉంది. ఇంకెంతో గర్వంగా ఉంది. ఇప్పటికి



నేను మనిషినవడం ప్రారంభించాను. అన్యాయన్ని తొలిసారిగా- నాకు నేనుగ ఎదుర్కొన్నాను. సఫలుడినయ్యాను. ఇది నా తొలివిజయం. శిష్టరక్షణ దుష్టశిక్షణలకు నేదే నాందిపలికాను. అన్యాయం మీద విజయశంఖం పూరించ గలిగాను. ఒక స్త్రీమీద జరగబోతున్న అత్యాచారాన్ని సమయానికి నివారించ గలిగాను. అమ్మ చెప్పిన పాఠాలను మొదటిసారిగా ఆచరణలో పెట్టాను. ఇందుకు నన్ను అమ్మ అభినందిస్తుంది. ఆశీర్వదిస్తుంది ఎంతో ఆనందిస్తుంది. నేను సాధించిన విజయాన్ని అమ్మకి చూపాలి.

భవనంవేపు నడవసాగాను. ఆనందంతో నా మనసు తేలిపోతూంది. ఎందుకో నాకు గర్వంగా అనిపిస్తూంది. త్వరగా నడిచి అమ్మను చేరాను. అమ్మ నాకోసమే వెతుక్కుంటూందని నాకు తెలియదు. అమ్మ తన గదిలో లేదు. ఎక్కడుంది? పిలుస్తూ- ప్రతి గదీ వెదికి- అమ్మను కనుక్కున్నాను. నన్నుచూసి ఒక క్షణం ఆనందించి- అంతలోనే కంగారుపడడం ప్రారంభి చింది.

ఏం జరిగిందో చెప్పమంది. నేను చెప్పలేదు. ఆమె చెయ్యి పట్టుకుని ఔట్ హౌస్‌కి తీసుకొచ్చి నేనుచేసిన ఘనకార్యం చూపాను. చనిపోయిన అతన్ని చూపింది అంతే. అమ్మ ఎన్నడూ లేనంతగా మారిపోయింది. ఒకటే ఏడుపుకి లంకించుకుంది అతన్ని- అసహ్యంగా రక్తాలుకారుతున్న అతన్ని- ఆ దుర్మార్గుణ్ని- ఆ నీచుణ్ని- తన వొడిలోకి తీసుకుని కన్నీరు కార్చసాగింది.

ఏమిటీ అమ్మ? ఆనందించవలసిన తరుణంలో దుఃఖిస్తుందేం? "అమ్మా! అతను స్త్రీమీద అత్యాచారంచేయబోయిన పాపి, నీచుడు. నేను సరిగ్గా సమయానికి రాకపోతే ఆ స్త్రీ యితని పశుబలానికి బలి ఐపోయి శీలం కోల్పోయి ఉండును. అపవిత్రురాలయిపోయి ఉండేది. నువ్వతన్ని ముట్టుకోకు. మైల పడిపోతావు-"

అమ్మ నావంక ఎర్రగ చూసిందని భయంవేసింది. కుంచించుకు పోయాను నాలోకి నేనే. తప్పుచేసినవాడివంక చూసేటట్లు చూస్తుందేం నావంక? ఒక్క మాటయినా అనదేం, నన్ను అభినందిస్తూ?

"అమ్మా! నువ్వతన్ని ముట్టుకోకు అపవిత్రమౌతావు-" మళ్ళీ హెచ్చరించాను.

ఈసారామె కళ్ళు నిప్పులే కురిశాయి. "నేను హిందూ స్త్రీని. నాకు భర్త కంటె పవిత్రుడెవరూ ఉండరు. చివరకు- పరమేశ్వరుడయినా పతిదేవుడి తరవాతే."

"నీకు- నాకంటెకూడా అతనే ఎక్కువా?" దెబ్బతిన్నట్లు గిలగిలలాడి పోయింది నా హృదయం. అమ్మ యిప్పుడు కొత్తగా మాట్లాడుతోంది. కొత్త విషయాలు చెబుతోంది!

"మీ నాన్నగారాయన. గౌరవించడం నేర్చుకో. నీ ప్రశ్నకి సమాధానం చెబుతున్నాను విను. అర్థంచేసుకో. ఆవేశపడకు. ఈ దేశంలో స్త్రీకి పుత్రుడికంటె భర్తే అధికం."

"కాని ఆయన అపవిత్రుడు. స్త్రీమీద అత్యాచారం చేయబోయినవాడు-"

"మధువు సేవిస్తారు. జూదమూ ఆడతారు. అయినా సరే." కటువుగా ఉందామె స్వరం

నేను నిశ్చేష్టుడనైపోయాను. నిర్ఘాంతపోతూనే అడిగాను. "నిజంగానా?"

"నూటికి నూరుపాళ్లూ." కచ్చితంగా అంది.

నాకు మతిపోయింది. ప్రపంచమంతా గిర్రున తిరుగుతున్నట్లయింది. ఏమిటీ దమననీతి? ఏమిటీ ద్వంద్వం? నాకు చెప్పినదొకటి, తను చేసేదింకొకటి. "మరి నాకిది ఎందుకు చెప్పలేదు?" నిలదీసినట్లే ప్రశ్నించాను.

"నువ్వు మగవాడివి కనుక స్త్రీ ధర్మాలగురించి నీకు చెప్పనవసరం లేదేమో అనుకున్నాను. పైగా- నువ్వు తొందరపడ్డావు"

"అమ్మా!"

"ఔను. నువ్వు హంతకుడివయ్యావు. నీ తండ్రినే హత్యచేశావు-"

"నేను హత్యచేసింది అన్యాయాన్ని-" రోషంగా అన్నాను.

"కాని- ఆ అన్యాయం నీ తండ్రి. పితృహత్య మహాదారుణం. ఘోర పాతకం-"

"తప్పుచేసినవారిపట్ల స్వపరభేదాలుండకూడదని నువ్వే బోధించావు."

"సిద్ధార్థా!" జాలిపడుతున్నట్లు చూసింది నావంక. "ఏ నియమానికయినా కొన్ని సడలింపులుంటాయి-"

"ఈ విషయమూ నువ్వింతవరకూ నాకు చెప్పలేదు-"

"మనిషివి కనుక నీకు నువ్వే తెలుసుకోగలవనుకున్నాను."

"నువ్వు నన్ను గీతమీద నడిపించావు. నువ్వు గీసిన గిరి దాటకుండానే నేను నడిచాను. నీ పెంపకంలో నాకు నేనుగా ఆలోచించుకునే స్వతంత్రతకి అవకాశం ఎక్కడయినా ఉండేదా?"

"అదే పొరపాటు చేశాను-"

"కాని- పొరపాటుచేసింది నువ్వయితే- నేనెందుకు బలికావాలి?"

"సిద్ధార్థా!" ఆవేశం ఆపుకోలేనట్లు అరచింది.

"ఔను నేరంచేసింది నువ్వు. దానిని నామీదకు నెట్టబోతున్నావు! నేను చేసింది నూటికి నూరుపాళ్లూ సమంజసమే. నువ్వు నేర్పిన విద్య- నేరం చేసినవాడు ఏ తండ్రయినా సరే- అతనిపట్ల విచక్షణ చూపనవసరంలేదు!"

"ఆపు నేను వినలేకపోతున్నాను. నీకేమి తెలియడంలేదు. నేను నీకు జ్ఞానం బోధించానో అజ్ఞానం బోధించానో నాకే అర్థం కాకుండా పోతూంది. నాకంతా అయోమయంగా ఉంది. సిద్ధార్థా! నన్ను నిలదీయకు. నేనెటూ చెప్పలేని సందిగ్ధంలోపడి విలవిలలాడిపోతున్నాను-"

"ధర్మాధర్మాలూ, సత్యాసత్యాలూ వీటిని తేల్చిచెప్పవలసిన అవసరం

ఏర్పడినప్పుడు మౌనం వహించడం కూడా మహాపాపమే ఔతుంది."

"... ."

"భగవద్గీతాసారం బోధించావే! నీకు నేను జ్ఞాపకంచేయాలా?"

". "

ఏమిటో అమ్మ అతి చిత్రంగా మారిపోయింది. ఎందుకలా శిలలాగ ఉండిపోతుంది. నే నెన్ని అడుగుతున్నా ఉలుకూపలుకూ లేకుండా? ఇప్పుడు అంతా అయోమయంగానూ ఆశ్చర్యంగానే ఉంది. నాన్నగారు భవనానికి వొచ్చినప్పుడు ఎలాగ ఉండేవారు! జోళ్లు అవతల విప్పి- కాళ్లు కడుక్కుని- పూజామందిరంలోకి వొచ్చి- దేముడికి నమస్కరించేవారు. సిగరెట్ కాల్చేవారు కారు. మరి యిక్కడ . బోట్ హౌస్‌లో?.... ఒక్క దేముడిబొమ్మయినా లేదు! కాల్చిపారేసిన సిగరెట్లు, మేజామీద సీసాలలో ఏమిటది?... తను దానితోనే అన్యాయాన్ని అంతంచేశాడు. ఆ సీసా పగిలి- ఎటువంటి వాసన వచ్చింది! ఇప్పటికీ గదినిండా అదే వాసన. భవనంలో దేముడికి ఊదొత్తులు వెలిగించే నాన్నగారు బోట్ హౌస్‌లో సిగరెట్ పీలుస్తూ కనపడ్డారు! అమ్మ చెప్పలేదు కానీ అదెందుకో నాకు చాలా తప్పులాగ కనిపించింది. అమ్మ కి దగ్గరగా అయినా రాని నాన్నగారు ఇక్కడ ఎవరో స్త్రీని- బలవంతంగా తన మీదకు లాక్కుంటూ . కనిపించేసరికి నేనుభరించలేక పోయాను. మతి పోయింది నాకు ఉద్రేకంలోనూ, అన్యాయాన్నణచివేయాలన్న ఆవేశంలోనూ, ఒక మంచిపని చేసి నా జీవితాన్ని సార్థకంచేసుకుందామన్న ఉత్సాహంలోనూ. నాన్నగారు చేస్తున్నది ఘోరమైన నేరంలా కనిపించింది. అంతే. విజృంభిచే శాను. ముందు వెనుకలాలోంచించవలసిన అవసరం నాకేమీ కనిపించలేదు. మంచి పనికి ఏ క్షణమయినా సుముహూర్తమే అని ఎన్నోసార్లు చెప్పింది అమ్మ.

అమ్మ నన్నెందుకు శిక్షిస్తుందో, నన్నెందుకు తీవ్రంగా నిందిస్తుందో నాకేమీ తెలియడంలేదు. అంతకంటె నన్నపరిమితంగా వేధిస్తున్న దేమిటంటే-

"నా ఆశలు నాశనమయ్యాయి.

నా కలల మేడ కూలిపోయింది.

నా వ్రతం చెడిపోయింది.

నా దీక్ష సడలిపోయింది.

నా జీవితమే విఫలమైంది." అంటూ నన్ను పట్టుకుని అమ్మ భోరున

ఏద్వడం. ధర్మాధర్మములలో ధర్మానే చెప్పింది. న్యాయాన్యాయాలలో న్యాయాన్నే చెప్పింది. కర్తవ్యాకర్తవ్యాలలో కర్తవ్యమే బోధించింది. సుగుణదుర్గుణాలలో సుగణాలనే సూత్రీకరించింది. నేను ఆ మేరకే-ఆ సగంమేరకే తెలుసుకోగలిగాను. ఔను. నేను సిద్ధార్థను మరి।

దోషి శిక్షార్హుడనే తప్ప ఆ శిక్ష విధించే అధికారం నాకు లేదనీ అందుకు సమర్థమైనది చట్టమనీ అమ్మ చెప్పలేదు. అమ్మ చెప్పినవే తప్ప చెప్పనిదేదీ నాకు తెలియదు. నేను అమ్మ బోధనలు మలిచిన మనిషిబొమ్మనంతే. అమ్మ ఎలాగ ఆడిస్తే అలాగ ఆడే తోలుబొమ్మనూ ఆటబొమ్మనూ. నాకదలికలన్నీ అమ్మ చేతిలోని దారాలను బట్టే. నేను- అమ్మ ఆడిన ఆటలో పావుని ఇదంతా అమ్మకు తెలుసు. ఇలా జరిగాక నన్ను నన్నుగాకాక తన కోరికల రూపంగా పెంచి పెద్దచేసిన అమ్మకు యిప్పుడు నన్నిలా నిందించేందుకు అధికారమూ న్యాయమూ ఎక్కడినుంచి వొచ్చాయి ? నేను నేను కానప్పుడు నేను చేసిన తప్పొప్పులు నావెలా ఔతాయి ? కర్మణ్యేవాధికారస్తు . మాఫలేషు కదాచన- అని చెప్పలేదూ భగవద్గీతలో ? నా దైవం అమ్మ. నా కర్మలకు బాధ్యురాలు అమే. అమె మలచిన శిల్పాన్ని నేను. అందుచేత- నేను చేసిన కార్యాల మంచిచెడులు నన్నంటవు. అమెకే చెందుతాయి. ఎందుకు మరచిపోయింది ప్రాథమిక సత్యాన్ని ? న్యాయాన్ని ? ధర్మాన్ని ?

నేను- సిద్ధార్థను.

అమ్మ- సగమే చిత్రించిన చిత్రాన్ని.

అర్ధభాగమే చెక్కిన శిల్పాన్ని.

సగమే మలచిన మనిషిని. సగం మనిషిని.

మీరు న్యాయం ఆలోచించండి. నేనెంతవరకూ అపరాధిని ? నేరం హంతకుడిదా, అతని చేతిలోని కత్తిదా ?

## 4

కాల గర్భంలో మరో ఆరేళ్లు గడిచాయి. ఇప్పుడు నా వయస్సిరవై రెండు. ఇప్పుడు నేను పూర్తయిన శిల్పంలా- పూర్ణ పురుషుడిని అమ్మ నన్ను సగం మనిషి చేసి వొదిలితే- మిగిలిన సగమూ అనుభవాలు పూర్తిచేశాయి. ఆదర్శాలూ ఆశయాలూ నాలోని అర్ధభాగం ఐతే అనుభూతులూ అనుభవమూ మిగిలిన అర్ధభాగం.

ఓహ్ !.. మీరు- గతించిన ఆ అధ్యాయం తాలూకు పరిణామం గురించి

ఫలం గురించి ఆలోచిస్తూ పరాకుగా ఉన్నారా! నిజమే. మీకుతూహలం సమంజసమే. అది ఎలా ముగిసిందో క్లుప్తంగా చెబుతాను. ఇప్పటి జ్ఞానంతో అప్పటి కథను చెబుతున్నాను కనుక మీకు సులభంగానే అర్థమౌతుంది.

నేను- తండ్రిని హత్య చేశాను. కారణం మేమయినా ఫలితం అదిం అమ్మకి నన్ను జైలుకు పంపటం అమిత బాధకరమయిన విషయం. ఆత్మహత్యా సదృశం. నాన్నగారు జమీందారుగా బ్రతికినవారు. ఐశ్వర్యానికి లోటు లేదు. ఈ రోజుల్లో ధనం సాధించలేనిదీ లేదు. కొండమీది కోతే కాదు, న్యాయపీఠం మీద నరోత్తముడిని కూడా క్రిందికి దింపగలదీ ధనం. ఐతే -ఒక్కొక్క మనిషి కొక్కొక్క వెల ఉంటుంది. ఆ ధర మనం చెల్లించగలగాలంతే. మాకు ఐశ్వర్యానికి కొదవేమిటి ? అమ్మ- పేరుమోసిన న్యాయవాదిని పిలిపించింది రాత్రికి రాత్రే. పిలిపించే ముందు నాకు చెప్పింది. "సిద్ధార్థా, దయచేసి నా కోరిక తీర్చవూ ? కోరిక కాదు... ప్రార్థన"...

"అదేమిటమ్మా ... మాతృమూర్తివి నీవు. నీ పుత్రుడిని నేను. నువ్వు నన్ను వేడుకోడమూ కోరుకోడమూ ఏమిటి, ఆజ్ఞాపించాలి గాని."

"పోనీ.... ఆజ్ఞ. తు. చ. తప్పకుండా పాటిస్తావా ?"

"నీ కెందుకు కలిగింది నాపై అటువంటి సంశయం ?"

"మంచిది. నేను వాంఛించే దదే. కొంచెం సేపట్లో ప్లీడరుగారు వొస్తారు. వారేం చెబుతే అది చెయ్యాలి. ఏం చెప్పమంటే అవి చెప్పాలి."

"అలాగే."

"నాన్నగారినిని నువ్వు చంపినట్లు ఎవరితోనూ అనకూడదు-"

"అబద్ధమాడేదా ?" తెల్లబోయి చూశాను. "అమ్మా ! నువ్వేనా చెబుతున్నది ?" ఎంత గిలగిలలాడిపోయింది అమ్మ ! నేనలా అడిగేసరికి. ఆమె ముఖం వివర్ణమూ రక్తహీనమూ ఐపోయింది. "నువ్వెంత భయంకరమయిన పరిస్థితిలో చిక్కుకున్నావో నీకు తెలియదు. ఐనా- ప్రాణ విత్త మానభంగము లందు బొంకవచ్చునధిప. అఘములేదు- అన్నారుతే... "

"ఇప్పుడు నాకు దేనికి భంగమొస్తూందని ?"

"ప్రాణానికీ, మానానికీ. నాతో వాగ్వాదం చేయకు. చెప్పినట్లు విను నీ కాళ్లు పట్టుకుంటాను-" ఏడ్చేసింది."

"సరే." అన్నాను నా సందేహాలను నాలోనే యిముడ్చుకుని.

న్యాయవాది వొచ్చాడు. అమ్మ నన్ను నా గదిలోకి వెళ్ళిపొమ్మని అయ

నతో చాలాసేపు మాట్లాడింది. ఇద్దరూ బోట్ హౌస్‌లోకి కూడా వెళ్లినట్లున్నారు. తెల్లవారుతూంటే పోలీసులు వచ్చారు. అంతే తెలుసు నాకు. అమ్మ ఒకసారి ఆ న్యాయవాదికి చాలా డబ్బివ్వడం మాత్రం చూశాను. ఇప్పుడర్థమౌతుంది. నేను చేసినది నేరమనీ, దానిని డబ్బుతో అమ్మ మాఫీ చేయించిందనీ!

నన్ను కనీసం కోర్టుకయినా పిలవలేదు. నేను అబద్ధం చెప్పవలసిన అగత్యమే ఏర్పడలేదని అమ్మ ఆనందం వెలిబుచ్చింది. కేసు ముగిసిపోయింది అతి తొందరలోనే. అప్పుడు నన్ను పిలిచింది ఓనాడు తన గదిలోకి. "సిద్ధార్థా... నువ్వింకా చదువుకోవాలి."

"నువ్వు చెబుతూనే ఉన్నావుగా..."

"అది చాలదు. నేను నీకు సగం మాత్రమే చెప్పగలిగాను. మిగిలినది నీ అంతట నువ్వే తెలుసుకోవాలి. నిన్ను మంచిచోట చేరుస్తాను. తరువాత - యీ భవనమూ అవీ అమ్మేద్దామనుకుంటున్నాను- నీ అభిప్రాయం చెప్పు.

"నా అభిప్రాయమేమిటి! అమ్మవి.... అన్నీ తెలిసినదానవూ...."

"నిజానికి వీటన్నిటికీ అధికారివి నువ్వే. నైతికంగా కూడా నాకు హక్కు లేనూలేదు, అవసరమూ లేదు. అందుకే- యిక యిక్కడ ఉండలేమని. అమ్మేద్దామనుకుంటున్నాను. నువ్వు కాలేజీలో చేరుదువుగాని పట్నంలో యిల్లుతీసుకుని వంటవాడిని పెట్టుకుని ఉందువుగాని."

"నువ్వు?"

"నా గురించి చింతలేదు. ఒంటరిదానను. ఎక్కడుంటే దినం తీరదు?"

"నాతోనే ఉండొచ్చుగా!"

"వొద్దు. నువ్వు యికనయినా స్వేచ్ఛగా స్వతంత్రంగా పెరిగి వికసించాలి. ఎంతపడని మొక్క - నిరంతరమూ నీడలోనే ఉంటే మొక్కతాలూకు పెరుగుదల ఆరోగ్యంగా సాగదు. ఎండా నీడా రెండూ ఉంటేనే మొక్కకి మంచిది తట్టుకునే శక్తి వొస్తుంది. చిరుగాలికి కూలిపోదు."

అమ్మ ఉద్దేశం స్పష్టంగా అర్థమైంది. ఆమె చాలా పశ్చాత్తాపపడుతున్నట్లుంది ఆమె కళ్లను చూస్తూంటే. ఏదో దృఢనిశ్చయానికే వొచ్చినట్లుంది. అదీగాక- నిజం చెప్పాలంటే నాకూ ఆ కొత్త జీవితంపట్ల ఆకర్షణ పుడుతోంది. అతి ప్రేమకూడా ఒక విధమయిన బందికానాయేమో. నాకూ స్వేచ్ఛగా ఉండాలనిపిస్తూంది. కొత్తదనపు జీవితంవేపు మనసు ఉరకలూ పరుగులూ వేస్తూంది. ఒకరకమయిన విషాదం గ్లానీ పుట్టేశాయి యింతవరకూ అనుభవిస్తూ

వొచ్చిన జీవితం మీద. అందుకే నేవింకేమీ అనకుండా మౌనంగా ఉండిపో యాను అమ్మ మాటను శిరసావహిస్తున్నట్లు.

"సిద్ధార్థా!" గంభీరంగా పిలిచింది అమ్మ.

"ఏమిటమ్మా!"

"నాకొక వాగ్దానం చేయి. నీ మేలుకోసమూ నా మేలుకోసమూ."

"చెప్పమ్మా." బుద్ధిగా కూర్చున్నాను.

"నువ్వు చేసిన పని- అదే మీ నాన్నగారిని నీ చేతులతో చంపడం- ఎట్టి పరిస్థితులలోనూ ఎవరికీ చెప్పకూడదు. సాధ్యమైనంతవరకూ నీ గతాన్ని ఎవ రికీ చెప్పకు-"

"అలాగే. కాని- ఎందుకని? అదంత నీచమైనదా? అసహ్యకర మైనదా?"

"మున్ముందు నీకే తెలుస్తుంది ప్రపంచజ్ఞానం తగినంత కలిగాక. మేధస్సూ మనస్సూ వికసించాక.."

"సరే."

కొంచెం రోజులలోనే నేను పట్నానికి వొచ్చేశాను. చెరలోంచి బయ టకు వొచ్చినట్లనిపించింది ఒక్కసారి. కొత్త జీవితం... స్వేచ్ఛ. స్వాతంత్ర్యం... ఒంటరితనం కొత్తస్నేహాలు కాలేజి వాతావరణం- ఉక్కిరిబిక్కిరి చేశాయి. ప్రతీదీ నాకు అంతే. కొన్నినెలలకుగానీ నేను నూతన వాతావరణాని కలవాటుపడలేకపోయాను. తరువాత- అదే సహజంగా అనిపిం చడం ప్రారంభించింది- ఎప్పుడయినా గతం గుర్తువొస్తే- గత జీవితమే అసహజంగా తోచేది. నేను ధనవంతుడిని. ఖర్చుకి వెనుకాడను. కనుక నాకు స్నేహితు లెక్కువమందే తయారయ్యారు. వాళ్లతో కలసి తిరగడంలో- ప్రపంచం కొంతవరకూ అర్థమయ్యేది. డబ్బుకుండే శక్తితోపాటు- దానిపట్ల ఆకర్షితులై మనుషులెన్ని మోసాలు చేస్తున్నారో కూడా తెలియవచ్చేది-

వయసుకి సహజంగా పెరుగుతున్నాన నేను. ఆ వయసుకి లక్షణ మయిన వలపు జల్లు నా హృదిలోనూ కురిసి- హృదయాన్ని ప్లావితం గావిం చింది. స్త్రీ సౌందర్యం మించిన దైవత్వమూ పవిత్రతా మరేమీ లేవేమో! స్త్రీ పురుషుల నడుమ ఉండే ఆకర్షణ అది- వలపే అయినా- ప్రేమయినా- దాన్ని మించినది మరేదీ లేదేమో లేకపోతే- కవులందరూ ప్రేమ గురించే గేయాలు వ్రాశారేం? రచయితలందరూ దానినే కథావస్తువుగా తీసుకుంటూ

వచ్చారేం? యుగయుగాలుగా వొస్తున్న యీ ప్రేమకుసుమం వాడిపోకుండా యిప్పటికీ తాజాగా సుందరమైన రేకులతోనూ సువాసనలతోనూ నిత్యమూ వికసిస్తూనే ఉందేం? షేక్స్పియర్.... కీట్స్.... బైరన్.... షెల్లీ.... మహాకవులందరికీ ప్రేమే ఆరాధ్యనీయమూ లక్ష్యమూ అయింది.

సమాజం నాకు మెల్లమెల్లగా పరిచయమౌతున్నది- ప్రత్యక్షంగానూ, పుస్తకాల ద్వారానూ. నేను సమాజంలో మసలుతున్నాను. ఎన్నెన్ని అనుభవాలు! ఒక పూట తిండికోసం.... పిల్లలకి గంజినీళ్ళకోసం- శరీరాన్నమ్ముకునే స్త్రీలున్నారు. తన సుఖంకోసం.... డబ్బుకోసం.... ఎదుటి మనిషిని హత్య చేసేందుకయినా సంకోచించని సంకుచితులున్నారు. మిథ్యాగౌరవాలకోసం జీవితాలని పణంపెడుతున్న అమాయకులున్నారు. వంచకులున్నారు.... సాంతకులున్నారు. వీళ్ళే కాదు. పేదరికంతో- ముష్టెత్తుకునే వాళ్ళున్నారు. పేరుకిపోయిన ధనాన్నేంచేసుకోవాలో తెలియనివాళ్ళున్నారు. కార్లలో తిరిగేవాళ్ళు; కాళ్ళులేనివాళ్ళు; భవనాలలో నివసించేవారు- మురికివాడల గట్టున ముడుచుకుని పడుకునేవాళ్ళు.... యాచకులు-దాతలు; వ్యభిచారులు- పవిత్రులు; పాపులు-పుణ్యాత్ములు; స్వార్థపరులు-త్యాగజీవులు; అధములు-ఆదర్శప్రాయులు.... మంచివాళ్ళు, చెడ్డవాళ్ళు వీళ్ళందరూ నేనున్న ప్రపంచంలోనే ఉన్నారు; నాతోపాటు బ్రతుకుతున్నారు; నేను వారిమధ్య పెరుగుతున్న- వాళ్ళలాటి మనిషిని; వాళ్ళు- నాలాటి మనుషులు.

ప్రకృతిలో .... ప్రపంచంలో .... మానవ జీవితంలో - అన్నీ ద్వంద్వాలే: మిట్టపల్లాలు, శిఖరాలు, లోయలు; వెలుగూ- చీకటీ; మంచీ- చెడూ; కరుణ-కార్పణ్యం; కలిమి-లేమి; సుగుణం-దుర్గుణం; పవిత్రత-అపవిత్రత.... లక్ష్యం, నిర్లక్ష్యం; శ్రద్ధ-అశ్రద్ధ.... ప్రేమ-పగ ఇంకా ఎన్నెన్నో ద్వంద్వాలు.

విచిత్రమేమిటంటే జీవితమంటే ఏ ఒక్కటీ కాదు. అన్నీను. మంచీ, చెడూ కలిస్తేనే మనిషి. లోతుగా శోధించగలిగితే మంచిలో చెడునీ, చెడులో మంచినీ కూడా చూడగలగవచ్చు. మనిషి జీవితమనే నాణానికి మంచి ఒకవేపయితే- చెడు మరొకవేపు. ఏవేపు లేకపోయినా నాణెం ఉండడం ఎలాగ అసాధ్యమో ద్వంద్వాలలో ఏ ఒకటి లేకపోయినా మానవ జీవితమూ లేదు.

యూనివర్సిటీలోంచి బయటకు వొచ్చేటప్పటికి - గ్రంథస్థమైన జ్ఞానంతోపాటు నా చుట్టూఉండే సమాజం నుంచి విజ్ఞానాన్నీ అలవరచుకున్నాను. ఒక మనిషి మరొక మనిషి వేరు. ఒక మెదడు ఆలోచించినట్లు మరొక మెదడు ఆలోచిం

చదు. ఒక మనసు స్పందించినట్లు మరొక మనసు స్పందించదు. సామీప్యం ఉండవొచ్చుకానీ సారూప్యం ఉండదు. సృష్టిలో ఎంత వైవిధ్యం! ఎంత భిన్నత్వం!!

ఐతే- ఉండుండి నాకొక భయంకరమయిన స్వప్నం వొచ్చేది. ఆ స్వప్నంలో రెండు చేతులు- రక్తసిక్తమై వేళ్లనుంచి రక్తాలు కారుతూ.... ఎర్రగా భయంకరంగా నా ముఖంమీదకు వొచ్చేవి నాన్నగారి తల పగిలి రుధిరం స్రవిస్తూ నా ముఖం ముందు నాట్యమాడేది నవ్వుతూ. మొండెంలేని తల రక్తం చిందుతూ గాలిలో తేలుతూ నవ్వుతూ నన్ను ముద్దుపెట్టుకునేది.

త్రుళ్లిపడి లేచేవాడిని. శరీరమంతా స్వేదం క్రమ్మి ఉండేది ఏ. సి. రూములో పడుకున్నా. నా కల కర్థం నాకు తెలుసు. ఆ ఎర్రని చేతులు నావే. నేను హంతకుణ్ని. గతంలో నేను చేసిన హత్యను జ్ఞాపకంచేస్తూ ఆ కల చాలా భయపెట్టేది అర్ధరాత్రి లేచి కూర్చునేవాడిని నిద్రపట్టక. ఈ పాప పంకం రక్తపంకం కడుక్కునేదెలా? ఒకనాటి రాత్రి నాకు చిత్రమైన అనుభవం కలిగింది. అది వాస్తవమా అవాస్తవమా అన్నది వేరే ప్రశ్న. ఎప్పటిలాగే ఆ శిరస్సు నన్ను ముద్దుపెట్టుకుంది. నేను త్రుళ్లిపడలేదు. గుండె ఓగబట్టుకుని భరించాను అప్పుడా తల అంది—— "కృతజ్ఞతలు సిద్ధార్థా! ఈ స్పర్శకోసమే జీవితమంతా తపించాను. నిన్ను ముద్దుపెట్టుకోవాలనీ, ఆశీర్వదించాలనీ ఎంత పరితపించిపోయానో! తీరని ఆవాంఛ మూలంగానే నా ఆత్మకు విముక్తి లభించలేదు. ఇన్నాళ్లకి నా కోరిక తీరింది "

"మీరు నన్నెందుకు ముద్దుపెట్టుకోలేకపోయారు మీ పుత్రుణ్నే కదా నన్నాశీర్వదించడానికి మిమ్మల్ని అడ్డిన దెవరు?"

"నా వ్యసనాలు, వాటిమూలంగా నన్ను తననుంచీ, నిన్ను నానుంచీ దూరంచేసిన మీ అమ్మ సిద్ధాంతాలు పవిత్రతా. నేను తాగేవాడిని జూదమాడే వాణ్ని స్త్రీలతో సుఖించేవాడిని — చాలమంది జమీందార్లలాగే. నేను వ్యసనపరుడిననీ, అపవిత్రుడిననీ- నేను నిన్నుకానీ తనని కానీ ముట్టుకోకూడదని ఆంక్ష విధించింది మీ అమ్మ. ఆమె కిచ్చిన మాట నిలుపుకుందుకు "

"అయ్యో! అమ్మ ఎంత తొందరపడింది! వ్యసనాలు కూడా జీవితంలో ఓ భాగమే కదా? వాటిని క్షమించ గలిగితే "

"క్షమించడ మనేది మీ అమ్మకి తెలియదు. తప్పు చేయకూడదన్నదే



ఆమె సిద్ధాంతం. దానికి సడలింపు లేదు__"

"తప్పు చేయనిదే మనిషెలా ఔతాడు? క్షమించలేనిది జీవితమెలా ఔతుంది?"

"నిన్నూ తన అడుగుజాడలలోనే నడిపించింది. సిద్ధార్థా! నువ్వు నన్నెందుకు హత్యచేసావో తెలుసునా?"

"మీ రెవరో స్త్రీమీద అన్యాయంగా అత్యాచారం జరుపబోతుంటే ఆమె కేకలు విని "

"అది అత్యాచారం కాదు. శృంగారం! ఆ కేకలు మా రాసకేళిలో ఒక భాగమే ఆ స్త్రీకి నేనంటే అమిత యిష్టం."

"అయ్యో! ఎంత మూర్ఖుడినైపోయా నాక్షణంలో_"

"ఆ మూర్ఖత నీది కాదులే."

"నన్ను క్షమించిరా నాన్నగారూ?"

"సిద్ధార్థా! నా కిప్పుడెంతో అనందంగా ఉంది. నిన్ను నేను క్షమించ నక్కర్లేదు. నువ్వు నన్నర్థంచేసుకున్నావు. ఆమోదించావు. అది చాలు. నాకు మహదానందంగా ఉంది నా కోరిక తీరింది. నాకు విముక్తి లభించింది. సిద్ధార్థా! ఇది మీ అమ్మకు చెప్పకు. భరించలేదు. ఇంక నేను నీకు కనిపించను "

"నాన్నా"

"ఓహ్! నీ స్పర్శ ఎంత హాయిగా వుంది! దీనికి దూరంగా అన్నాళ్లెలా ఉండగలిగానో! చాలు యీ అనుభూతి వొస్తాను సిద్ధార్థా."

ఆకల- నాన్నగారు మాయమైపోయారు. అంతేకాదు, ఆ భయంకరమైన కలకూడా రావడం మానేసింది. నా చేతులు రక్తపంకంతో కనిపించడంలేదు. నాన్నగారు నన్ను క్షమించారు. అది చాలు. నాకు తృప్తిగా- హాయిగా ఉంది. నేను హంతకుణ్నేమో అన్న భయమూ భావమూ నా అంతరాత్మను వీడి పోయాయి. యూనివర్సిటీ చదువు ముగిసిన సందర్భంగా ఒక్కసారి అమ్మని చూడాలనిపించింది. బయలుదేరాను- ముందుగా వ్రాసి. అమ్మకూడా రమ్మని వ్రాసింది. నన్ను చూడాలని తనకీ ఉందట.

ఆరేళ్లయిపోయింది - యిద్దరమూ ఒకరినొకరు చూసుకుని. అమ్మ యిచ్చిన ఆశ్రమం అడ్రసు నా కాశ్చర్యం గొలిపింది. అక్కడకు చేరాను.

అమ్మ అరవిందాశ్రమంలో ఉంది.

పేరు చెబితే నన్ను ఒక కుటీరానికి తీసుకువెళ్లారు. ఆ కుటీరంలో ఉంది.

"వొచ్చావా సిద్ధార్థా!"

"అమ్మా!"

"ఎన్నాళ్లయింది నిన్ను చూసి!" అంటూ దగ్గరకు తీసుకుంది.

"ఏమిటమ్మా యిలాగ అయియావు!"

"ఎలాగ?" పేలవంగా నవ్వింది.

"చిక్కిపోయావు. చాలా వృద్ధురాలివై పోయినట్లు "

"అభిమానం అలా అనిపిస్తుంది-"

"కాదు. నిజమే."

"జీవితంలో నాకేం ఉత్సాహం మిగిలిందని ఆరోగ్యంగా ఉంటాను? నా మాటకేం, నీ గురించి చెప్పు."

"ఏం చెప్పేది?"

"ఏం నేర్చుకున్నావీ ఆరేళ్లలో ?"

"ఎమ్మే పరీక్షలు వ్రాశాను. తప్పకుండా కృతార్థుడనౌతాను."

"ఆ చదువు గురించి కాదు నే నడిగేది."

"మరి ?"

"జీవితం గురించి. జీవితసారాలేం నేర్చుకోగలిగావని "

"చాలానే తెలుసుకోగలిగా ననుకుంటానమ్మా."

"కొంచెం చెప్పు."

"ప్రపంచమంతా ద్వంద్వాలమయం. మానవజీవితమూ అంతే. ప్రతి మనిషిలోనూ మంచీ ఉంటుంది, చెడూ ఉంటుంది. చాలామంది మనుషులు రెండేసి జీవితాలు గడుపుతూంటారు. బయటకు కనిపించే మనిషొకటి, లోపలి మనిషి మరొకటి. దానివల్ల చాలా అనర్థాలు కలుగుతాయి. కాని– ఎవరూ యీ రెండు ముఖాల జీవితంనుంచి ఎదగలేరనుకుంటాను. ఇదొక చిత్రం. తప్పుచేయడమూ, క్షమించగలగడమూ కూడా మానవత్వంలో భాగాలే. తప్పు చేయకుండా ఉండడంతోపాటు– తప్పుచేస్తే క్షమించగలగడమూ మనిషి నేర్చుకోవాలి "

ఆమె పొంగిపోయింది.

కళ్లవెంట నీరుబుకుతూంది.

ఒక్కసారి నన్ను గట్టిగా కౌగిలించుకని– "చాలు సిద్ధార్థా చాలు. నువ్వింక సిద్ధార్థవు కావు. పూర్ణమానవుడివే." అంది.

"అమ్మా !"

"ఔను. ఈ ప్రపంచంలో నువ్వు బతకగలవనే విశ్వాసం నాకు కుదిరింది. నాకు చాలా సంతోషంగా ఉంది. నా జీవితం సఫలమైంది. నే నోడిపోయాను. ఈ ఓటమే నా కెక్కడిలేని సంతోషమూ కలిగిస్తూంది "

"అమ్మా !"

"అడ్డుపడకు. నా సంతోషాని కడ్డురాకు. నాకెంత ఆనందంగా ఉందంటే..." ఉక్కిరిబిక్కిరౌతూంది అమ్మ.

"నువ్వసలే నీరసంగా ఉన్నావు " నా మాట పూర్తికానేలేదు. అమ్మ ఆనందంపట్టలేక– దగ్గుతూంది. ఉక్కిరిబిక్కిరౌతూంది. ఆయాసపడుతోంది నాకేమిటో కంగారుగా భయంగా ఉంది.

"అమ్మా !–"

"సి ద్ధార్థా " నా చేతిని గట్టిగా పట్టుకుంది.

"అమ్మా !–" ఆత్రంగా పిలిచాను. నా కళ్ళల్లోకి నీళ్ల వొచ్చేస్తున్నాయి నా చేతిని పట్టుకున్న అమ్మచేయి – పట్టు వొదిలేసింది

అమ్మ– నా వడిలోకి వాలిపోయింది.

"అమ్మా !" గట్టిగా కేక వేశాను దిగంతాలు పిక్కటిల్లేలా.

కాని–

అమ్మకి నాకేక వినిపించదు. నేను చెప్పాలనుకున్న అనేక యితర విషయాలూ వినిపించవు !

నా కేకవిని– నలుగురూ వచ్చారు.

జరగవలసిన కార్యక్రమాలు ఎవరో జరుపుతున్నారు.

నేను నిశ్చైతన్యంగా నిలచిపోయాను.

చితి వెలిగించాను.

అమ్మ శరీరం దగ్ధమౌతూంది.

చెలరేగుతున్న ఆ మంటలను చూస్తూంటే– నాలో రకరకాల ఆలోచనలు పుడుతున్నాయ్.

అమ్మ జీవితంలో– ఏం సుఖపడింది ?

రెండు ముఖాల జీవితం నాన్నగారిది. అది అమ్మని కాటేసింది.

నన్నూ కాటేసింది. ఆయననీ కాటేసింది.

నేనయితే– బయటపడగలిగాను.

అమ్మ– శాశ్వతంగా బలయిపోయింది !

దహనం పూర్తయిందని– ఎవరో నన్నవతలికి నడిపించుకు వెళ్తున్నారు. నేను యాంత్రికంగా కదులుతున్నాను.

నాలో ఒకే ఒక్క ప్రశ్న–

ఈ జీవిత మేమిటి ? దీని కర్థమేమిటి ?

# నాకు నచ్చిన నా కథ



వీరభద్రరావ్ పమ్మి

ఏ కథైనా రాస్తున్నప్పుడే- నాకు చాలా మంచి కథలా అనిపిస్తుంది. రాసిన కథలన్నిటినీ పరిశీలించి చూస్తే అందులో కొన్ని ఓ మాదిరిగా ఉంటాయి. కొన్ని బాగుంటాయి. కొన్ని ఇంకా బాగుంటాయి. అలా వడబోయగా నాకు ఎంతో బాగా నచ్చిన కథ.... మరో ఆకలి కథ. అన్నింటి కన్నా ఇది ఎక్కువ నచ్చడానికి కొన్ని కారణాలున్నాయి-

ఆకలి, అన్యాయం, మోసం, ప్రేమ, త్యాగం.... ఇలా ఏ విషయం తీసుకున్నా-ప్రతి భాషలోను (తెలుగుతో సహ ఎన్నోకథలు వచ్చాయి. రాయని సబ్జెక్టే కనిపించదు. కాకపోతే- అవే సబ్జెక్టులు- ఏదో కొత్త విషయాన్ని వెలికిపట్టి, ఆ సంఘటనని, లేదా ఆ పాత్రని.... తనదైన దృష్టిలో చూసి నలుగురికి చెప్పడానికి ప్రయత్నిస్తాడు రచయిత. ఆకలి మీద వేల కథలు వచ్చాయి. అదే అకలి మీద కొత్త తరహామైన కథ చెప్పాననన్న తృప్తి- ఈ కథ రాయడం వల్ల నాకు కలిగింది.

ఇది నేను రాసిన రెండో కథే అయినప్పటికీ, ఇది ఆంధ్రప్రభ వార

పత్రికలో ['75 ఉగాది ప్రత్యేక సంచిక] ప్రచురింపబడినప్పుడు కథా రచయితగా నాకు మంచి గుర్తింపు వచ్చింది

అందువల్ల కూడా ఇది నాకు ఎక్కువగా నచ్చిందనిపిస్తుంది.

ఇది మీకూ నచ్చుతుందని నా ఆశ . ఇహ చదవండి.

# మరో ఆకలి కథ

ఆఫీస్ ఫంక్షన్ జరగడానికి కింక పదిరోజులుంది.

నాటకం రిహార్సెల్ నా ఊపిరి పీల్చేస్తూంది.

ఛీ! ఇంకెప్పుడూ ఈ వెధవలతో నాటకా లెయ్యకూడదు. అయినా, ఇలా ఇదివర కెన్నిసార్లనుకోలేదు?

ఈరోజు రిహార్సెల్‌లో నాకు చిరాకు, కోపం, నీరసం, ఉడుకుమోత్తనం, ఏడుపు- అన్నీ కలగాపులగంగా వచ్చాయి.

రావుగాడు మరీ వెధవ.

ఎప్పుడూ టైముకి రాడు.

ఎప్పటికీ పోర్షన్ రాదు.

ఎన్నడూ చెప్పిన మాట వినడు.

తీరా స్టేజి ఎక్కేసరికి దడా వణుకూ.

వాడో పెద్ద నటుణ్ణనుకుంటాడు.

ఇదంతా నా ఖర్మ.

మా ఆఫీసులో అంతకన్నా నాటకాలేసే మనుషులే లేరు. వాడిమీద ఎప్పుడేనా పి. కుపడితే "నువ్వొక్కడివే చేసుకో!" అంటాడు.

వాడితో ఈ రోజు పెద్ద యుద్ధమైపోయింది.

అసలు దీ కంతా కారణం సుమిత్ర.

దానికసలు బుద్ధిలేదు.

పోనీ, గోలెడతూందని దీపావళికి పుట్టింటికి పంపిస్తే పండుగైపోగానే వచ్చెయ్యొద్దూ?

"మా అమ్మకి నీరసంగా ఉంటూంది. పెద్దాదిన నీళ్ళోసుకుని పుట్టింటికెళ్ళింది. చెల్లాయికి కాలేజీచదువు. చిన్నొదిన మామూలుగానే సంవత్సరంలో సగభాగం పైగా పుట్టింట్లోనే ఉంటుంది కదా? కాబట్టి నాన్నగారి బలవంతం

మూలాన మరో నెల్లాళ్ళు ఇక్కడుంటున్నాను. ప్రియమైన శ్రీవారూ! అనుమతిస్తారు కదూ ?" అంటూ వ్రాసింది.

మధ్యాహ్నం ఆఫీసులో ఆ ఉత్తరం అందుకున్నప్పట్నుంచి నా కసలు మూడ్స్ బాగా లేవు.

సుమిత్ర మీద జన్మలో ఎప్పుడూ రానంత కోపం వచ్చేసింది. (అఫ్ కోర్స్! మా పెళ్ళయి ఇంకా సంవత్సరం కాలేదు.)

స్టుపిడ్! ఇంకెప్పుడూ ఛస్తే పుట్టింటికి పంపను.

వారం రోజులుగా వస్తుందని ఎదురుచూస్తున్నాను.

రోజూ పాలు ఎక్స్ట్రా పోయించుకుని ఉదయం ఎనిమిది గంటలదాకా వచ్చి పోయే ప్రతి ఆటోని శ్రద్ధగా పరికిస్తున్నాను.

ఒక్కటీ మా ఇంటిముందాగదు.

సుమిత్ర దిగదు.

రాత్రిళ్ళు నాకు నిద్రపట్టదు.

అయినా, వాళ్ళ పెద్దవాళ్ళకేనా బుద్ధుండొద్దూ ?

మా పెళ్ళయ్యాక సగం రోజులు అక్కడే ఉంది.

పోనీ, ఒకసారి పోయివద్దామంటే ఈ నాటకం ఒకటి నా ప్రాణానికి!

ఏ జంట నక్కగా వెడుతున్నా వెంటనే సుమిత్ర గుర్తుకొచ్చేస్తూంది.

అయినా, పెళ్ళికాకముందు ఎన్ని సంవత్సరాలు ఒక్కణ్ణీ ఉండలేదు? ఎప్పుడేనా అమ్మమీద కాని, ఇంటిమీద కాని బెంగెట్టుకున్నానా ?

మరి ఇప్పుడు ?

ఏమిటీ మార్పు ?

శ్రీదేవి వదిన పుట్టింటి కెడితే వారం తిరక్కుండానే అన్నయ్య గుంటూరు బస్సు ఎందుకు ఎక్కేసేవాడో ఇప్పు డర్థమౌతుంది.

కార్తీ మాసం మూలంగా చలి కుదిపేస్తూంది.

దారుణమైన ఒక్కరి చలి.

నాకైతే మరీ ఘోరంగానూ, భయంకరంగానూ అనిపిస్తూంది.

సుమిత్ర లేనిదే ఒక్కణ్ణీ ఈ చలిని భరించలేననిపిస్తూంది.

రిహార్సల్ నుంచి బయటికొచ్చిన భాస్కరం అడిగాడు!

"ఏమిటి, ఈ వేళ నీ మూడ్ బాగాలేదు ?"

"ప్రత్యేకంగా కారణ మేమి లేదు."

"అన్నట్టు మీ మిసెస్ నుంచి లెటరొచ్చిందా ?"

"మరో నెల్లాళ్ళ అక్కడే వుంటుందట."

"ఐ సీ ! మూన్‌లాండ్‌కి పోదాం– రారాదూ ? మంచి కేబరే ఉంది. ప్రీతి ప్రమ్ బాంబే చేస్తూంది."

సుమిత్ర మీద కసి తీర్చుకోవాలనిపించింది.

"నడు" అన్నాను.

కేబరే బాగుంది.

బాగా ఎంజాయ్ చేశాం. ఇద్దరం చెరో క్వార్టరూ విస్కీ బిగించాం. అక్కడున్న కాసేపు హాయిగా ఫీలయ్యాను.

నన్నింటి దగ్గర తన స్కూటర్ మీద డ్రాప్‌చేస్తానన్నాడు భాస్కరం. వద్దన్నాను.

రవీంద్రభారతి దగ్గర వదిలేసి తను నారాయణగూడా వెళ్ళిపోయాడు.

బార్‌లోంచి బయటపడ్డాక చలి మరీ ఎక్కువయింది.

డాన్స్ చూసినప్పటినుంచి మనస్సులో చలి మొదలయింది.

అసెంబ్లీ కెదురుగా జాంజాం కేఫ్ దగ్గర నిలబడ్డాను. రిక్షాలు, ఆటోలు ఏమీ లేవక్కడ.

రోడ్డంతా నిర్మానుష్యంగా ఉంది.

నేనక్కడ నిలబడ్డాక కొన్ని క్షణాలకు గాని చూడలేదు.

చీకట్లో కళ్ళు పెద్దవిచేసుకుని చూశాను.

ఒక యువతి గోడపక్కగా నిలబడింది.

ముదురు రంగు చీరలో కొంగు నెత్తిపైదుగా కప్పుకుని గోడకు జేర్లబడి నిలుచుంది.

దగ్గరగా చూస్తే ఆమె బాగా ఉందనిపించిది.

టైమ్ చూశాను. పన్నెండూ పది.

ఇప్పుడామె అక్కడెందుకు నిలబడినట్లు ?

బస్సులు వచ్చే టైమ్ దాటిపోయిందే ?

కొంచెం అర్థమైంది నాకు.

కొన్ని క్షణాలాగి ఆమెకు దగ్గరగా వెళ్ళాను.

"మీ రెక్కడికి వెళ్ళాలి ?" నేనే అడిగాను.

"కోఠీ."

"మిం చ్చాక బస్సది రాలేదా ?"

ఆ సమయంలో బస్సు రాదని తెలిసీ అడిగాను.

"లేదు."

ఇంకొంచెం అర్థమైంది.

"మీ రెక్కడికి వెళ్ళాలి ?" ఆమె అడిగింది.

"సుల్తాన్ బజార్."

నే నింకేమీ మాట్లాడలేదు.

ఖాళీ ఆటో వెడుతూంది. నేను పిలవకుండా తనే స్లో చేశాడు. అప్పుడు పిలిచాను.

ఆటో వచ్చి నా ముందాగింది.

మళ్ళి ఆమె దగ్గరి కెళ్ళాను.

"వస్తారా ?"

"ఎక్కడికి ?"

"మా ఇంటికి."

"మీ ఇంటికా ?" భయంగా అంది.

"ఫరవాలేదు. ప్రస్తుతం మా ఇంట్లో ఇంకెవరూ లేరు."

ఆమె ఏమీ మాట్లాడలేదు.

ఆమె ఇంకేమీ ఆలోచించలేదు.

ఆటోలో నా పక్కన కూర్చుంది.

నిర్జనంగా ఉన్న రోడ్డుమీద ఆటో స్పీడుగా పోతూంది. చలిగాలి రయ్ మని వీస్తూంది.

నేను వేసుకున్న స్వెట్టర్ చలి నాపలేకపోతూంది.

తాగిన మందు శరీరాన్ని వేడెక్కించలేకపోతూంది.

ఆమె భుజంమీద చెయ్యి వేశాను.

ఆమె ఏమీ మాట్లాడలేదు.

"నీ పేరేమిటి ?" నే నామెను స్వంతంచేసుకున్నట్టు ఫీలవుతూ ఏకవచ నంతో అడిగాను.

"సత్యవతి."

"ఇంతరాత్రి అక్కడ నిలబడ్డావేం ?"

"పబ్లిక్‌గార్డెన్ నుంచి వస్తున్నాను."

అక్కడి కెందు కెళ్ళావని నే నడగలేదు.

ఆమే మళ్ళీ చెప్పింది.

"ఓ స్టూడెంటు రమ్మన్నాడు. వెళ్ళాను. అయిదురూపాయలు చేతిలోపెట్టి ముగ్గురు వెధవలు పంచుకోబోయారు. ఇంతలో వాచ్‌మన్ వచ్చాడు. వాళ్ళు కోతి పారిపోయారు. నేను దొరికిపోయాను. లక్ష ప్రశ్నలు వేసి పోలీసుల కప్ప చెప్పతానని బెదిరించి అయిదూ లాక్కున్నాడు."

ఆమెను దగ్గరగా తీసుకున్నాను.

చలికి ఒదిగిపోయి కూర్చుంది.

బుగ్గమీద ముద్దెట్టుకున్నాను.

"తాగారా ?" అని అడిగింది.

"ఊఁ !" అన్నాను.

"రోజూ తాగుతారా ?"

"లేదు- ఎప్పుడైనా."

పెదాలు అందుకోబోయాను.

"ఇంటి కెడుతున్నాంగా- ఇంగారెందుకు ?" అంది.

ఆమెను వదిలేసి దూరంగా జరిగాను.

ఇంటి కెళ్ళాక లైటు వెలుతురులోగాని చూడలేదు- ఆమె ముఖం పీక్కుపోయింది. కళ్ళు లోతుకుపోయాయి. జుట్టంతా చెదిరిపోయింది. చీర మాసిపోయి అక్కడక్కడ చిరిగింది. భుజంమీద పిగిలిపోయిన జాకెట్టు చీర కొంగుతో కప్పుకుంది.

ఏమైనా సత్యవతి అందంగానే ఉంది.

పోషణలేని గొప్పింటి బిడ్డలా ఉంది.

"స్నానం చెయ్యాలి.... నీళ్ళున్నాయా ?" అని అడిగింది.

బాత్‌రూమ్‌లో చన్నీళ్ళున్నా యన్నాను.

ఫరావాలేదంది.

సుమిత్రవి చీర, జాకెట్టు తీసి ఇచ్చాను

అనుమానంగా చూసిం దామె.

"ఫరవాలేదు, తీసుకో" అన్నాను.

ఆమె బాత్‌రూమ్‌లో కెళ్ళాక వీధితలుపు తాళంపెట్టి దిల్‌షాద్ టాకీస్ దగ్గరి కెళ్ళి కిళ్ళీలు తీసుకుని పువ్వులు, సిగరెట్లు కొనుక్కున్నాను.

తిరిగి వచ్చేసరికి సత్యవతి తల దువ్వుకుంటూంది. తెల్లచీరలో పువ్వు లెట్టుకుని అభిసారికలా తయారయింది.

ఎదురుగా కుర్చీలో కూర్చుని, "మీ దే ఊరు ?" అనడిగాను.

"అవన్నీ తరువాత చెబుతాను కానీ- తినడాని కేమైనా ఉందా ?" అవి అడిగింది.

ఆ అడగడంలో సిగ్గు, అభిమానం, మొహమాటం, ఆకలి కలిసి మడత లుగా బయటికొచ్చాయనిపించింది నాకు.

"నువ్వు భోజనం చెయ్యలేదా ?" అనడిగాను.

"అన్నం తిని మూడు రోజులయ్యింది." నేలకేసి చూస్తూ అంది.

"మరిందాకటి నుంచీ చెప్పలేదేం ?"

"అయితే, ఏమీ లేదా ?" నిరాశగా, ఆత్రంగా అంది.

"పొద్దున వండిన అన్నం ఉంది- తింటావా ?" అనడిగాను.

"నిన్నటిదైనా ఫరవాలేదు."

ఆమె ముఖం చూస్తే చాలా బాధగా అనిపించింది నాకు.

ఆ కళ్ళలో ఆకలి సుళ్ళు తిరిగింది.

వంటింట్లోకి వెళ్ళి కుకర్ తీసి చూశాను.

అన్నం చాలా ఉంది. ఏ పూటకి కూడా ప్రొద్దున్నే వండుకున్నాను. కొంచెం కూర కూడా ఉంది.

అన్నం, పచ్చడి, మజ్జిగ, కూర డైనింగ్ టేబుల్ మీద పెట్టాను.

కృతజ్ఞతాపూర్వకంగా కళ్ళలోకి చూసిందామె.

ఆమె కెదురుగా కుర్చీలో కూర్చున్నాను.

తాను వడ్డించుకుంటూ అంది:

"మీరు తినరా ?"

"వద్దు- బార్‌లో పకోటా ఆమ్లెట్ తిన్నాను. ఆకలి లేదు."

"నాకు మాత్రం చాలా ఆకలిగా ఉంది సుమా !" తన కోర్కెను తాను సమర్థించుకునే ప్రయత్నంలా కనిపించింది.

కంచంలో పదార్థాలన్నింటినీ ఇరవై లంఖణాలవాడు భోజనానికి కూర్చునేముందు చూసినట్లు చూసింది.

బద్దలైన అగ్నిపర్వతంలాగ, రగులుతున్న విప్లవంలాగ ఉంది ఆమె ఆకలి.

మళ్ళీ నెలదాక భోజనం దొరకదన్నట్లు ఆమె తినడం ప్రారంభించింది.

నేను కళ్ళార్పకుండా చూస్తూ కూర్చున్నాను.

మధ్య మధ్య ఆమె కూడా నాకేసి చూస్తూంది.

ఆ చూపులో యుగయుగాలుగా మనుష్యులందరూ ఉమ్మడిగా అనుభవించిన దైన్యం కనిపిస్తూంది. ఆమె కళ్ళలో నీళ్ళు నిండాయి. అవి ప్రపంచంలో బాధితులు, పీడితులు అంతా కలసి కార్చిన కన్నీటిచుక్కల్లా కనుపించాయి.

మూడు రోజులు క్రితం కాదు, మూడు సంవత్సరాల నాడు ఆమె భోజనం చేసి ఉంటుందన్న అనుమానం వచ్చింది.

ఆమె . ఆశగా ఆబగా అసహ్యంగా అన్నం తింటూంది.

ఆకలి తీర్చుకుంటూంది.

ఆమెలో అంత ఆకలిని చూశాక నాలో ఆకలి పూర్తిగా చచ్చిపోయింది.

వెంటనే లేచి డ్రాయింగ్‌రూమ్‌లో కొచ్చేశాను.

సోఫాలో కూర్చుండిపోయాను.

ఆమె వంటిల్లంతా సర్దేసి, తలుపేసి, చేతులు కొంగుతో తుడుచుకుంటూ వచ్చి సోఫాలో నా పక్కన కూర్చుంది.

"హమ్మయ్య హాయిగా అన్నం తిన్నాను. రాత్రంతా ఇక మీదాన్నే" అంది దగ్గరగా జరుగుతూ.

చటుక్కున లేచి నిలబడ్డాను.

జేబులో ఉన్న పాతిక రూపాయలు ఆమె కందిస్తూ, "నువ్వీ సోఫాలో పడుకో. ఈ డబ్బు నీ దగ్గర ఉంచుకో. తెల్లారి నేను లేచేసరికి ఇక్కణ్ణుంచి వెళ్ళిపో. దయఉంచి మళ్ళీ నా కక్కనబడకు" అని ఆవేశంగా అన్నాను.

ఊహించని ఈ పరిణామానికి ఆమె ఆశ్చర్యపోయింది. తెల్లబోయింది.

ఆమె మాట్లాడబోయింది.

నేనామెకా అవకాశం ఇవ్వకుండా బెడ్‌రూమ్‌లోకి వెళ్ళిపోయాను.

తలుపేసుకున్నాను.

మంచంమీద పడుకున్నాను.

మనస్సు తేలికపడిన ట్లనిపించింది.

మానవునికి ప్రాకృతికమైన కోరిక ఒక్కటే- ఆకలి.

అది ఘోరమైనది, భయంకరమైనది, బాధాకరమైనది.

మిగతా కోర్కెలన్నీ మానసికమైనవి.

అంతకన్న ఎక్కువ ఆలోచించలేకపోయాను.

నాకు చలి తగ్గినట్టనిపించింది.

వెంటనే నిద్ర పట్టేసింది. □




రాత్రి పన్నెండు గంటలు కావస్తుంది.

రమేష్ చదువుతున్న మెడికల్ జర్నల్ మూసి టేబుల్ మీదుంచి, పడుకొనేందుకు లేవబోతున్నంతలో ఎవరో తలుపు తడుతున్న చప్పుడవటంతో బయటకు నడిచాడు.

1981 చక్రపాణి ప్రథమ అవార్డు పొందిన కథ

తలుపు తీయగానే ఎదురుగా కళా కాంతులులేని ముఖంతో సీతాపతిగారు.

ఆయన రావటం మొదటిసారి కాదు గనుక ఎందుకని ప్రశ్నించే అవసరం లేకపోయింది. అవతల రోగి పరిస్థితిని ఆయన ముఖంలోనే చదవగలిగాడు. తనెందుకు వచ్చాడో రమేష్ గ్రహించ గలడు కనుక ఆయనా చెప్పే ప్రయత్నం చెయ్యలేదు.

"మాస్టారూ ! ఒక్క నిమిషం ...." అంటూనే లోపలకు వెళ్ళి బట్టలుమార్చు కొని మెడికల్ కిట్ తో బయటకు వచ్చాడు.

ఇద్దరూ రోడ్డుమీద కొచ్చారు. సీతా పతిగారుండేది ప్రక్కవీధిలోనే గనుక కొద్ది నిమిషాల్లోనే అక్కడికి చేరుకొ న్నారు. ఆ కొద్దినిమిషాల కాలం ఎంతో పేపులా అనిపించింది ఆయనకు.

వాకిట్లో నిలబడి ఆదుర్దాగా ఎదురు చూస్తున్న వసంత వాళ్ళిద్దర్నీ చూసి ధైర్యం కూడదీసుకొంటూ లోపలకు తప్పుకొంది. చిరపరిచితమయిన ఇల్లు గనుక రమేష్ ముందుగా గదిలోకి అడుగు పెట్టాడు.

ఆయాసంలో ఊపిరందక మెలికలు తిరుగుతూ అవస్థపడుతున్న భార్యను చూస్తుంటే సీతాపతిగారి కళ్ళలో నీళ్ళు నిలిచాయి. 'భగవంతుడా ! దేవతలాంటి సరస్వతికి ఇంతటి శిక్ష ఎందుకు విధిం చావ్ ?' అనుకొంటూ పైపంచతో కళ్ళద్దుకొన్నారు.

రమేష్ వెంటనే పరీక్షించి రెండు ఇంజక్షన్స్ ఇచ్చాడు. సరస్వతి పడుతున్న బాధ గుండెల్ని పిండుతుంటే మౌనంగా చూస్తుండిపోయారు సీతాపతిగారు, వసంత. ఆ నిశ్శబ్దంలో ఆవిడ మూలుగు దుర్భరంగా వినిపిస్తుంది.

కొద్ది నిమిషాలకు సరస్వతి కొస్త తేరుకొని కళ్ళువిప్పి చూసింది.

సీతాపతిగారు మంచం మీద కూర్చొంటూ, "ఎలావుంది సరస్వతీ ?" అడిగారు అనునయంగా.

ఆవిడేం సమాధానం చెప్పలేదు. కొద్దిక్షణాల తర్వాత పెదాలు విప్పి ఏదో మాట్లాడాలని ప్రయత్నించింది. అతి కష్టంమీద "కృ...ష్ణ...." అనగలిగింది.

సరస్వతి ఎవరి గురించి అడుగు తుందో గ్రహించిన సీతాపతిగారి హృదయం ముల్లుపోటు తగిలినట్లుగా కలుక్కుమంది. సమాధాం ఏంచెప్పాలో తోచక మౌనంగా వుండిపోయాడు.

భర్తనుండి ఏ సమాధానం రాక పోవటంతో సరస్వతి నిరాశగా కళ్ళు మూసుకొంది.

రమేష్ వరండాలోకి వెళ్ళి కుర్చీలో కూర్చొన్నాడు.

కొద్దిసేపటికి సరస్వతి అలాగే మగతలోకి జారిపోయింది. సీతాపతిగారు వరండాలోకి నడిచారు.

"రమేష్ ! పర్లేదంటావా ? అడిగా

రాయన పడకకుర్చీలో కూర్చొంటూ.

రమేష్ వెంటనే సమాధానం చెప్ప లేదు. "మాస్టారూ! మనోవ్యాధికి మందు లేదు. దానికి తోడు అమ్మగారి శారీరక స్థితి ప్రమాదంకేసి నడిపిస్తున్నట్లుంది. ఈరోజు మరీ ఎక్కువగా వున్నట్లుంది" చెప్పాడు.

ఎంతో కాలం ప్రేమానుభూతులను మధురంగా పంచి యిచ్చే దాంపత్యపు చివరిదశ ఒక విషాదపు వీడ్కోలు. దేవతా స్వరూపిణిలా సుఖసంతోషాలను పంచియిచ్చిన భార్యను రక్షించుకోలేని అశక్తతకు ఆయన హృదయం తల్లడిల్లిపోతుంది,

"రమేష్! జీవం పోసి జన్మనిచ్చిన భూమినే వృక్షంలా ఎదిగి నిలదొక్కుకొనేందుకు వేళ్ళతో చీల్చుతుంది మొక్క. మానవ నైజం కూడా అలాగే మారుతుంది కదూ?" అంటుంటే ఆయన కంఠం వణికింది.

"మాస్టారూ!" ఆశ్చర్యంగా చూశాడు రమేష్. ఆయన మాటలు ఎవర్ని ఉద్దేశించో వెంటనే స్ఫురించలేదు, కాని ఊహించేందుకు ఎక్కువసేపు పట్టలేదు.

"కృష్ణకు టెలిగ్రాం ఇచ్చి వారం రోజులవుతుందా మాస్టారూ?

"అవుతుంది. కనీసం ఏ సమాధానం రాలేదు అంత బాధలోను సరస్వతి వాడి కోసం పడే ఆరాటం వేలాది మైళ్ళ దూరంలో వున్న వాడికి ఎలా తెలుస్తుం దంటావు!" వెనక్కు చేరగిలబడి బాధగా కళ్ళుమూసుకొన్నారు.

ఆయన పడుతున్న ఆవేదన రమేష్ హృదయాన్ని కదిలించింది. "బాధపడకండి మాస్టారూ! కృష్ణ త్వరలో తప్పక వస్తాడు." ఆయనకు ధైర్యం చెప్పాలన్న ఉద్దేశంతో అన్నాడే కాని నిజంగా నమ్మకంలేదు

ఆ మాటలు విన్నా విననట్లే మౌనంగా వుండిపోయారు సీతాపతి.

"బాబూ రమేష్! ఇప్పటికే చాలా పొద్దుపోయింది. ఇక నీవు వెళ్ళండమ్మా." అన్నారు కళ్ళువిప్పి.

"ఫర్వాలేదండీ! కొద్దిసేపు చూసి మరో ఇంజక్షన్ ఇచ్చి వెళ్తాను." చెప్పాడు.

"క్షమించు బాబూ! నీకు చాలా శ్రమ ఇస్తున్నాను." అన్నారు కృతజ్ఞతగా.

"మాస్టారూ! పెద్దవారు మీ రలా అనకండి. ఇది నా వృత్తిధర్మం అంతే కాదు మీ విషయంలో నా బాధ్యత. 'ఏ సమాజంలోనయితే వ్యక్తులు తమ జీవితాలను సంఘపరంగా తీర్చిదిద్దుకోగలుగుతారో అదే చైతన్యవంత మయినది. ఎక్కడ స్వపరంగా మలుస్తారో అది జడమైనది, అని మీరన్న మాటలే నా జీవితానికి ఒక లక్ష్యాన్ని బోధించాయి. అన్నాడు పూజ్యభావంతో.

అంత బాధలోనూ సీతాపతిగారికి ఆ మాటలు ఎంతో ఉపశమనం కలిగించాయి.

అంతలోనే విచారం కూడా కలిగింది.

తన కొడుకు కృష్ణ, రమేష్ ఇద్దరూ తన విద్యార్థులే. కృష్ణ జీవితం ఆశయాలతో ప్రభావితం కావాలని ఆశించిన దానికి భిన్నంగా జరిగినా, కేవలం శిష్యుడైన రమేష్ మాత్రం తన ఆశయాలను ప్రతిబింబించుకొన్న అద్దంలాంటి వాడు.

ఒకే పరిసరాలలో పెరిగిన ఇద్దరు వ్యక్తులు భిన్నంగా ప్రభావితం కావటానికి కారణం ఆయా వ్యక్తుల ఆలోచనా విధానంలో వున్న భేదమే. ఆ భేదమే ఇద్దరి మార్గాలను వేరువేసింది.

రమేష్ కలవారి బిడ్డ కాదు. కేవలం స్వయంప్రతిభతో కష్టపడి డాక్టరైనంతనే డిస్పెన్సరీ పెట్టుకున్నాడు. కొద్దికాలం లోనే మంచిపేరున్న డాక్టరుగా పేదప్రజల అభిమానపాత్రుడయ్యాడు. డబ్బున్న వాళ్ళను [illegible] ఆకర్షింపజేసుకొని, ప్రావీణ్యంతో లక్షలు సంపాదించాలన్న ఆరాటం, వ్యామోహం అతనికి ఏనాడూ లేదు.

అతన్ని తమ అల్లుడిగా చేసుకోవాలని ఎందరో లక్షాధికారులు పోటీపడ్డారు. విదేశాలకు పంపిస్తామని ఆశలు చూపారు. కాని రమేష్ వ్యతిరేకించాడు. వచ్చిన అవకాశాలను అవివేకంతో జారవిడుచుకొంటున్నాడని అతని తండ్రి తనదగ్గర ఎన్నోసార్లు బాధపడ్డాడు.

తనోసారి ఆ సంగతి ప్రస్తావిస్తే “మాస్టారూ, డాక్టర్ వృత్తిని సేవా ధర్మంగా స్వీకరించాను. నాకున్న కొద్దిపాటి ప్రతిభను నా దేశానికి, ప్రజలకు నిస్వార్థంగా అర్పించగలిగితే, తమ వాడిగా ఇక్కడివారిచ్చే గౌరవస్థానం నాకెంతో తృప్తినిస్తుంది. కేవలం డబ్బు సంపాదించటం కోసమే వచ్చిన పరాయి దేశస్థుడిగా అక్కడ చూడబడుతూ, నా వృత్తిని పెట్టుబడిగా వేసుకోవటం నా కిష్టంలేదు.” అన్న రమేష్ ఆదర్శానికి ముగ్ధుడయ్యాడు. చైతన్యవంతమైన ఒక యువతరపు ప్రతినిధి అతనిలో కనుపించాడు.

తనకు నచ్చిన ఒక సాధారణ యువతిని నిరాడంబరంగా వివాహం చేసుకొన్నాడు. మొదట్లో తల్లిదండ్రులు నిరసించినా, ప్రేమాభిమానాలకు అలవాలమై, అత్తమామలను పసిబిడ్డల్లా చూసుకొనే కోడలి వ్యక్తిత్వానికి ముగ్ధులై మనవలతో చరమ జీవితాన్ని హాయిగా గడుపుతున్నారు.

అంత అదృష్టం అందరికీ వుండొద్దూ!

తాము పోషించి, పెంచి పెద్దజేసిన వారి నీడలో జీవితపు చివరి రోజులు ప్రశాంతంగా గడిచిపోవాలనే ప్రతిఫలం ఒక్కటే బిడ్డల్నుండి ఆశిస్తారు కన్న వాళ్ళు - అది దక్కనినాడు జీవితం ఎంత బాధాకరం ?

జీవితపు చివరిదశలో బిడ్డకోసం అలమటిస్తున్న తల్లి హృదయఘోష విని

మా ఊళ్లో బస్సులు :




పించనంత దూరంలో కృష్ణ వున్నాడు. వాడికి బాంధవ్యాలు అర్థంలేని సెంటిమెంట్స్. డాక్టరు గనుక వాడి దృష్టిలో తల్లి, గతించబోతున్న ఒక జీవి మాత్రమే!

"మాస్టారూ, వస్తాను" రమేష్ పిలుపుకు ఉలిక్కిపడ్డారాయన. ఆలోచనలతో రమేష్ లోనికి వెళ్ళి ఇంజక్షన్ ఇచ్చి రావటం కూడా గమనించలేదు.

"ఇంజక్షన్ ఇచ్చాను. ప్రస్తుతం పర్వాలేదు. అవసరమైతే వెంటనే రండి మాస్టారూ!" ముందుకు కదిలాడు.

"అలాగే! వెళ్ళిరా బాబూ!" అన్నారు లేచి కళ్ళొత్తుకొంటూ.

రమేష్ వెళ్ళిపోయాడు.

అతను కనుమరుగవగానే లోపలికి వెళ్ళారు. మంచం ప్రక్కనే చతికిలబడి కునికిపాట్లు పడుతున్న వసంతకేసి జాలిగా, వాత్సల్యంగా చూస్తుండిపోయారు.

సరస్వతి మంచాన పడిందని తెలిసి ఉద్యోగానికి సెలవు పెట్టి, పిల్లలిద్దర్నీ అత్తగారికి అప్పజెప్పి రెక్కలు కట్టుకు వాలింది. ఈ ఇరవై రోజులు వసంతే గనుక లేకుంటే తనెంత ఇబ్బంది పడాల్సివచ్చేదో!

జీవితం ఎంత చిత్రం! మనిషి ఆశించిన ప్రేమాభిమానాలు ఎదురుచూసిన వారినుండి లభించవు. అవి ఎదురుచూడని వారినుండి ఒకోసారి యాదృచ్ఛికంగా

వుట్టిత
పోయినా వసంత చూపే ప్రేమాభిమానాలు
కన్నకొడుక్కి లేకపోయాయి.

భారంగా నిట్టూర్చారాయన.

"అమ్మా! నువ్వు కాసేపు పడుకో
రాదూ! నేనుంటానిక్కడ!" అన్నారు
వాత్సల్యంగా.

వసంత కళ్ళువిప్పి చూసి, "ఫర్వాలేదు
మావయ్యా! మీరెళ్ళి విశ్రాంతి తీసు
కోండి. అవసరమైతే పిలుస్తాను" అంది.

తనెంతగా చెప్పినా వసంత అక్కడ్నుంచి కదలదని తెలుసాయనకు. సరస్వతిని కంటికి రెప్పలా కాచుకొంటూ, వేళకు తిండి, నిద్రా లేక చిక్కి సగమైన వసంతను చూస్తుంటే ఆయన మనసు బాధతో బరువెక్కింది.

"అమ్మా! వచ్చినదానివి వచ్చినట్లే వుండిపోయావు. అక్కడ వాళ్ళు ఏమనుకొంటారో?"

"అత్తయ్యకు స్వస్థత చిక్కేవరకు ఇక్కడ్నుండి కదలొద్దని చెప్పి పంపారు. వారమ్మగారున్నారు గనుక ఇబ్బందిలేదు. మొన్న ఆయన వచ్చినప్పుడు కూడా అదే చెప్పి వెళ్ళారు."

"ఈ ముసలివాళ్ళం నీ కెంత శ్రమ ఇస్తున్నాం తల్లీ!" ఆయన కంఠంలో కృతజ్ఞత ధ్వనించింది.

"అదేం మాట మావయ్యా! తల్లి లేని నన్ను పసితనం నుండి అత్తయ్య గుండెమీద పెంచింది. నాన్న వున్నా లేనట్టేగా. ఆయన స్వార్థమే కావచ్చు. అయినా నాడు పట్టించుకోలేదు. మీరే లేకుంటే నా బ్రతుకు ఏమై వుండేదో! అందుకు ఆజన్మాంతం మీకు సేవలు చేసినా ఆ ఋణం తీరదు. మీరు నన్ను కన్నబిడ్డలానే పెంచారు ... ఇప్పుడు పరాయిదానిలా భావించకండి." అంది కళ్ళొత్తుకొంటూ.

వసంత మాటలకు ఆయన గొంతు పెగల్లేదు.

ఎముకలగూడు మీద చర్మం కప్పినట్లున్న సరస్వతి భార్య శుష్కశరీరం కేసి చూసేకొద్దీ ఆయన మనసు వికలమౌతుంది. గాలికి టపటప కొట్టుకొంటున్న దీపానికి చేతు లడ్డుపెట్టినట్లుగా, మందులతో తాత్కాలికంగా ప్రాణాలు నిలుపుకొస్తున్నా, ఏ క్షణాల్లో విధి విసురుకు ఈ దీపం కొండెక్కుతుందోనన్న భయం ఆయనను వణికిస్తుంది.

భార్యకేసి చూస్తూ, ఆలోచనం తీవ్రతను తట్టుకోలేక మెల్లగా వరండాలో కొచ్చి కూర్చొన్నాడు. నిప్పుకణికల్లా మండుతున్న కళ్ళు మూసుకొని, మునివేళ్ళతో నలుపుకొంటూ ఆలోచనలో మునిగిపోయారు.

తనూ, సరస్వతి వసంతను కోడలిగా చేసుకోవాలని ఎంతో ఉబలాటపడ్డారు. బంగారు బొమ్మలా వుండే వసంతను ఆడిస్తూ, 'ఇది మన కృష్ణ పెళ్ళామండీ' అంటూ ఎన్నో సార్లు మురిసిపోయేది సరస్వతి.

వసంత తెలివితేటలు, వినయ విధేయతలు, నిర్మలమైన మనసు, స్వచ్ఛత తమను ముగ్ధుల్ని చేసేవి. కాబోయే తమ కోడలిగా ఊహించుకొంటుంటే ఇద్దరి మనసులు సంతోషంతో పొంగి పోయేవి

వాళ్ళిద్దరూ దంపతులు కావాలనే ఆలోచనలు, ఇద్దరూ ఎదిగే కొలది ఇంకా బలపడుతుండేవి.

"సరస్వతీ ! నీ కొడుకు డాక్టరను కొంటున్నావేమో ! వసంతను చేసుకోవటమనేది కేవలం వాడి అదృష్టమే !" ఆటలు పట్టించేవాడు తను.

"నా కొడుక్కే వంకి ! డాక్టరు పెళ్ళాం కావటంమాత్రం దీని అదృష్టంకాదూ !" ఉడుక్కొనేది సరస్వతి.

ఇలాంటి మాటలు వినబడ్డప్పుడు సిగ్గుతో ముఖం తిప్పించే వసంత మనసు కృష్ణపై ఇష్టతను చాటేది. వాడు ప్రతి క్లాసులో ఫస్ట్ వస్తున్నప్పుడు, డాక్టరు సీటు వచ్చినప్పుడు, వసంత ముఖంలో కనిపించిన వెలుగు ఈ నాటికి గుర్తే.

తన చదువుకన్నా బావ చదువే ముఖ్యమనుకొనేది. "మావయ్యా ! ఇంతవరకు చదివించారు, చాలు. నేను డిగ్రీ చదవాలనుకోవటం లేదు" అంది డిగ్రీలో చేరకముందు

"ఏమ్మా ! లక్షణంగా చదువొస్తుంటే ఆపేస్తాననటావేం . నాకు భారం అని ఆలోచిస్తున్నావా !"

"డాక్టర్ చదువంటే చాలా ఖర్చు గదా ! నా గురించి ఇబ్బందిపడటం దేనికి మావయ్యా ! నా కీ మాత్రం చదువు చాలు."

వసంత అంతర్యం బోధపడింది. "వసంతా నువ్వెందుకలా అంటున్నావో తెలుసమ్మా. నాకిద్దరు బిడ్డలయితే ఒకర్ని మానిపిస్తానా ? నువ్వూ అంతే. తప్పక చదవాల్సిందే" తనెంతో పట్టుబడితే కాదనలేక డిగ్రీలో చేరింది.

ముందు ముందు కృష్ణకు వసంతంటే అభిమానంవున్నట్లే అనిపించినా, మూడో సంవత్సరంలో అడుగుపెట్టి నప్పట్నుండి దూరంగా పట్టీపట్టనట్లు మెలుగుతుంటే. చదువుమీద చూపిస్తున్న శ్రద్ధ అనుకొన్నారు.

హౌస్ సర్జన్ పూర్తవగానే కాని వాడు కావాలనే వసంతకు దూరమయ్యాడని తెలిసిరాలేదు.. తనలో కలలు పండించుకోవటం కోసం అందరి గుండెల్లో మంటలు రేపుతాడని ఏనాడూ అనుకోలేదు.. జరగాల్సింది జరిగి పోయింది.

"పంతులుగారూ ! మీ కృష్ణను అల్లుడిగా నేను చేసుకోవాలనుకొంటున్నాను. మీకేం అభ్యంతరం లేదనుకొంటాను." సౌజన్యరావుగారు స్వయంగా వచ్చి అడిగితే ఆశ్చర్యపోయాను, ఆయన ఈ పట్టణంలో పెద్ద ధనవంతుడు.

క్షమించండి. చిన్నప్పట్నుండి మేన కోడల్నే కృష్ణకు చేసుకోవాలను కొంటున్నాం." తన ఉద్దేశం చెప్పారు.

"బహుశ అది మీ కోరిక అయివుం టుంది. కాని మా హేమ, మీ కృష్ణ తాముగా ఇష్టపడి పెళ్ళి చేసుకోవాలను కొంటున్నప్పుడు, పెద్దలుగా అక్షింతలు వేయటం మన బాధ్యత. ఆలోచించి చెప్పండి." ఆయన మాటలు ఎంతో కాలంగా పెంచుకొన్న ఆశలను కూలదోశాయి.

ఇది తెలిసి సరస్వతి కుమిలిపోయింది.

"కష్టా! పెళ్ళంటే తెలీని పసితనం నుండి పసందితో ఆశలు పెంచాం. ఇప్పుడు కాదని దూరం చెయ్యటం అన్యాయం అవుతుంది. బాగా ఆలోచించి చెప్పు." అడిగాడు కృష్ణను.

"నాన్నగారూ! నేనుగా అందుకు బాధ్యుణ్ని కాను. నా జీవితం మీద నాకు ఆశలు, కోరికలూ వున్నాయి. పెళ్ళనేది నా భవిష్యత్తుకు పునాదివంటిది. మీ మాట కాదంటున్నందుకు క్షమించండి." సౌజన్యరావుగారి అల్లుడు కావాలను కోవటంతో నాడి ఆలోచన వ్యర్థమై, మరేం మాట్లాడలేకపోయాడు. ఒకరి ఇష్టాలను తనేం కాదనలేడు. కృష్ణ కోరికగా [illegible] జరిపించ [illegible]

"వసంతా! [illegible] విషయంలో స్ఫూర్తి తప్పు మాదేనమ్మా! పెద్దల ముచ్చట్లు ఎదగని పిల్లల మనసు మీద ఎలాంటి ముద్రలువేస్తాయో గ్రహించక, అందుకు వ్యతిరేకంగా జరిగేప్పుడు కేవలం ప్రేక్షకుల్లా మిగిలిపోవాల్సిన పరిస్థితికి నిన్ను క్షమాపణ వేడుకొంటున్నాం." తనెంతో బాధగా అన్నాడు.

"అంతగా బాధపడ్తారేం మావయ్యా! నా కిలాంటి జీవితమే లభించాలన్న ఆశ లతో నే నెపుడూ కలలు గనలేదు. ఎదిగే కొలదీ, నా కెలాంటిది లభించినా స్వీకరించి సంతోషమయం చేసుకోవటానికి సిద్ధపడ టమే ఉన్నత మార్గంగా భావించాను." వసంత ఒక గొప్ప సత్యాన్ని చెప్పినట్లని పించింది. ఆశించకపోతుండా, లభించిన ఏ కొద్దిపాటిదైనా ధైర్యంగా స్వీకరించే ఔన్నత్యం ఎందరి కుంటుంది?

పెళ్ళికి ముందు, "బంధువులుగారూ! అమ్మాయి చదువుకోసం మీరెంతో ఖర్చు పెట్టివుంటారు. అందుకు కాస్తో, కూస్తో అప్పు అయివుండొచ్చు. మీకు కావల్సినంత అడిగి తీసుకోండి." సౌజన్యరావు గారి మాటలకు పెళ్ళిన చెంపమీద చరిచినట్లయింది.

"రావుగారూ! బిడ్డల్ని పెంచి పెద్ద జేసి, యోగ్యులుగా తీర్చిదిద్దటంలో వ్యాపారాత్మక దృష్టి వుంటుందని మీరు భావిస్తున్నందుకు విచారిస్తున్నాను. అది మా బాధ్యతగానే భావించాను. రిటైర్ కాగనే నేను తీర్చుకోగలను." తిరస్కా-

రించాడు తను.

పెళ్ళి చాలా ఆడంబరంగా జరిపించారు రావుగారు. తెలిసినవాళ్ళంతా, కృష్ణను, తమను అదృష్టవంతులంటూ అభినందించారు. క్రొత్త దంపతులను మనసారా దీవిస్తూ తామూ అక్షింతలు వేశారు.

కృష్ణపెళ్ళి తాము ఆశించిన విధంగా జరగలేదన్న బాధను సరస్వతి, తానూ దిగమ్రింగినా, వసంతను గూర్చిన ఆలోచనలే మనసును బాధించేవి. బి.యిడి. ట్రయినింగ్‌లో వసంత క్లాస్‌మేట్ రమాపతి స్వయంగా వచ్చి, కోరి వసంతను వివాహం చేసుకోవటం ఎంతో సంతోషం కలిగించింది.

వజ్రం విలువను గుర్తించటం కొందరికే తెలుసు.

"మావయ్యా! ఓసారి లోపలకు రండి. అత్తయ్య పిలుస్తుంది." వసంత మాటలకు ఆలోచనలు చెదిరి ఆదుర్దాగా లోపలకు నడిచారు.

మంచంమీద ప్రక్కనేగా కూర్చొని, భార్య చేతుల్ని ఒడిలోకి తీసుకొని, "సరస్వతి!.... సరస్వతి!" ప్రేమగా పిలిచారు.

సరస్వతి మెల్లగా కళ్ళువిప్పి భర్తకేసి నిశ్చలంగా చూస్తుండిపోయింది. ఆమె కళ్ళనుండి నీళ్ళు జారుతున్నాయి.

"ఏంకావాలి సరస్వతీ." [illegible]గా అడిగారు.

"ఏమండీ! కృ.... ష్ణ.... రాలేదు కదూ!" జీరగా పలికింది గొంతు.

ఆ మాటలు సీతాపతిగారి మనసును పిండినట్లయింది. ఏమని సమాధానం చెప్పాలో తోచలేదు.

"అసలు వ...స్తాడా!" ఆవిడ మాటల్లో నిరాశ ధ్వనించింది.

"వస్తాడు.... తప్పకుండా వాడు వస్తాడు." ఆయన కంఠం వణికింది.

"మీరు అసలు... ఉత్తరం... రాశారా?"

"రాశాను సరస్వతీ!"

"మరింకా రాలేదేం?.... ఇంకా... [illegible]ంటుందా?"

"[illegible] [illegible] [illegible] [illegible] ఆరోగ్యం [illegible] [illegible] [illegible] [illegible] [illegible] [illegible] సంతృప్తి [illegible] [illegible] [illegible] [illegible]ంది.

[illegible] [illegible] [illegible] [illegible] చెప్పటం ఆయన [illegible] [illegible] [illegible] [illegible] [illegible] [illegible] రికే [illegible] [illegible]

"మీరు ఉత్తరం... [illegible] [illegible] [illegible] [illegible] [illegible] [illegible] [illegible]"

[illegible]

అధైర్యపడకు." బాధను అణచుకొంటూ అన్నారు.

ఆమె పెదాలు చిత్రంగా విచ్చుకొన్నాయి. దానర్థం గ్రహించిన సీతాపతిగారి మనసు విలవిలలాడింది. ఒక నిమిషం బాధగా కళ్ళుమూసుకొందామె. అంతర్గతంగా ఆమె అనుభవిస్తున్న బాధకు ఆయన హృదయంలో అగ్నిపర్వతాలు బ్రద్దలవుతున్నాయి. సరస్వతి తిరిగి బలవంతంగా కళ్ళువిప్పింది. పొడారిన పెదాలు నాలుకతో తడిచేసుకోవటం గమనించి వసంతను కాస్త పాలు తెమ్మన్నారు.

స్పూనుతో పట్టి నోట్లో పోశారు. అతి కష్టంమీద ఒక్క గుక్క మింగగలిగింది. రెండో గుక్క వేయలేకపోవటంతో ప్రక్కకు జారిపోయాయి. తిరిగి పట్టబోతుంటే వద్దన్నట్లు చేత్తో నెట్టివేసింది.

"ఏం సరస్వతీ, నాల్రోజులనుండీ గుక్కెడు పాలయినా తాగటంలేదు." ఆయన ప్రాధేయపూర్వకంగా అడిగినా వద్దని తలూపింది. ఆయన చేతుల్ని గుండెమీదకు తీసుకొని తదేకంగా చూస్తుండిపోయింది.

ఆ చూపుల ద్వారా జీవిత గతస్మృతులు ఆయనలో ప్రవాహంలా లీనం అవుతుంటే సీతాపతిగారికి కన్నీరాగటం లేదు. వసంత మూగగా రోదిస్తుంది.

"ప్రాణం పోయే....లోగా....ఒక్క సారి....వాడ్ని....చూడా...ల...నుంది." ఆయన కళ్ళనుండి నీళ్ళుజారాయి. దుఃఖంతో గొంతు పెగల్లేదు.

"కృ...ష్ణా!...నాకోసం రావూ?" వేలాది మైళ్ళదూరంలో వున్న కొడుక్కి వినిపించాలన్నట్లుగా కలవరిస్తూ మగతలోకి జారిపోయింది.

సీతాపతిగారు వెర్రిగా చూస్తుండిపోయారు.

"మావయ్యా! ఎందుకైనా మంచిది, మరోసారి టెలిగ్రాం ఇవ్వండి." అంది వసంత కళ్ళొత్తుకుంటూ.

సీతాపతిగారు సమాధానం చెప్పకుండా లేచి వరండాలోకి నడిచి, పడకకుర్చీలో నిస్సత్తువగా వాలిపోయారు.

తొమ్మిది నెలలు మోసి, కని, పెంచి పెద్దజేసి, జీవితాని కోమార్గం చూపినందుకు బిడ్డనుండి చివరి క్షణాల్లో సరస్వతి ఆశించేది, కృతజ్ఞతగా ప్రేమపూరితమైన కడసారి చూపు మాత్రమే.

ఆ మాత్రపు కనీస కోర్కె దక్కించుకోవటానికి తల్లిగా సరస్వతి పడే వేదన కృష్ణకు ఎలా అర్థం అవుతుంది? వాడి ఆశలు, కోరికలు వేరు. అవి తీర్చుకోనేందుకు ప్రలోభంతో మాతృభూమినే వదిలిపెట్టిన వాడికి మాతృమూర్తి హృదయం ఎలా బోధపడుతుంది?

కృష్ణ భవిష్యత్తును తీర్చిదిద్దేందుకు, తనతో సమంగా కష్టాలను సంతోషంగా పంచుకొని వాడికి కష్టమంటే ఏమిటో

తెలీకుండా పెంచింది. కొడుకు డాక్టరు కాబోతున్నాడని అంతులేని సంతోషంతో పొంగిపోయింది. అంత ఖర్చు భరించగలమా అని తను అధైర్యపడుతుంటే, అవసరమయితే ఓపూట పస్తులుందామంటూ ధైర్యం చెప్పింది. వాడి అవసరాలకోసం అర్థాకలితో కష్టంగా రోజులు గడిపారు.

కోరుకొన్న విధంగా అన్నీ సాధించుకొన్నాడు. వాడి ఇష్టాలకు వ్యతిరేకంగా ఏనాడూ చెప్పలేదు. బాధను గుండెల్లోనే అణుచుకొని మనసును సరిపెట్టుకొన్నారు.

పెళ్ళయిన తర్వాత వెంటనే యమ్. యస్. చదవడానికి వెళ్ళాడు. అప్పుడప్పుడు సెలవలకొచ్చి మావగారింట్లోనే వుండి, వచ్చి పలకరించి పోయేవాడు. చదివే రోజుల్లోనే పండంటి మనవడు పుట్టాడు.

చదువు పూర్తయి తిరిగి రాగానే మావగారి సహాయంతో డిస్పెన్సరీ పెట్టాడు. అప్పుడూ వాళ్ళింట్లోనే వుంటూ అప్పుడప్పుడు వచ్చి కొద్దిసేపుండి వెళ్ళిపోతుండేవాళ్ళు. కోడలు హేమ పట్టీ పట్టనట్లుండేది.

ఆ స్థానంలో లేని వసంతను తల్చుకొన్నప్పుడల్లా మనసు చివుక్కుమనేది. హేమ తమ కోడలయినా ఏదో అంతస్థుల దూరం. కృష్ణ ఇంకా మావగారింట్లో వుండిపోవటం సరస్వతికి బాధ కలిగించింది.

"కృష్ణా! ఇల్లరికం అల్లుడిలా ఎప్పుడూ అక్కడే వుంటావేంరా? నలుగురూ ఏమనుకొంటారు? ఇక్కడే వచ్చి వుండకూడదూ!" ఓసారి సరస్వతంటే సమాధానం చెప్పలేదు.

కృష్ణ పరాయివాడిలా వుంటున్నాడన్న బాధ సరస్వతిలో కనిపిస్తున్నా, ఏనాడూ తప్పుగా ఒక్క మాట అనకుండా మౌనంగా బాధను మనసులోనే అణచుకొనేది.

కొడుకూ, కోడలు తన కళ్ళెదుటే వుండాలని, మనవడి ముచ్చట్లతో జీవితం సంతోషంగా గడిచిపోవాలని, కోరుకొన్న సరస్వతికి అవి దక్కలేదు. ఉన్నది ఒకే ఊళ్ళో అయినా పరాయిచోట వున్నట్లుగా వారం, పదిరోజుల కోసారి వచ్చి కొద్దిసేపుండి పోయేవాళ్ళు.

ఆ కొద్దిసేపు సరస్వతి ఎంతో సంతోషంగా గడిపేది. మనవడికి అర్థం కాకున్నా ఎన్నో కబుర్లు చెప్పేది. క్షణం దించకుండా ఆటలాడించేది. వాళ్ళు వెళ్ళిపోతుంటే తన ప్రాణం తీసుకెళ్తున్నట్లు విలవిలలాడేది. వచ్చి వెళ్ళిన రెండు రోజులు దిగాలుగా వుండేది. ఆ తర్వాత బాధను దిగమింగి వాళ్ళకోసం రోజూ కళ్ళల్లో వత్తులేసుకొని ఎదురు చూసేది.

"కృష్ణా! రోజుకోసారయినా నువ్వు కనిపించకుంటే ఏదో దిగులుగా

వుంటుంది. తీరిక చేసుకొని రోజూ కాసేపు వస్తుండరా." ఓరోజు ఒంటరిగా వస్తే కృష్ణను అడిగింది.

"అమ్మా! నాది అందరి ఉద్యోగాల్లాంటిది కాదు. రోజూ వచ్చే తీరుబాటు చిక్కదు."

"పోనీ కోడల్ని కూడా తీసుకొచ్చి మనింట్లోనే వుండకూడదూ; నీకిక్కడేం లోటు?"

"అమ్మా! హేమ మన స్వభావానికి, మన ఇంటి వాతావరణానికి సరిపడదమ్మా. చిన్నప్పట్నుండి హేమ పెరిగిన పరిసరాలు వేరు. తీసుకొచ్చినా ఇక్కడ వుండలేదు." కృష్ణ సమాధానానికి మళ్ళీ ఎన్నడూ ఆ ప్రస్తావన తేలేదు.

నిజమే! తమది కాకులు కట్టుకొనే ముళ్ళగూడు లాంటిది. వాళ్ళది పిచ్చుకలు కట్టుకొనే మెత్తని గూడు. ఆ గూటిలో ఉండే సౌఖ్యం తమ గూటిలో ఎలా లభిస్తుంది?

"నాన్నా! నేను అమెరికా వెళ్తున్నాను. రేపే ప్రయాణం." ఓరోజు వచ్చి హఠాత్తుగా చెప్పాడు. సరస్వతి ముఖంలో ఉలికిపాటు కనిపించింది.

"కృష్ణా! మంచి డాక్టరుగా ఇప్పుడిప్పుడే పేరు తెచ్చుకొంటున్నావు. నీ జీవితం స్థిరపడటానికి తగిన శక్తి సామర్థ్యాలు నీ కున్నాయి. అలాంటప్పుడు దేశంకాని దేశం వెళ్ళి అవస్థలు పడటం ఎందుకురా?" అన్నాడు తను.

"నాన్నగారూ! ఒక డాక్టరు ప్రతిభకు ఇక్కడ లభించే ప్రతిఫలం వేరు. అక్కడ లభించే ప్రతిఫలం వేరు. ఇక్కడ జీవితాంతం ధారపోసినా లభించని గుర్తింపు, ఉన్నత జీవితం లభించేందుకు అక్కడ కొద్దికాలం చాలు. ఎప్పటినుండో నేను కోరుకొంటున్న అవకాశం ఈనాడు లభించింది. వెళ్ళాలనే నిశ్చయించుకొన్నాను." తన ఉద్దేశం మారదన్న దృఢసంకల్పంతో అన్నాడు.

సర్వమానవ కళ్యాణానికి ఉద్దేశితమైన పరిశోధనలకు అవకాశాలను వెతుక్కొంటూ వెళ్ళటం అభినందనీయమే. కాని డాక్టర్లవుతున్న ఎందరో యువకులు లక్షలు సంపాదించాలన్న వ్యామోహంతో తనవాళ్ళను, దేశాన్ని వదిలి విదేశాలకు ఎగబడుతున్నారే గాని, తమ సేవలు ఈ దేశానికి ఎంత అవసరమో గుర్తించటంలేదు.

అక్కడ డాక్టరుగా తమకు లభించే ప్రతిఫలం ఎక్కువన్న ఆకర్షణకు లోనవుతున్నారే గాని, ఈ దేశంలో రోగాలకు అధికంగా డబ్బు వెచ్చించుకోలేని ఎందరు నిర్భాగ్యులు పేదరికంతో ప్రాణాలు కోల్పోతున్నారో ఆలోచించటంలేదు.

విదేశం వాళ్ళకు అందమైన స్వర్గం. ఆ వ్యామోహమే కృష్ణను విదేశాలకు




తరలిస్తుంది. తాను కాదని ప్రయోజనం ఏముంది?

"ఏమండీ! మనకు ఒక్కగా నొక్క కొడుకు. వాడ్ని చూడకుండా అంతకాలం నేను వుండలేనండి. ఎలాగైనా మీరు నచ్చ జెప్పండి. ఇక్కడ మాత్రం భార్యా, బిడ్డలతో హాయిగా బ్రతకలేడా? మనకు లక్షలు లేకుంటే మాత్రం సుఖంగా బ్రతకటం లేదా" ఆరోజు రాత్రంతా ఏడుస్తూనే వుంది సరస్వతి.

"సరస్వతీ కాలంతోపాటు విలువలు మారుతున్నాయి. [illegible] హంతో [illegible] తెంచుకొని [illegible] మనిషి అలవాటు [illegible] చెప్పినా వాడి ప్రయాణం ఆగదు. అప్పుడప్పుడు వచ్చి వెళ్తుంటాడులే" ఎంతగానో ఓదార్చాడు తను.

విమానాశ్రయంలో —

వీడ్కోలు ఇవ్వటానికి వచ్చిన బంధు, మిత్రుల మధ్య హడావుడిగా వున్న కృష్ణను, మళ్ళీ చూడగలనో లేదో అన్నట్లుగా క్షణంపాటు ఏమరుపాటు కాకుండా, తనివిదీరా చూసుకొంటూ, చాటుగా కన్నీళ్ళు పదే పదే అద్దుకొంటున్న సరస్వతిని చూస్తుంటే గుండె తరుక్కుపోతోంది.

"అమ్మా! [illegible] వెళ్ళొస్తాను. మీ ఆరోగ్యం జాగ్రత్త" అంటూ కృష్ణ దగ్గరగా [illegible] చేతులు పట్టుకొని —

"బాబూ! నీవక్కడ వున్నా ఎప్పుడూ కళ్ళల్లో మెదలుతుంటావు. తరచు ఉత్తరాలు రాస్తుండు. మళ్ళీ ఎప్పుడు చూస్తానో నిన్ను." ఏడ్చింది సరస్వతి.

"నా గురించేం దిగులుపెట్టుకోనకమ్మా! ఉత్తరాలు రాస్తుంటాను. హేమను తీసుకెళ్ళటానికి వచ్చే సంవత్సరం వస్తానుగా." అంటూ ముందుకు కదిలిపోయాడు.

కృష్ణ వెళ్ళిన మరునాటి నుండే సరస్వతి మంచం పట్టింది. తిరిగి కోలుకోవటానికి ఒక నెలరోజులు పట్టింది. ఆ తర్వాత ఎప్పుడూ పరధ్యానంగా, ఏదో పోగొట్టుకున్నదానిలా వుండేది.

"ఏమండీ! ఒక్కడూ అంతదూరంలో ఎలా వున్నాడో! వాడికన్నీ సక్రమంగా అమరుతున్నాయో లేదో!" అంటూ తలవనిరోజు లేదు. వాడినుండి వచ్చే ఉత్తరాల కోసం ఆత్రంగా ఎదురుచూసేది.

కృష్ణమీద బెంగతో మేకు తినకా, నిద్రపోక తరచు అనారోగ్యానికి గురవుతుంటే ఏంచేయాలో తోచక సతమతమయ్యేవారు.

ఓరోజు, "ఏమండీ! హేమ, పిల్లవాడు అమెరికా వెళ్ళేదాకా మనింట్లోనే వుంటారు, వెళ్ళి తీసుకురండి. వాళ్ళను చూసుకొంటుంటే నా మనసు కాస్త కుదుటపడుతుంది." ప్రాధేయపడింది సరస్వతి.

ఈ విధంగా నైనా కొంతకాలం సరస్వతి దిగులు పోతుందన్న ఆశతో వారింటికి వెళ్ళాడు. సౌజన్యరావుగారికి సరస్వతి పరిస్థితి వివరించి హేమను పంపించమని అడిగితే ఆయనేం అభ్యంతరం చెప్పలేదు. హేమను పిలిచి చెప్పారు.

"సారీ మావయ్యా! ఒంటరిగా వుండాలంటే అక్కడేం తోచదు. బాబుకు వేళకు అన్నీ అమరాలన్నా కష్టమే. అంతగా కావాలంటే అత్తయ్యను అప్పుడప్పుడు తీసుకురండి. నేను మాత్రం మీ దగ్గర ఎల్లకాలం వుండలేనుగా." మరో మాట మాట్లాడే అవకాశం ఇవ్వకుండా వెళ్ళిపోయింది.

తను నిరాశతో తిరిగొచ్చాడు. ఆశతో ఎదురొచ్చిన సరస్వతికి, హేమ ఆరోగ్యం అంతగా బావుండటం లేదంటూ అబద్ధం చెప్పాల్సి వచ్చింది.

ఆ తర్వాత కొద్ది నెలలకే హేమ పిల్లవాడితో అమెరికా భర్తదగ్గరికి వెళ్ళిపోయింది. ఇంతలోనే తను రావటం అనవసరపు ఖర్చని ఏర్పాట్లన్నీ చేసి ఇద్దర్నీ విమానం ఎక్కిస్తే తను అక్కడ రిసీవ్ చేసుకొంటానని ఉత్తరం రాస్తే, సౌజన్యరావుగారు అలానే చేశారు.

హేమను తీసికెళ్ళటానికి త్వరలోనే వస్తాడని ఆశతో ఎదురుచూస్తున్న సరస్వతి ఎంతో కుమిలిపోయింది. "ఇంతకాలం వాడు త్వరలో వస్తాడని

ఆశపడ్డాను. మళ్ళీ ఎంత కాలానికి వాడ్ని చూస్తానో !" ఏడుస్తుంటే వోదార్చాడు.

రెండేళ్ళు గడిచిపోయాయి.

కృష్ణ రాసే ఉత్తరకోసం, అందులో ప్రయాణం గురించిన ప్రస్తావన కోసం పిచ్చిదానిలా ఎదురుచూసే సరస్వతిని చూస్తుంటే జాలి, బాధ వేసేది.

అమ్మ చూడాలని ఆరాటపడ్తుందని, ఒక్కసారి వచ్చిపొమ్మని, తన మాటగా రాయమని ఎన్నోసార్లు కోరితే కనీసం అరడజను ఉత్తరాలకు గాని జవాబు రాలేదు.

"నాన్నా! మీరు మరీ సెంటిమెంటల్‌గా ఫీలవుతున్నారు. ఇక్కడ ప్రజల్లో అలాంటి సెంటిమెంట్స్ వుండవు. ఎవరికి వారుగా తమ జీవితాలను చాకచక్యంగా తీర్చి దిద్దుకొంటారు గనుకనే ఇక్కడ అంతగా అభివృద్ధి కనిపిస్తుంది. అంతా ఒకసారి రావాలంటే ఎంత ఖర్చో ఆలోచించండి. ఇప్పుడిప్పుడే నేను నిల దొక్కుకొంటున్నాను. ఇంకా కొన్నేళ్ళ పాటు వచ్చే అవకాశం ఉండదేమో! నాలుగువందల డాలర్లకు చెక్కు పంపుతున్నాను. మీకు కావల్సినవి తీసుకోండి" కృష్ణ రాసిన జవాబు.

వాడు రాసినట్లుగా చెప్పి సరస్వతిని బాధపెట్టడం ఇష్టంలేక మరోలా చెప్పి చెక్కు చేతిలో పెట్టాడు తను. వెర్రి దానిలా కాసేపు చూసుకొంది.

"ఇన్నేళ్ళనుండి వాడినుండి దీని కోసం మనం ఆరాటపడ్డామా? డబ్బు లోటు మనకేం వుందండీ! వాడు ఇబ్బందిపడతాడేమో తిరిగి పంపించండి." అంటూ చేతిలో పెట్టేసింది.

డబ్బు అవసరం తమకేం లేదని రాస్తూ, కృష్ణకు తిప్పి పంపేశాడు.

ఆతర్వాత గడిచిన నాలుగేళ్ళలోనూ సరస్వతి, కృష్ణను రమ్మని రాయమని అడగలేదు. తనూ రాయలేదు. కాని అంతర్గత వేదనకు సాక్ష్యం మాత్రం బాగా క్షీణించిన ఆరోగ్యమే.

ఆ వేదన ఇన్నేళ్ళుగా గూడుకట్టుకొంటూ ఒక్కసారి బ్రద్దలై ఆరోగ్యాన్ని పూర్తిగా దెబ్బతీసింది. పర్యవసానంగా, బిడ్డను కడసారి చూడాలన్న కోర్కెతో చావుబ్రతుకుల మధ్య కొట్టుమిట్టులాడుతుంది సరస్వతి.

అమ్మ ఆరోగ్యం ఏమాత్రం ఆశాజనకంగా లేదని, వచ్చిపొమ్మని ఈ నెల రోజుల్లో నాలుగు ఉత్తరాలు రాసినా ఫలితంలేక చివరకు వారంక్రితం టెలిగ్రాం ఇచ్చాడు . చావుబ్రతుకుల్లో వున్న తనను చూడటానికి తప్పక వస్తాడన్న ఆశతో ప్రాణాలు నిలుపుకొంటుంది.

భార్య, భర్త, బిడ్డలంటూ అవాజ్యమైన మమతానుబంధాలతో, మానసిక బాధ్యతలు నిలయంగా నిర్మితమైన ఈ దేశ సంస్కృతి, సంప్రదాయాలను తనలో

జన్మించుకొని పెరిగిన సరస్వతికి, అవన్నీ అర్థంలేని సెంటిమెంట్స్‌గా కొట్టి పారేస్తూ, పరదేశ నాగరికతకు వ్యామోహితుడై, తన వ్యవస్థనే తప్పుపడ్తున్న కృష్ణకు మధ్య అడకత్తెరలో పోక చెక్కలా నలిగిపోతూ తను ---

ప్రతి కొత్త తరం అమూల్యమైన వాటిని పాతతరం నుండి స్వీకరిస్తూ క్రొత్తవి సేకరించుకొంటూ, ఒక నవీన వ్యవస్థను పునర్నిమించుకోవాల్సిందే. అప్పుడే పటిష్టమైన ఒక భవిష్యత్ ప్రపంచం ఏర్పడుతుంది.

అయితే తరాలలో ప్రవేశిస్తున్న వ్యామోహాలు, ప్రలోభాలు, ఆకర్షణలు ఒక వ్యవస్థయొక్క ఉన్నతత్వాన్ని బహిష్కరించుకొంటూ తిరోగమిస్తున్నాయా?

ఆవేదనా పూరితమైన ఆలోచనలతో బడలికగా కొద్దిసేపు కళ్ళుమూసుకొన్నారు. వెంటనే మాగన్నుగా నిద్రలోకి జారిపోయారు. ఆ తరువాత తెల్లవారటానికి ఎంతోసేపు పట్టలేదు.

* * *

వసంత కేకకు నిద్రపోతున్న సీతాపతిగారు ఉలిక్కిపడిలేచి లోపలకు పరుగెత్తారు. బాధతో విలవిలలాడుతూ దయనీయ స్థితిలో సరస్వతి. రమేష్‌కోసం వెళుతున్నంతలో అతనే వస్తూ కనిపించాడు.

"లాభంలేదు మాస్టారూ! పరిస్థితి పూర్తిగా విషమించింది. చివరి క్షణాలనుకోవచ్చు." అర్ధగంటసేపు విఫల ప్రయత్నం చేశాడు రమేష్.

దీపం కడసారి వెలుగుతున్నట్లుగా సరస్వతి కళ్ళు విప్పింది. మంచంచుట్టూ నిలబడున్న అందర్నీ తేరిపార చూసింది. ఆ కళ్ళు వెదికేది ఎవరికోసమో సీతాపతిగారికి తెలుసు.

"సరస్వతీ! సరస్వతీ" దుఃఖంగా ఒడిలోకి తీసుకొన్నారు.

"కృ.... కృ.... ష్ణ!" గొంతులో నుండి ధ్వని కష్టంగా వెలువడింది. సమాధానంగా ఆయన కళ్ళు వర్షించాయి.

బలవంతాన దుఃఖాన్ని దిగమింగుతున్న వసంత ప్రక్కగదిలోకి పరిగెత్తి క్షణాల్లో కృష్ణ ఫోటో ఫ్రేముతో తిరిగొచ్చి, సీతాపతిగారికి అందించింది.

వణుకుతున్న చేతులతో సరస్వతి దాన్ని అందుకొంది. ఆ కళ్ళనుండి వాత్సల్యం అశ్రుప్రవాహంలా కృష్ణ రూపాన్ని తాకుతూ చివరిసారిగా వెలిగాయి. ఫోటోను పెదవులతో మెల్లగా స్పృశించింది.

అంతే! ఆమె శరీరం క్షణాల్లో కట్టెలా బిగుసుకుపోయింది.

"సరస్వతీ!" రోదించారు సీతాపతిగారు. వసంత దుఃఖానికి అంతులేదు.

* * *

"తల్లి చావుబతుకుల్లో వుందని తెలిసి వెంటనే రాలేనివాడు, శవాన్ని చూడ

టానికైనా వస్తాడన్న నమ్మకంలేదు. ప్రతి నిమిషం వాడికి కొన్ని వందల రూపాయల నష్టం తెస్తుంది. ఎవరైతే కడసారి వాణ్ణి చూడాలని ఆశపడ్డారో ఆమె బ్రతికిలేదు, ఇంకెందుకు ఆగడం? జరగాల్సింది జరగనివ్వండి." సీతాపతి గారు మర్నాడే దహనానికి సిద్ధపడ్డారు.

సాయంత్రానికి జీవంలేని శరీరం కట్టెల్లో కాలి బూడిదగా మిగిలింది. తన చేతులతోనే తలకొరివి పెట్టారు.

"పాపం! చివరిదాకా బిడ్డను చూడాలని ఎంతగానో తహతహలాడింది. అంతగా ప్రేమించిన కొడుకు తలకొరివి పెట్టేందుకు కూడా లేకపోయాడు. రోజులే అంతే." ఎవరో అనటం వినిపించిన సీతాపతిగారికి దుఃఖం ఆగలేదు.



సీరియల్

# సౌందర్యదీపం

ఆర్. సంధ్యాదేవి

విభావసుడి ఉదయ కిరణాలు నలువైపులా కాంతిని వెదజల్లుతున్నాయి.

తొలి సంధ్యాగీతాన్ని గానంచేస్తూ మలయమారుతం స్వేచ్ఛా విహారం చేస్తోంది.

పశుపక్షి వృక్షజాలాలు ఆనందోత్సాహాలతో నూతన రాగాన్ని ఆలాపిస్తున్నాయి.

ఆ ఉదయకిరణాల మంచునకు ఆ తోటలలోని కుసుమాలు ఆనంద అంబుధిలో మునిగిపోతూ కలలు ఊహించసాగాయి. బంగారు కిరణ కాంతులకి అప్పుడే విచ్చుకుంటున్న రంగు రంగుల పూలు అందాలని విరజిమ్ముతూ మంచు బిందువులతో మెరిసిపోతున్నాయి.

పచ్చని ఆకుల మధ్య రంగురంగుల పూలు అందాలొలికిపోతూ దాసదాసీల మధ్య మహారాణుల్లా ఉన్నాయి.

అందమైన ఆ పూలతోటలో నెమళ్ళు పురువిప్పి నాట్యం చేస్తున్నాయి.

పూలతోటకి ఒకవైపు తీగజాలు పొదపుగా కట్టివుంది.

ఆ జాలు లోపల రెండు లేడిపిల్లలు ఉషారుగా ఉత్సాహంగా చెంగు చెంగు మంటూ గెంతసాగాయి.

ఆ పూలతోట మధ్య పెద్ద బంగళా.

బంగళా పోర్టికోలో వైట్ ఇంపాలా ఉంది. తెల్లని యూనిఫామ్‌లో ఉన్న డ్రయివర్ కారుని అద్దంలా నీటుగా ఉంచడంకోసం ప్రయత్నం చేస్తున్నాడు. తోటమాలి ప్రతీ పూలమొక్కనీ జాగ్రత్తగా పరిశీలిస్తూ తోటలో తిరగసాగాడు.

నౌకర్లు ఇద్దరూ చెరొక అల్సేషియన్ డాగ్స్‌ని గొలుసులతో కట్టి వెంట తిప్పడానికి తీసుకెళ్తున్నారు.

ఆ బంగళా ఎంత అందంగా ఉందో ఆ బంగళాలో ఫర్నిచర్ అంత అందంగా ఉంది.

ఎక్కడ ఉండవలసిన సామాన్లు అక్కడ పొందిగ్గా అందంగా అమర్చుకున్నాయి.

తెల్లని యూనిఫామ్‌లో ఉన్న నౌకర్లు ఆ బంగళాలో హడావుడిగా తిరుగుతున్నారు.

విభావసుడి ఉదయకిరణాల కాంతులు గ్లాస్‌డోర్స్‌లోంచి చొచ్చుకుని కర్టెన్లని దాటుకుని కృష్ణమౌళి ముఖంపై పడసాగాయి.

అతను బద్ధకంగా అటునుండి ఇటు తిరిగాడు. తెల్లవారిందని అని తెలియగానే అతనిలో ఉన్న బద్ధకం మరో మెట్టు పైకివెళ్ళి కూర్చుంది.

తెల్లవారితే తన పనులు, కార్యక్రమాలు తప్పితే మనిషికి రెస్ట్‌లేదు. మనసుకి శాంతిలేదు. హృదయానికి ఆవేదన తోడై మనసుని,మనిషిని కృంగదీస్తున్నాయి.

అయినా సరే తెల్లవారితే తప్పనిసరి కార్యక్రమాలన్నీ వరసగా ఉంటాయి.

కృష్ణమౌళి బద్ధకంగా కళ్ళు విప్పి చూశాడు. ఎదురుగా తల్లీ తండ్రీ ఫోటోలు గోడకు తగిలించి ఉన్నాయి. అతను ప్రతిరోజూ ఉదయం లేవగానే తల్లితండ్రుల ఫొటోలనే చూస్తాడు.

ఫొటోలో తల్లిదండ్రులజీవని చల్లగా దీవించినట్లుగా అనిపించి మనసు అంతా తేలికయి ఉత్సాహంగా అనిపిస్తుంది.

కృష్ణమౌళి మంచంమీద నుండి లేచి వెళ్ళి గ్లాస్‌డోర్స్ తెరుచుకుని బాల్కనీ దగ్గరగా వెళ్ళి నిలబడ్డాడు. ఆ తోటలోని పూలు వింత అందాలని ఒలికిస్తూ కన్నుల పండుగ చేస్తున్నాయి.

ఒక్కక్షణం అలాగే చూశాడు.

తనయింట శ్రీలక్ష్మి బంగారు గజ్జలు కట్టుకుని నాట్యంచేస్తూ ఆ ఇంటిని అష్టయిశ్వర్యాలతో ముంచెయ్యసాగింది. ఆ శ్రీలక్ష్మి అందర్నీ కరుణించదు.

కరుణించిందో వాళ్ళు ఐశ్వర్యవంతుల్లుగా మారిపోతారు.

కృష్ణమౌళి అంతే అతనికి శ్రీలక్ష్మి కటాక్షమే అతను ఇంతటివాడు అవడానికి కారణం.

బిజినెస్‌లో లక్షలకు లక్షలు సంపాదించి జమిందారీ హోదాలో కెళ్ళిపోయాడు.

సిరిసంపదలు రావడం మొదలు అయితే ఇక ఆ ఐశ్వర్యానికి అనకట్ట అంటూ లేదు.

అలా వచ్చి మనిషిని ముంచేస్తూనే ఉంటుంది. కృష్ణమౌళి ఎంత సంపాదించినా ఇంకా సరిపోదు అన్నట్టుగానే ఇంకా అలా సంపాదిస్తూనే ఉన్నాడు.

అయితే ఆ సంపాదన అనుభవించడానికి అతనికి తల్లిదండ్రులు గాని, అన్నదమ్ములుగాని, అక్కాచెళ్ళెళ్ళుగాని ఎవ్వరూ లేరు.

కృష్ణమౌళి ఒక్కడే. తండ్రి చిన్నతనంలో చనిపోతే తల్లి అతనికి ఇరవై అయిదు సంవత్సరాల వయస్సు వచ్చాక చనిపోయింది.

అప్పటినుండి అతను ఒంటరివాడై పోయాడు. కృష్ణమౌళి పెళ్ళి చేసేసుకోవాలని చాలాసార్లు అనుకున్నాడు.

తల్లి చనిపోతూ చెప్పిన మాటలు

గుర్తువచ్చి పెళ్ళిమాట తలపెట్టటం మానేసేవాడు.

ఒంటరితనంతో బాధపడితే ఆ క్షణంలో పెళ్ళి గురించి ఆలోచించే వాడు.

ఇంత ఐశ్వర్యం ఉంది. ఎందరో తింటున్నారు. తన నీడలో తలదాచుకుంటున్నారు

నా అనే వాళ్ళకి అనుభవించేని ఈ ఐశ్వర్యం ఈ పేరు ప్రఖ్యాతులు భగవంతుడు తనకి ఎందుకు ఇచ్చాడు? అదే సృష్టిలో విచిత్రం.

తన భార్య, పిల్లలు ఈ యింట్లో తిరుగుతుంటే ఈ బంగళా ఎంత కళ కళలాడిపోతుంది!

తన తల్లి తనని అష్టకష్టాలు పడి పెంచి పెద్దచేసిన మాతృమూర్తి అమృతమూర్తి.

ఆ తల్లి తనతోచెప్పిన మాటలు పదే పదే గుర్తువచ్చి మనస్సుని ఆవేదనతో ముంచెత్తి మనసులో కోరికలకి కళ్ళెం వేసి ఆపుతున్నాయి.

అందుకే తను ఇన్నిరోజులూ పెళ్ళి చేసుకోకుండా రోజులు గడుపుకొచ్చేది.

తను తల్లికి ఇచ్చిన మాట నెరవేర్చుకోవాలి

తల్లికి ఇచ్చినమాట చెల్లించుకుని ఆ ఋణం తీర్చుకోవాలి

అతను బాధగా ఒక్క క్షణం కళ్ళు మూసుకున్నాడు.

గతం గుర్తువచ్చి బరువుగా నిట్టూర్పు వెలువడింది.

కృష్ణమౌళి గుండెల్లో అందాల ఇంద్రధనుస్సు రూపం తళుక్కున తారలా మెరిసి మెరుపులా చటుక్కున మాయమయింది. అలా ప్రతిరోజూ అనిపిస్తూనే ఉంటుంది.

అలా అనిపిస్తుంటే మనసు అంతా సంతోషంతో నిండిపోతుంది. మరు క్షణంలో మనసుఅంతా బాధమైపోతుంది. కృష్ణమౌళి అక్కడినుండి వెనుతిరిగి గదిలోకి వెళ్ళాడు.

## 2

కృష్ణమౌళి స్నానంచేసి బట్టలు మార్చుకుని బ్రేక్‌ఫాస్ట్ తీసుకుని మేడ దిగి హాలులోకి వెళ్ళాడు.

అతనితో మాట్లాడడానికి కాన్పూర్ నుండి నలుగురు మార్వాడీస్ వచ్చారు.

వాళ్ళు పెట్టబోతున్న కంపెనీలో షేర్ తీసుకోమని అడగడానికి.

ఆ విషయం ముందుగా వార్ని కనుక్కొని అతని పి. ఎ. సుందర్రావు కృష్ణమౌళికి చెప్పాడు.

అతను వెళ్ళి ఆ విషయం వాళ్ళతో మాట్లాడసాగాడు.

అంతలో అతనికి ఫోన్ రావటంతో పి.ఏ. వెళ్ళి చెప్పాడు. కృష్ణమౌళి లేచి వెళ్ళి రిసీవర్ అందుకుని "హల్లో కృష్ణ మౌళి హియర్" అన్నాడు హుందాగా.

"హల్లో గుడ్‌మార్నింగ్ సార్. నేను

వైజాగ్‌నుంచి మాట్లాడుతున్నాను ఉదయప్రకాష్‌ని" అన్నాడు ఫోన్‌లో అతి వినయంగా.

"గుడ్‌మార్నింగ్. ఏమిటీ ఇలా ఫోన్ చేశారు? ఆ బంగళావర్క్ ఎంతవరకు వచ్చింది?"

"అయిపోవచ్చింది. ఒక నెలరోజులలో మొత్తం వర్క్ పూర్తి అయిపోతుంది. ఫ్లోరింగ్ అయిపోయింది. కార్పెట్స్ వేయిస్తున్నాం. గోడలకి పెల్‌మెట్స్ బిగించి బంగళాకి డెకరేషన్ చేయిస్తున్నాం. ఇంకా చేసేకొద్దీ అలా ఏదో వర్క్ మిగిలిపోతూనే ఉంటుంది కానీ వర్క్ ఆగిపోవటంలేదు సార్" అన్నాడు మెల్లిగా.

"ఇప్పటికే చాలా ఆలస్యం అయిపోయింది. తొందరలో నేను వైజాగ్ వచ్చేస్తున్నాను, నేను వచ్చేసరికి బంగళా పూర్తి అయిపోవాలి" అన్నాడు కచ్చితంగా చెప్తూ.

"అయిపోతుంది సార్ ఒక నెలరోజులలో వర్క్ అంతా పూర్తిగా కంప్లీట్ అయిపోతుంది."

"సరే చూస్తాను" అంటూ సన్నగా నవ్వాడు.

ఉదయప్రకాష్ ఆ బంగళా గురించి అతనితో కొద్దిసేపు మాట్లాడి ఫోన్ పెట్టేశాడు.

వచ్చిన వాళ్ళతో మాట్లాడి వాళ్ళువెళ్ళిపోయాక అతను వేరే పనిమీద కారులో వెళ్ళిపోయాడు.

కృష్ణమోళి ఆరోజు మధ్యాహ్న భోజనానికి కూడా యింటికి రాలేదు.

అతనికి అది అలవాటే. ఆ టైముకి ఎక్కడో ఒకచోట భోజనం చేసేస్తాడు.

ఒక్కొక్కసారి రాత్రులు అంతే. ఆరోజు అతను యింటికి వచ్చేసరికి రాత్రి తొమ్మిది గంటలు అయింది.

ఫ్రెండ్ ఇంట్లో భోజనం చేసివచ్చాడు.

యింటికి రావటంతోనే అలసిపోయినట్టు మంచంమీద పడుకుండిపోయాడు.

అలసటగా ఉన్నాదేగాని కళ్ళకు నిద్ర పట్టలేదు.

మనసులో లెక్కలేని ఆలోచనలు సుడులు తిరుగుతున్నాయి

ఇంజనీర్ జయరాం వైజాగ్‌నుంచి ఫోన్ చేసినదగ్గరనుండీ మనసు అలాగే ఉంది.

తను హైద్రాబాద్‌నుంచి వైజాగ్‌కి మకాం మార్చే ఉద్దేశంతో వైజాగ్‌లో ఒక పెద్ద బంగళా కట్టించే పని జయరామ్‌కి అప్పగించేశా. ఆ బంగళా పూర్తి అయిపోగానే అతను వైజాగ్‌వెళ్ళి ఒక సంవత్సరం ఉంటాడు.

తను వైజాగ్ వెళ్తున్నాడు అంటే అది బిజినెస్ పనిమీద కాదు. తల్లికి ఇచ్చిన మాట నిలబెట్టటంకోసం.

అందుకే ఒక సంవత్సరంపాటు వైజాగ్‌లో ఉండడానికి నిశ్చయించుకున్నాడు. అతనికి గణేశ్‌రావుగారు గుర్తువచ్చారు.

కృష్ణమోళి ముఖం కోపంతో జేవురించింది

కళ్ళల్లోప్ర్ జీరలుఅలుము కున్నాయి. ఆగ్రహయోగంగా పిడికిళ్ళు బిగుసుకున్నాయి.

'గణేష్‌రావుగారూ, 'నేను వైజాగ్ వస్తున్నాను. మీరు నాతో ఎలా సరి సమానం కాగలరు !'

'నా అంతస్తు ఏమిటి ! మీ అంతస్తు ఏమిటి ! తొందరలోనే నిరూపిస్తాను.

'మీ కుటుంబ కంటకావరాన్ని నా కాలి క్రింద వేసి నల్లి నిరాసినట్లురాసిపారేస్తాను

'మీ దాబు దర్జాని చిటికలో ఊదేసి చిత్తుగా ఓడించేస్తాను, కోపంగా కసిగా అన కుంటూ.'

'వస్తాను తొందరలోనే వైజాగ్ వస్తాను, అల వంకిస్తూ తనలో తాను అనుకున్నట్లుగా పైకే అన్నాడు.

అలా అదే విషయం ఆలోచిస్తుంటె ఫోన్ రింగ్ అయింది. పక్కనే మంచానికి ఆనుకున్న షోకేసువైపు విసుగ్గా చెయ్యిచాపి రిసీవర్ అందుకున్నాడు. "హల్లో కృష్ణమౌళీ హియర్" అన్నాడు.

"హల్లో మీరేనా! నేను అంబికారాణిని మాట్లాడుతున్నాను" అంది అవతలి కంఠ స్వరం మృదువుగా. ఆ స్వరంలో మృదుత్వంతో పాటు సంతోషం కూడా స్పష్టంగా తెలుస్తుంది.

ఆ పేరు వినగానే అతనిలో కోపం, విసుగు మాయమయి కంఠస్వరం శాంతంగా మారిపోయింది. "అంబికా ! నువ్వా! ఏమిటి ఇంతరాత్రివేళ ఫోన్ చేశావు ఎక్కడనుండి మాట్లాడుతున్నావు"

"నేను మా ఫ్రెండ్ ఇంటిదగ్గరనుండి ఫోన్ చేస్తున్నాను మీరు వైజాగ్ కొద్ది రోజులలో వస్తున్నారని తెలిసి నాకు చాలా సంతోషంగా ఉంది" అంది ఆ గొంతు కలో దాచుకోలేని సంతోషం పొంగి పొర్లుతుంది. అతను నివ్వాడు. మనసుకి హాయిగా ఆనందంగా అనిపించింది.

తన గురించి ఆలోచించేవాళ్ళు. ప్రతి రోజూ తలుచుకునేవాళ్ళు ఉన్నారు అంటే అంబికారాణి అనే చెప్పాలి. ఆమెకు తను అంటే ఎంత అభిమానం !

"అంత సంతోషంగా అనిపిస్తుందా ! ఎందుకో !" అతని కంఠస్వరం మృదువుగా పలికింది.

"ఎందుకో మీకు తెలీదా! నేనుఇప్పుడు ఇలా ఉండడానికి కారణం మీరు. నాకు చదువుకోవడానికి సహాయంచేస్తూ అండగా నిలిచారు. నాకు జీవితంలో ఏ లోటూ లేదు ఇక ఉండబోదు అనే ధైర్యం కలగజేసింది మీరు. ఈ ప్రపంచంలో నా అనేవాళ్ళులేని నాకు అత్యంత ఆత్మీయులు, ప్రేమాభిమానాలు కురిపించే స్నేహమూర్తులు మీరు. మీరు వస్తున్నారు అంటే నాకు సంతోషం కాదా !" అంది. అలా అంటున్నప్పుడు ఆ కంఠ స్వరం కంపించింది.

కృష్ణమౌళికి ఆమె మాటలు ఒక్కొక్కటి వింటుంటే చాలా సంతోషంగా అనిపించసాగింది.

తల్లి పోయినదగ్గరనుండి తను ఏకాకిగా ఒంటరితనంతో కుమిలిపోయేవాడు.

ఇప్పుడు అంబిక మాటలు వింటుంటే మనసులో భారం కడిగేసినట్టుగా తేలిగ్గా అనిపిస్తుంది.

తను ఒంటరివాడు కాదు.

తనగురించి ఆలోచించేవాళ్ళు ఉన్నారు.

"అంబికా!"

"ఏమిటండీ!" అతను చెప్పేమాటలు ఏమిటో వినడానికి సిద్ధంగా ఉన్నట్టుగా అంది

"నాకు కూడా త్వరలో వైజాగ్ వచ్చేయాలనిపిస్తుంది. వస్తూనే ముందుగా నీతోనే మాట్లాడాలనిపిస్తుంది. నేను వచ్చే ముందు నీకు ఫోన్ చేస్తాను. నీవు ఆ రోజు ఎయిర్ పోర్ట్ కి తప్పకుండా రావాలి," అన్నాడు నిశ్చితంగా చెప్తూ.

ఆ చెప్పటంలో అధికారదర్పంతోపాటు సౌమ్యత, సౌహార్దం నిండివున్నాయి.

"మీరు చెప్పాలా! ఆ రోజు తప్పకుండా ఎయిర్ పోర్ట్ కి వస్తాను" అంది నమ్మకంగా చెప్తూ.

అతను నవ్వాడు ఆ నవ్వులో ఆమె తప్పకుండా ఎయిర్ పోర్ట్ కి వస్తుంది అన్న నమ్మకం అనిపిస్తుంది. ఫోన్ లో అంబిక ఆ విషయాలే మాట్లాడి ఫోన్ పెట్టేసింది.

కృష్ణమోహన్ మంచంమీద పడుకుంటూ ఆలోచించసాగాడు.

అంబిక ఎమ్. బి. బి. ఎస్ పూర్తి చేసింది. ఆ సంవత్సరంలోనే హౌస్ సర్జన్ కూడా పూర్తి అయిపోతుంది.

అతని ఆలోచన ఏమిటి అంటే!

అంబికారాణిచేత ఆ వైజాగ్ లోనే ఒక నర్సింగ్ హోమ్ ఓపెన్ చేయిద్దామని.

ఆమె కష్టపడి చదివింది.

అంత కష్టపడి చదివినందుకు ఫలితంగా ఆమె డాక్టర్ గా మంచి పేరు తెచ్చుకోవాలని అతని ఉద్దేశం ఆమె ఇంటర్ ఫస్ట్ క్లాస్ లో పాసయి పై చదువులు చదివే అవకాశంలేక చదువు మానేసి ఇంట్లో ఉండిపోతే అంబిక మనసు గ్రహించి ఆమె చదువుకోవడానికి ఉత్సాహం ఇచ్చి డబ్బు తను సహాయ చేస్తూ ఆమెను వైజాగ్ పంపించి మెడికల్ హాస్టల్లో ఉంచి ఎమ్. బి. బి. ఎస్. చదివించేడు.

తను అంత డబ్బు ఖర్చు చేసి చదివించిన ఫలితంగా చాలా శ్రద్ధగా చదివి ఎమ్. బి. బి. ఎస్. పూర్తి చేసింది.

నర్సింగ్ హోమ్ కూడా ఆమెచేత ఓపెన్ చేయించేస్తే ఆమెకు పూర్తిగా సహాయపడినవాడు అవుతాడు.

అప్పుడు ఆమె మనసు కుదుటపడి శాంతపడుతుంది. తనకాళ్ళమీద తను నిలబడితే అప్పుడు మిగతా విషయాలగురించి ఆలోచించగలను అంది తనతో ఒకసారి.

వైజాగ్ వెళ్ళిన తరువాత ఆమెతో మాట్లాడి మనసులో ఉద్దేశం ఏమిటో తెలుసుకోవాలి అని అనుకున్నాడు మనసులో.

అలా ఆలోచిస్తూ పడుకున్నాడు.

(సశేషం)

# ఎర

కొటూరు రవీంద్ర త్రివిక్రమ్

వాన.

సరిగ్గా ఆఫీసు వదిలి వెళ్లే వేళ.

ఆ వాన చాలా దాలా దట్టంగా కురుస్తోంది. 'రెయిన్‌కోటు' ఉన్నవాళ్లు, గొడుగులవాళ్లు కూడా చూసి చూసి సాహసం చెయ్యలేకపోతున్నారు. అలాంటి అధారాలు లేనివాళ్లు వానలోకి దిగులుగా చూస్తూ నిలబడిపోయారు.

ఆఫీసు స్టాఫంతా బయట వరండాలోకి చేరిపోయారు. గాలి విసురుకి అప్పుడప్పుడు వాళ్లమీద జల్లు పడుతోంది.

వసంత, జల్లుకి కొస్త దూరంగా గోడకి ఆనుకుని నిలబడి 'లాకెట్' వేళ్లమధ్య కదిలిస్తూ ఆలోచిస్తోంది.

ఆమెకి ఇలాంటి వాతావరణంలో చచ్చిన తండ్రి గుర్తువస్తాడు.

ఆయన జీవితాన్ని చివరి క్షణం వరకు తాగేసిన మద్యం సీసాలు— కాలకూట విషభాండాల రూపంలో కళ్లముందు కదుల్తుంటాయి!

ఒకప్పుడు రాజాలాగా బ్రతికాడు కేవలం తనకోసం అన్నీ త్యాగంచేశాడని తల్లి చెబుతుంటే వింటుండేది.

అయితే, జీవితంలో ఏదో పోగొట్టుకుని నిర్వేదం చెందుతున్న ఆ సమయంలో ఆనాటి తండ్రి త్యాగమూర్తి ఎలా భావించాలో తనకి పూర్తిగా అర్థమయ్యేది కాదు.

కాని, తల్లి మాత్రం ఆయన్ని ఆ ప్రపంచపు ఎల్లలనుండి ఇవతలకి లాగాలనీ, ఆయనలో చైతన్యం కలిగించి, ఉత్సాహం కలిగించాలని శతథా చేసే ప్రయత్నాలు సుస్పష్టంగా తనకి కనిపించేవి.

ఆ ప్రయత్నాల్లో భాగంగా—

ఆయనకు విస్కీ సీసా, గ్లాసు, సిగరెట్టు పెట్టె, అగ్గిపెట్టె వగయిరాలన్నీ ఆవిడే అమర్చి ఉంచేది. ఎప్పటికేది అందించాలో అది క్షణాల్లో ఆయనకందుబాటులో ఉంచేది



ఎప్పుడూ— కడిగిన ముత్యంలా పరిశుభ్రంగా, కళ్లకింపుగా కనుపించేందుకు తన మీద తను శ్రద్ధవహించేది.

ఇవన్నీ చూస్తుంటే తనలో సందేహం ముల్లులా గుచ్చుతుండేది.

అసలు తన తల్లి ఆయన అగ్ని సాక్షిగా పెళ్లాడిన భార్యేనా? లేక....

ఈ సందేహానికి జవాబు ఎవరు చెబుతారు!

తల్లి నడిగితే గాయపరచటం అవుతుందేమోనని తనలోనే చాలా కాలం దాచిపెట్టుకుంది. చివరికది శాశ్వతంగా తనలో బాధను రగిలిస్తూ ఉండిపోతుందేమోనన్న భయంతో, మృత్యు సన్నిధిలో ఉన్న తల్లి నడిగింది.

తల్లి పెదవుల మీద నవ్వు మెదిలింది.

"పిచ్చితల్లీ! అగ్ని ఎంత సత్యమో మనసు అంత సత్యం. అగ్ని ముందు నిలిపినా మనసే అగ్నిలోకి తోసినా మనసే పిచ్చి ఊహలతో మనసు పాడు చేసుకోకు."

ఆ సమాధానం అందీ, అందకుండా ఉంది.

స్పష్టత, అస్పష్టత కూడా అందులో ఉన్నాయి!

మెల్లగా ఆ విషయం గురించి ఆలోచించటం మానేసింది. కానీ, ఎప్పుడో ఒక[illegible] చటుక్కున గుర్తు[illegible]మానడు. వచ్చినా పూర్వంత బాధ కలిగించలేకపోతోంది. అదేనేమో కాలంలోని మాయాజాలం!

"ఎక్స్క్యూజ్ మీ మిస్ వసంతా!"

ఉలిక్కిపడి చూసింది.

కమర్షియల్ ఆఫీసర్ జీవన్. ఆరడుగుల అందమయిన విగ్రహం.

"వర్షం గురించి ఆగిపోయారనుకుంటాను... రండి... నా కార్లో డ్రాప్ చేస్తాను...."

ఆశ్చర్యంగా చూస్తుండిపోయింది.

కార్లో డ్రాప్ చేస్తాడా?!

తను... అఫ్టరాల్....! కాదు తను... అందమైన ఆడది. అందుకే ఈ ఆఫర్!

"నో థాంక్స్ సర్... ప్లీజ్ డోంట్ మైండ్...."

"డోంట్ యూ వర్రీ... అబ్బ! ఈ వానలో ఎలా ఇంటికి వెళతారు? మీరేమీ భయపడకండి.... జాగ్రత్తగా యాక్సిడెంట్ చెయ్యకుండా, బురదనీళ్లు మీ మీద పడకుండా...."

అతను చెబుతుండగానే లయజన్ ఆఫీసర్ కిషోర్ వచ్చాడు "హల్లో వసంతాదేవిగారూ" అంటూ.

జీవన్ మాట్లాడటం ఆపి, అతనికేసి సీరియస్‌గా చూశాడు.

"టేకిట్ ఈజీ బ్రదర్!" అంటూ పొట్టమీద మెల్లగా తట్టి "[illegible] వానంటే భయమున్న [illegible] నవ్వేస్తూ.

"అంటే [illegible]

వసంత.

"వానకి మీరంటే భయమనుకున్నానండి..."

"ఎందుకని?"

"అందమయిన ఆడపిల్లలంటే ఆకర్షణతో బాటు ఏమపి తిట్టేస్తుందో ననే భయం తప్పదు కదండీ? మిమ్మల్ని ఎవరైనా తినేసేలా చూస్తే, వాళ్లని అమాంతం తినేస్తారని ఆఫీసులో పేరు. అందుకని, వానకూడా మిమ్మల్ని తాకాలంటే భయమేమో..."

అతని వివరణకి పకపక నవ్వింది వసంత.

కిషోర్‌కి సినిమాల పిచ్చి జాస్తి. కమల్‌హాసన్‌లా కనిపించడానికి, మాట్లాడటానికి తంటాలుపడుతుంటాడు.

కిషోర్, వసంత తనని పట్టించుకోకుండా మాట్లాడుకోవటం, నవ్వుకోవటం చూసి 'జెలసీ'గా చూస్తూ అవతలకి వెళ్లిపోయాడు జీవన్.

జీవన్‌తో మాట్లాడుతూనే, పర్సనల్ డిపార్ట్‌మెంట్‌లో జూనియర్ ఆఫీసర్ మధు కాస్త ఎడంగా తప్పుకుపోవటం గమనించి "హల్లో మధుగారూ! ఏమిటలా సీరియస్‌గా వెళ్లిపోతున్నారు? మిమ్మల్ని చూసి వాన ఆగిపోతుందనా?" వసంత పలకరించింది, నవ్వుతూ.

మధు ఇబ్బందిగా నిలబడి "మీరేదో బిజీగా మాట్లాడుతున్నారని..." అన్నాడు నానుస్తూ.

"జస్ట్ కాలక్షేపం! అంతే...మీరూ రావొచ్చు...."

"అపునవును రావొచ్చు.... తీకెళ్లేమీ కొనక్కర్లా..." వ్యంగ్యంగా అన్నాడు కిషోర్. చురుక్కుమని చూసి, వసంతకి సమీపంగా నిలబడ్డాడు మధు.

ఇప్పుడు కిషోర్‌మీదకన్నా, మధు మీద ఆసక్తిగా మాట్లాడసాగింది వసంత. రెండు నిముషాలు అసహనంగా నిలబడి "వస్తాను వసంతాదేవీ" జవాబు కెదురు చూడకుండా వెళ్లిపోయాడు కిషోర్.

"అమ్మయ్య..." నిట్టూర్చింది వసంత.

ఇద్దరూ నవ్వుకున్నారు.

"మొత్తానికి మీరు చెప్పిందే నిజమైంది. వీళ్లిద్దరూ నన్ను రాహుకేతువుల్లా పట్టుకున్నారు.." అంది వసంత.

"అంటే మీలో సూర్యచంద్రుల ఇద్దరి అంశా ఉండి ఉండాలి...." చమత్కారంగా అన్నాడు మధు.

"ఏమి అంశలో కానీ, ఈ సృష్టిలో ఆడదిగా పుట్టటమంత అపరాధం మరొకటి లేదనిపిస్తోంది."

"ఫిలాసఫీ మాట్లాడుతున్నారు" నవ్వేడు మధు.

"నే చెప్పింది అబద్ధం అంటారా?"

"అబద్ధమంటే మీకు కోపం రాదూ! అందుకని నిజమేనంటాను.."

"డోంట్ బీ సిల్లీ" చిరుకోపం నటించింది.

"అదుగో వాన తగ్గింది.... అందరూ వెళ్తున్నారు . పదండి మనమూ వెళ్దాం" బయటికి దారితీశాడు.

వసంత వెంబడించింది.

• • •

ఇందిరా పార్క్‌లో సాయంత్రం మరింత అందం , ఆహ్లాదంగా ఉంది.

మొగలి పొదలకి సమీపంగా ఉన్న గట్టుమీద కూర్చున్నారు వసంత, మధు. గాలిలోంచి అప్పుడప్పుడు ఉండీలేనట్లు వీస్తోంది మొగలిపూల పరిమళం సాధారణంగా మొగలిరేకులు విచ్చితేనేగానీ రాని పరిమళం ఎలా వస్తోందా అని ఆశ్చర్యంగా చూశాడు మధు. నేలమీద చెదురుమదురుగా రేకులు కనిపించాయి. ఎవరో చాటుగా అదనాదాచరా తెంపుకు వెళ్తూ చేసిన పని అయిఉంటుందను కున్నాడు.

"ఏమిటలా పరిశోధిస్తున్నారు?" అంది వసంత.

చెప్పాడు.

విని నవ్వేసింది.

"మీరు బాగా డిటెక్టివ్‌లు చదువుతా రనుకుంటాను..."

"చదివి చేసే డిటెక్షన్, పుస్తకాల వంటలాగానే ఉంటుంది!"

"అంటే-సహజ డిటెక్టివ్ నంటారా?"

"ఏమో.... సహజ డిటెక్టివో, జన్మ డిటెక్టివో నాకు తెలియదు! ఆ పేర్లన్నీ మీరంటున్నారు నేను వింటున్నాను...."

"అబ్బ, మీతో నెగ్గటం నావల్ల కాదండీ!"

"మరి నెగ్గే ప్రయత్నాలు చెయ్య కండి. సరేనా?"

ఇద్దరూ నవ్వుకున్నారు.

కాస్త ఎదగా వెళ్తున్న వయసు ... ఇద్దరూ వీళ్ళని చూసి "గుడ్నుడు ... వెళ్ళారు.

... మాటలు స్పష్టంగా వినిపించి, ఇద్దరూ ఒకరి కళ్ళలోకి ఒకరు పరిశీల నగా చూసుకున్నారు. 'నిజమా?' అన్నట్లు.

కళ్లూ కళ్లూ నవ్వేశాయి!

• • •

"కంగ్రాట్స్ మిస్ వసంతా."

"దేనికి?"

"మీరు మధుని పెళ్లిచేసుకోబోతు న్నందుకు."

తెల్లబోయింది.

"ఎవరన్నారు?"

"అరే- అయితే అబద్ధమన్నమాట! వెరీ సారీ...."

ఇంకా తెల్లబోయింది.

"అబద్ధమని మీతో నేను చెప్పానా?"

"చెబుతారనుకున్నాను ...." జవాబు కోసం ఎదురుచూడకుండా జారుకున్నాడు కిషోర్. వసంత ఆ షాక్‌నుండి తేరుకుని తన సీట్లోకి వచ్చి కూర్చుంది.

కానీ, ఆ వసంతా ... అగరొత్తుల

పొగలా వ్యాపించింది. వసంతకి యీ అనుకోని ప్రచారం సంతోషంగానూ ఉంది, ఇబ్బందిగానూ ఉంది.

సంతోషానికి కారణం–మధుతో జీవితాన్ని పంచుకోవటానికి తను నిర్ణయం చేసుకోవటం.

ఇబ్బందికి కారణం– ఇంకా మధు అంతర్యం ఏమిటో స్పష్టంగా తెలియక పోవటం.

పోనీ, ఈ ప్రచారంతో నయినా తనకి మేలు జరిగితే బావుణ్ణు అనుకుంది. అలా అనుకున్నాక మనసు తేలిక అయింది.

* * *

"వెధవలు– నన్ను అలాగే ఫూల్ చేద్దామని చూశారు...."

"ఎందుకలా చేశారంటారు ?"

"ఎందుకా ! ?" ఆమెను చేతుల్లో చుట్టేసి, సుతారంగా అధరాల్ని ముద్దిడి "ఇంతటి అందాలరాసి నా సొంతమయినందుకు" అన్నాడు మురిపెంగా చూస్తూ.

ఆమె అలాగే నిర్నిమేషంగా అతన్ని చూసిందొక నిముషం.

"ఏమిటలా చూస్తున్నావ్ ?"

"నేను కలగంటున్నానా, లేక వాస్తవమా అని !"

నవ్వేశాడు మధు.

"ఇది ఎంత ఏకాంతమయినా [illegible] ! లేకపోతే ఏ [illegible] వాడిని...." చిలిపిగా చూశాడు.

* * *

"ఏమిటిది ?"

"రాజీనామా !"

"ఎందుకని ?" ఆశ్చర్యంగా అడిగాడు డైరెక్టర్. ఆయనే ఆఫీసుకి బాస్.

"ఈ ఉత్తరంలో రాశాను. మీరు దీన్ని చదివేక మధుగారి కివ్వండి. వొస్తాను...." వసంత బయటికెళ్లిపోయింది.

"మధుగారికి–

మీరు చాలా తెలివయినవారు. నన్ను ముందుగా మీ ఇంద్రజాలంతో మాయ పరిచి, ఆఫీసులో మీరు తప్ప అందరూ కామాంధులూ, దుర్మార్గులూ, అవకాశవాదులుగా చిత్రించి, చాకచక్యంగా నమ్మించగలిగారు. నాకు 'ఎం' వేశారు.

కానీ–

మీ ప్రవర్తనలో నాకు అపశ్రుతులు వినిపించి, కష్టపడి మీ గత చరిత్ర సేకరించాను. మీకో భార్య ఉంది. కట్నం పేచీ పరిష్కారం కాక పుట్టింట్లో జీవచ్ఛవంలా పడిఉంది. అనుక్షణం మీ రాక కోసం వేయికళ్లతో ఎదురుచూస్తోంది. అందుకు సాక్ష్యం మీ రూమ్‌లో అజాగ్రత్తగా మీరు పారేసుకున్న ఉత్తరాలే! ఆ ఉత్తరాలు సమయానికి చూసి ఉండకపోతే, మీ మోసంలో పడి శీలం పోగొట్టుకునేదాన్ని. [illegible] బాత్‌రూమ్ నుంచి



తిరిగివచ్చేలోగా దొరికిన వ్యవధి నా జీవితాన్ని కాపాడింది.

ఇప్పటికే అల్లరిపాలైన నా ఆఫీసు జీవితం - మరింత హేయంగా గడపటం ఇష్టంలేక రాజీనామా ఇస్తున్నాను. ఈ ఉత్తరం నా డైరెక్టరుగారి ద్వారా మీకందజేస్తున్న కారణం, సంస్థ అధిపతిగా ఆయనకు గల విస్తృత అధికారం ద్వారా నయినా మీలోని మూర్ఖత్వాన్ని పోగొట్టి, మనిషిగా మార్చగలరనే నమ్మకం.

ఇప్పటికయినా మీ ఇల్లాలిని ఆదరిస్తారని ఆశిస్తూ —

వసంత

# విన్నపాలు

జానకీపతిగారు బయట ఆటో దిగి గేటులో వస్తూ, అక్కడే ఉన్న శ్రీకాంత్‌ని చూసి చిరునవ్వు నవ్వి "సిద్ధంగా ఉన్నారా అంతా?" అని అడిగా రాయన.

ఆహ్వానిస్తూ నవ్వి "రండి.రండి. మీరు వస్తున్నారని చెప్తే వాళ్ళకు ఆనందం కలిగించింది. సిద్ధంగా ఉండమని ఎందులోనూ మీ పద్ధతులు తెలిసినదే!" అన్నాడు.

"మావయ్యగారికి కాళ్ళకి నీళ్ళివ్వరా శ్రీ" అంది అన్నపూర్ణమ్మగారు.

"భలేదానివే అమ్మా. ఆయనచిన్నపిల్లా వీధిలోని దుమ్మంతా పట్టించుకొని వస్తారా ఏమిటి? ఇంటిదగ్గర ఆటో ఎక్కారు. ఆ కాలు మన గేటుముందు దించారు. పూర్వకాలపు ఆచారాలూ నువ్వూను" అన్నాడు శ్రీకాంత్.

"పోనీలే శ్రీకాంత్, పట్టుకురా ఆవిడ తృప్తికి" అని అన్నపూర్ణమ్మ వైపు తిరిగి "అంతా బాగున్నారా?" అనడిగాడు జానకీపతిగారు.

"బాగున్నాం మీ దయవల్ల. పదిరో గాను బాగున్నారా, పిల్లలెవరూ పూరిటీ వెళ్ళారా?"

"ఎక్కడికీ వెళ్ళలేదు. నేనే వద్దన్నాను. పిల్లల వరకే మన బాధ్యత! మన వరకి మనవళ్ళకీ అంటారూ, వాళ్ళ తల్లి తండ్రులే బాధ్యులు. మనమల్లా అంతా బాగున్నారా, లేదా చూడడం వరకే అని అప్పుడే వచ్చిన దుర్గని చూసి, "ఏమ్మా నువ్వెప్పుడు వచ్చావు?" అని అడిగా రాయన.

"నమస్కారం మావయ్యగారు, నిన్ననే వచ్చానండి. ఆయనకి క్యాంపు ఉందిట, వాళ్ళ ఆఫీసరుతోపాటు. నన్నిక్కడ దింపి వెళ్ళారు. మీ శ్రీలక్ష్మి బాగుందా? అడిగానని చెప్పండి" అంది దుర్గాంబ.

"ఇక్కడ లేదుగా, రాగానే చెబుతాను నువ్వడిగావని. లేకపోతే ఉత్తరమయినా రాస్తాను నువ్వడిగావని. సరా!"

అందరూ లోపలికి చేరుకున్నాక శ్రీకాంత్ "అటు కూర్చోండి మావయ్యగారు" అంటూ కుర్చీ చూపించాడు.

"రిటైర్డ్ జడ్జిగారి సీటన్నమాట అది" అంది దుర్గ.

"బయట రిటైర్ అయినా ఈ రోజు మీ ఇంటికి 'జడ్జి' హోదాలోనే వచ్చాను. కోర్టువారి అనుమతి లేకుండా ఏమన్నా మాట్లాడవద్దు కోర్టువారు ఊరుకోరు, గుర్తుంచుకో" అన్నారాయన.

అందరూ నవ్వేశారు.

"ఇక మొదలు పెడదామా?" అడిగా రాయన కుర్చీలో కూర్చోబోతూ.

సింగరాజు
రామచంద్రమూర్తి



"మీ ఇష్టం" అన్నాడు శ్రీకాంత్.

"కూర్చున్నానంటే మీ మావయ్య గారిని కాదు గుర్తుంచుకోండి. మాకు అలవాటు కద - కుర్చీలో కూర్చోగానే కోర్టు మమ్మల్ని ఆవహిస్తుంది. ఎన్ని సంవత్సరాల అలవాటు మరి. సరే, కూర్చోబోతున్నాను. ఏవరేం చెప్పుకోవాలో చెప్పుకోండి. మీ ఇంటి సమస్యలకి నాకు తోచిన పరిష్కారం చెబుతాను. ఆచరించడం, ఆచరించకపోవటం మీ ఇష్టం!" అని నవ్వుతూ "ఇది నిజమయిన కోర్టు కాదు. నేను అధికారంలో ఉన్న జడ్జీని కాను కద! రిటయిరయిన వాడినాయె! - కనుక నా నిర్ణయాన్ని అమలు జరిపించే అధికారం నాకు లేదు." అన్నారాయన.

"అలాకాదు. మీరు ఏం చెబితే అది చేద్దామనేకద మావయ్యగారూ మిమ్మల్ని పిలిచింది. మొన్నటిదాకా న్యాయాధికారి మీరు! అంతకన్న ముఖ్యం మాకుటుంబానికి స్నేహితులు. లేకపోతే మీ అంతటి వారిని ఇంటికి రప్పించగలమా? మీరు చెప్పిన సలహాలు తుచ తప్పకుండా ఆచరిస్తామని హామీఇస్తున్నాను" అన్నాడు శ్రీకాంత్.

"కూర్చుంటున్నాను" అంటూనే కూర్చుని, కాసేపు కళ్ళుమూసుకుని తరువాత "ప్రతి కుటుంబంలోనూ సమస్యలు ఉంటాయి. లేనని ఎవరన్నా అంటే వాటి నిజం చెప్పడం లేదన్నమాట. ఇప్పుడు మీ కుటుంబంలోనూ అలాగే అందరి మనసులకు కష్టం కలిగించే విషయాలుండవచ్చు." "అవి ముందుగా అన్న పూర్ణమ్మగారు .... మీరు చెప్పవలసింది చెప్పండి. మరో మాట అందరిముందు చెబితే ఒకరి అభిప్రాయాలు ఒకరికి తెలుస్తాయి. అలాకాదు, ఒంటరిగానే చెబుతాము అంటే వీళ్ళనందరిని బయటకు పంపుతాను" అన్నారు.

"ఇందులో దాచే విషయం ఏమీలేదు. ఎవరిమీనా కోపమూ లేదు. కాకపోతే పెద్దదాన్ని కనుక మనసుకి కష్టం వేసి... అదికూడా వినేవారు చెప్పమంటున్నారు కనుక చెప్పడం కాని"...

"మీరు నేరుగా మీ మీ మనసులోని కష్టం ఏమిటో చెప్పటం మంచిది" అన్నారు జానకీపతిగారు.

"నేను నా పిల్లల నందర్నీ అతి ప్రేమగా పెంచుకున్నాను. అయితే మళ్ళీ అందులోనూ నా పెద్దకొడుకు శ్రీకాంత్‌ని మరికొంచెం ఎక్కువగా పెంచాను. చిన్నతనం నుంచి అనారోగ్యపువాడు కావటాన మీ బావగారికీ నాకూ కూడా...."

జానకీపతిగారు అడ్డంపడ్డారు. "ఈ కాసేపు మీరు కోర్టులో ఉన్నట్టు మాట్లాడాలి"

ఆవిడ తెల్లబోయి, అంతలో సర్దుకొని "సరే. అయినా, నేను కూడా వీడు ఎప్పుడు నా చేయి జారిపోతాడో నన్న భయంతోనే ఉండేవాళ్ళం. అంత అనారోగ్యం వీడిది. వూరిలో ఏ జబ్బులు ఎవరికి వచ్చినా వెంటనే వీడికి అంటుకునేవి. జలుబులు, ఫ్లూలు అట్లమ్మలు ఒకటేమిటి అన్నీను. పుట్టగానే మగబిడ్డ ఇలా అయ్యాడేమా అని బాధ పడుతూండేదానిని. అప్పటికి రెండవవాడు కలగ పుట్టలేదు, చాలాకాలందాకా నాకు వీళ్ళిద్దరే - శ్రీకాంత్, దుర్గ సంతానం.

వీరిని తిప్పని గుడి, చూపించని గోపురం ఉండేవికావు. ఈ చుట్టుప్రక్కల ఎవరు వాడి ఆయుస్సు పెంచుతారని విన్నా అక్కడికి తీసుకువెళ్ళేదాన్ని. ఉదయమే పితికిన పాలు తాగించేదానిని.

మా అదృష్టం అనండి ....ఇప్పుడింకెవరి అదృష్టమనండి — వాడు చదువులో మాత్రం రేడు! వాడి అరోగ్యం కోసం చేసిన పనులన్నీ వాడికి మెదడుకి వెళ్ళినట్లున్నాయి! స్కూల్లో ఫస్టు. కాలేజీలో ఫస్టు. అందువల్లనే వెంటనే ఇంజినీరింగ్ సీటొచ్చింది. శక్తి లేకపోయినా అందులో చేర్పించాము. ఆయన కొచ్చే జీతంలో ఎలా తట్టుకోవడం? చూస్తూ చూస్తూ వీడి ఉత్సాహాన్ని చంపలేక, అంతెత్తు ఎగిరే స్తోమతలేక సతమతమయిపోయాడాయన.



నా వంటిమీదనున్న బంగారం తాకట్టు పెట్టడం వీడికి జీతాలు కట్టడం, మళ్ళీ దొక్కలు మాడ్చుకుని అది విడిపించు కోవడం – అదీవరస. వాడికి మాత్రం మళ్ళీ అందులోనూ ఘట్టుమార్పులే. చివరికి ఈ పిల్ల పెళ్ళికి గానీయండి, వాడి ఉద్యోగం ప్రయత్నం కానీయండి, ఆ బంగారం కాస్తా నా ఒంటిమీద నుంచి శాశ్వతంగా వెళ్ళిపోయింది. “పోనీలే, పిల్లాడికి ఉద్యోగం వచ్చింది, పిల్ల ఒకింటిదయింది” అని తృప్తిపడ్డాను. కాని చిన్నతనం నుంచి అలవాటేమో, నా మెడవంక ఆయనా చూడలేకపోయేవారు. నాకూ ఎక్కడికీ వెళ్ళబుద్ధయేది కాదు.

కాపరానికి వచ్చినపుడు అత్తగారు, మావగారు, ఆడబిడ్డలు, మరుదులు–మాది

ఉన్నాడి కుటుంబం. ఆయన జీతం, నా రక్తం వాళ్ళకిందనే ఖర్చయాయి. ఒక ముద్దూముచ్చటా ఎన్నడూ తీరినది లేదు. అసలు మాట్లాడటానికేందుకే తీరిక ఉండేది కాదు. చిక్కినా ఎవరేమను కుంటారోనన్న భయం. ఒక మంచిబట్ట కట్టుకోవాలన్న మనసూ తీరలేదు. "మన లాంటి కుటుంబాల్లో అటువంటి కోరిక లుండకూడదు అన్నపూర్ణా " అంటూండే వారాయన. కాని మనిషన్నాక, నలుగుర్నీ చూస్తున్నాక మనము అలా ఉండాలన్న కోరిక కలగడం సహజం కద!

వారినందరిని సాగనంపేసరికి పిల్ల లందుకున్నారు. ఇకనంతే. కడుపు కట్టుకోవడం రెండు చీరెలు చాలనా అనుకోవడం- ఉన్నదంతా మిగిల్చి వాళ్ళ కింద ఖర్చుపెట్టడం!

ఇప్పుడిక జీవితానికి మిగిలిం దేమిటి? మొన్న మొన్న వచ్చిన వాళ్ళు వాళ్ళవాళ్ళ కాపరాలు చక్కగా దిద్దుకుం టూంటె ముచ్చటేస్తుంది. మనమూ ఇలా స్వార్థంతో అయినవారినందరిని కాదని వేరే కాపురం పెట్టుకుని ఉంటే బాగుపడే వాళ్ళమేమో ననిపిస్తుంటుంది కూడా!

మా అబ్బాయికి మనసు కష్టంవేస్తుం దేమో కాని ఈరోజు అందరి మనసుల్లోని మాటలు చెప్పుకోవచ్చునన్నారు కనుక చెబుతున్నాను. అమ్మ మంచిబట్ట కట్టు కున్న రోజులు పెద్దప్పలు చూడలేదు కనుక అమ్మకి కూడా మంచిబట్టలు కట్టుకోవాలని ఉంటుందన్న ధ్యాస కల గదు. అది సహజం కూడా! నాలుగు రూపాయలు మిగులుతే కోడలికి కొంటాడు. లేదే-చిన్నపిల్లలుంటే మయిన దానికి అలంకరణ రాణిస్తుంది కూడా!

కాని "అమ్మ మెడలో గొలుసు ఏమ యింది, ఎలా ఖర్చయింది? ఆవిడకి మళ్ళీ అమర్చాలి" అన్న ధ్యాసకూడా రాదు. అదే రైటే. వయసులో ఉన్న పిల్లకి ఉన్నదీ మన్నదీ పెట్టి చేయిస్తే ముచ్చ టగా ఉంటుంది. రేపు వాడి కుటుంబంలో ఉంటుంది బంగారం! నీ ఒంటిమీ దయితే-ఆడపిల్లలు ఆశపడితే? ఏదయిన బంగారం ఎటూ ఖర్చయిపోయింది కద అని అవి, ఒకట్రెండన్నా నవ్వి "అయినా ఆయన పోనే పోయారు. ఇక అందాలు. అలంకారాలూ నాకెందుకు? ఆయన జీతం డబ్బులు ఏనాడూ నా చేతిలో పొయ్యనే లేదు. మొదట్లో వాళ్ళ అమ్మ చేతికిచ్చేవారు. తరువాత పోయేందుకు అసలు ఇంటికి ఏమయినా వస్తే కదా? దారిలో అందరికీ ఇచ్చుకుంటూ వచ్చే సరికి ఇంచ, చాలక్కూ మిగిలేవి.

కడిపెడు కండలోని తిన్నాం. వంటి మీద బంగారం చిన్నంతో సహా ఊడ్చి చదివించాం. అంతవరకే అది ఆ జీతం పుచ్చుకునే అదృష్టానికి నోచుకోవాలి. తరం మారిపోయింది. ఇప్పుడు భార్యని సుఖపెట్టడమే అందరి లక్ష్యం. కాని

అందరూ అలా ఉంటే బాగానే ఉండును. మా పెద్దదాని జీవితం . . "

ఇక్కడ జానకీపతిగారు "ఆపండి ఆ అమ్మాయి విషయం ఆ అమ్మాయే చెప్పుకుంటుంది. మీది అయిపోయిందన్న మాట. దుర్గాంబ- మీరు చెప్పుకోండి యిప్పుడు" అన్నారు.

లేచి నిలబడింది దుర్గ. "నా జీవితం నాశనం అయిపోయింది. ఎవరికీ చెప్పుకోలేదింతవరకూ నా బాధ....మా అమ్మ చెప్పినట్లు నాకు బుద్ధి తెలిసి నప్పటినుంచి మా శ్రీకాంత్ చదువు' అన్న యజ్ఞంలో మా నాన్న అలిసి పోయారు. ఎప్పుడూ ఆయన కళ్ళు దేని కోసమో వెతుకుతున్నట్లుండేవి. అది డబ్బు యేనన్నమాట. ఆయన అనుభవించిందీ లేదు. ఇదిగో వీడికోసం—వీడి ఆరోగ్యంకోసం మొదట, చదువుకోసం తరువాత.

నన్ను గురించి ఒక్క సంఘటన చెబితే చాలు, వీడివల్ల నే నెంత నష్టపో యిందీ తెలిసిపోతుంది.

నన్ను చూసేందుకు ఒక డాక్టరుగార్ని తీసుకొచ్చారు మీరు-- క్షమించండి. మా కుటుంబ స్నేహితులు. ఆ అబ్బాయికి నేను నచ్చాను. ఇరవై వేలు కట్నం అడిగారు వాళ్ళు. మా నాన్న ఇవ్వలే నన్నారు. అయితే ఆతను నన్ను తప్ప ఇంకెవరినీ చేసుకోనని భీష్మించాడట. ఇక్కడ మరో మాట చెప్పాలి. నన్ను పెళ్ళిచూపులు చూసినవారంతా నన్ను తప్ప ఇంకెవరినీ చేసుకోనన్న వారే. కాని భగవంతుడు అందం ఇచ్చినా మంచి జీవితం ఇవ్వలేదు.

మా నాన్నగారప్పుడు ఇదుగో వీడి చదువులో మునిగి నా, తేలుతూ ఉన్నారు. చివరికి పన్నెండు వేలదాకే వచ్చారు వాళ్ళు. ఆ తరవాత అసలు దేవే ...నో కబురంపారు — పదివేలు ఇస్తాము. మిగిలిన రెండు వేలూ ఓనే ...తానని ఈ మాట ఎవరికీ చెప్పొద్దని.

అవి ఇవ్వలేక వదిలేశారు ఆ సంబంధం. నా ప్రాణం గిలగిల్లాడిపోయింది. కాని ఆడపిల్లని — ఏం చేయను? చివరికి ఇదుగో ... గొడుసును అమ్మి నాకు ఎనిమిది వేలు కట్నం ఇచ్చి పెళ్ళి చేశారు. ఆయనగారు గుమాస్తా. మా నాన్నలాంటి.' అమ్మ లాంటి జీవితం మళ్ళీ మొదలు నాకూ.

నా అదృష్టాన్ని మార్చింది ఆ రెండు వేలే. అదీ వీడి చదువువల్ల మునిగి పోవడంవల్ల కాని లేకపోతే మా నాన్న తల తాకట్టుపెట్టయినా తెచ్చేవాడు. అంటే నా జీవితం మార్చింది వీడు. ఇప్పుడు ఒక్క ... పెట్టేందుకు మొగుడూ పెళ్ళాం ముఖాలు చూసుకుంటూ ... వదిలేయండి- నాకు ఎంత యోగమో ... తే ...తుంది. వీళ్ళెంతకాలం ఇవ్వగలరు!

...నీనండి. అసలు మీరదృష్టం ఏమంటే మేమున్న ఇంటికి ఎదురుగానే

ఇప్పుడీ డాక్టరుగారు ఇల్లు కొన్నారు. వాళ్ళావిడ ఏమీ బాగుండదు. కాని బాగా డబ్బుగలవారి పిల్ల. కారులో వెడుతుంటాను రోజూ ఇద్దరు. అవన్నీ రెండు వేలకి పోయాయి నాకు!

కిటికీలోంచి చూస్తుంటాను తప్పిపోయిన నా అదృష్టాన్ని. మొన్న వొక రోజున అలాగే చూస్తున్నాను, వీధి తలుపు తీసి ఉందని చూసుకోలేదు. ఎప్పుడొచ్చాడో డాక్టరు వచ్చి నన్ను గట్టిగా పట్టుకున్నాడు వెనుక నుంచి.

ఎవరా అని చూస్తే అతను "ఛీ" అని వదిలించుకున్నాను. 'లేదు దుర్గా, ఆనాటికీ, ఏనాటికీ, ఏనాటికీ నువ్వంటే నాకు వీరీతమయిన ఇష్టం. అప్పుడు నా దగ్గర డబ్బు లేదు మానాన్న కోసం చెల్లెళ్ళ కోసం అడిగావు ఆ కట్నం! ఇప్పుడు నా దగ్గర వేలున్నాయి, అవి లక్షలవుతాయి. కాని దుర్గా నువ్వు దూరమయ్యావు. అలా వీల్లేదు' అంటూ నన్ను ఆపేసింది దుర్గ.

కాసేపటికి తనే సర్దుకుని "ఎడంగా నిలబడండి డాక్టర్. డబ్బు లేక పోయినా నిప్పులాంటి దాన్ని ఏమనుకున్నారో" అన్నాను.

'నన్నర్థం చేసుకోండి దుర్గా నాదవుతుందనుకున్న మనిషి నా కళ్ళ కెదురుగా ఉండి, నాకన్న ఎంతో తక్కువ స్థితిలో ఉండడం — రోజూ నేనెంత బాధపడుతుంటానో తెలుసా దుర్గా మీకు? ఐ లవ్ యూ' అన్నాడు.

"మీకన్న తక్కువ స్థితి నాకేమీ లేదు, ఉన్నంతలో తృప్తిఉంది నాకు. వెళ్ళండి, మళ్ళీ ఎప్పుడూ రాకండి" అన్నాను గట్టిగా.

'ఎప్పుడన్నా, ఎటువంటి అవసరం వచ్చినా — డాక్టరుగా కాని, మనిషికి మనిషిగా, డబ్బు అవసరం గాని... నేను ఉన్నానని గుర్తుంచకోండి" అన్నాడు.

"రెండూ అవసరం లేదు, మీరు వెళ్ళండి" అన్నాను. ఆయన వెళ్ళిపోయాక ఏడ్చాను నా స్థితికి.

ఇది జరిగిన పదిరోజులకి మా ఆయనకి ఆ డాక్టరుతో పరిచయం కలగి అది పెరగడం ఈయన ఆయన దగ్గరనుంచి అప్పుతెచ్చుకోవడం జరిగింది. చచ్చిపోయాను సిగ్గుతో.

నా జీవితమంతా కష్టపడి రెండువేలూ ఇచ్చేదాన్ని ఇప్పుడు ఆ రెండు వేలూ పోగు చేసినా నా కా జీవితం రాదు కద! ఎవరంటారు దీని క్కారణం? వీడు.

వీడిప్పుడు బాగానే ఉన్నాడు — సంఘంలో ఇంజినీరుగా మంచి స్థానం, పలుకుబడి కలిగి। మరి నాకు!" ఆపేసింది దుర్గ.

కాసేపు నిశ్శబ్దం ఆవరించింది.

"ఇప్పుడు రెండవ ఆడపిల్ల - పేరు సులక్షణ" అన్నారు జానకీపతిగారు.




"చాలాకాలంగా అన్నయ్యకీ, అమ్మకీ చెప్పాలనుకుంటున్నాను. కాని ధైర్యం చాలడం లేదు. ఇప్పుడు అవకాశం ఇచ్చారు– నేనూ, సుధాకర్ – అంటే మా ఇంటికి సరిగ్గా వెనక ఇంటివారి అబ్బాయి. ప్రేమించుకుంటున్నాము" అని తల వంచుకుంది.

అన్నపూర్ణమ్మగారు ఆ అమ్మాయి వంక ఆశ్చర్యంగా చూసింది.

"నాకు తెలుసు. మీ వదిన అనుమానించి చెప్పింది" అన్నాడు శ్రీకాంత్.

"సైలెన్స్. నువ్వు మాట్లాడమ్మా" అన్నారు జానకీపతిగారు.

"మా నాన్నగారు పోయేనాటికి నాకు పదిహేను సంవత్సరాలు. మా తమ్ముడికి పద్నాలుగు. నాన్నగారు పోయిన మూడేళ్ళుగా మా అందరి భారం మా అన్నయ్యే భరిస్తున్నాడు. వాడికీ నాన్నగారు పోయాకనే పెళ్ళయింది. వాడికీ వేరుగా ఉంటే బాగుంటుందన్న కోరిక ఉండటం సహజం కదా! మేమందరం వాడిమీద బరువుగా ఉండటం మాకూ బాధగానే ఉంది. అమ్మకి చేయడం వాడికి విధాయకం. మాకూడా పెళ్ళయే దాకా వాడే బాధ్యుడనుకోండి. అందుకే ఎంత త్వరగా పెళ్ళి చేసుకుని బయటకి పోతే అంత మేలు వాడికి!

చిన్నప్పుడు నాన్నగారు మాకు మంచి బట్టలు ఇవ్వలేకపోయారు. కారణం అక్కయ్య, అమ్మ చెప్పనే చెప్పారు.

ఎప్పుడూ అన్నయ్య చదువుకి, అన్నయ్య హాస్టలుకి సరిపోయేవి ఇంట్లో ఉన్న డబ్బులన్నీ.

అమ్మనుంచి మాకు నగలు వారసత్వంగా రాకపోయినా అవిడ అందం మాత్రం భగవంతుడి దయవలన నాకూ, అక్కయ్యకీ అబ్బింది. దాని జీవితం ఎలా పాడయిపోయిందో అది చెప్పింది. అందువల్ల నేను చెప్పేదేమంటే ఆడపిల్ల పెళ్ళిదగ్గర ఎప్పుడూ లోభించకండి. మా జీవితమంతా ఎలా జరగాలో నిర్ణయించేది మీరే. అందువల్ల అక్కడ మాత్రం వెనకాడకండి. తరువాత మీ ఆర్థికస్థితి బాగుపడితే మాకు తాత్కాలికంగా ఉపయోగపడుతుందే కాని శాశ్వతంగా కాదు. అక్కయ్య కార్లో తిరిగేది ఆ రెండు వేలకి నాన్నగారు వెనకాడి ఉండకపోతే.

మా అన్నయ్య కట్నం పుచ్చుకోలేదు. కాని అందరూ అలా ఉండరు ఈ లోకంలో. అందరి తల్లితండ్రులు మా అమ్మలాంటివాళ్ళూకారు, పుచ్చుకోకపోయినా పూరుకునేందుకు.

ఇప్పటికీ సుధాకర్ బాంకులో ఉద్యోగం చేస్తున్నాడు. చాలా మంచి భవిష్యత్తు కలవాడు. కట్నానికి వ్యతిరేకి. అయితే అతనూ మధ్య తరగతికి చెందిన కుటుంబంలోని వాడు. కనుక వాళ్ళనాన్నగారికి అతను కట్నం తీసుకురావాలి. ఆ కట్నం పెట్టి అయన తన కూతురికి పెళ్ళి చెయ్యాలి.

మా అన్నయ్య వాళ్ళు అడిగిన కట్నం ఇవ్వలేదు. ఇవ్వలేక కాదు, ఇవ్వడు. 'నాకూ సంసారం ఉంది, రేపు పిల్లలు పుడతారు' అంటాడు. కట్నం ఇవ్వకపోతే సుధాకర్ వాళ్ళ నాన్నగారు ఒప్పుకోరు. అతనికి వాళ్ళ నాన్నని కాదనేందుకు మనసొప్పదు. 'పొగరుబోతు' అనిపించుకోవడం ఇష్టంలేదు అతనికి" అని పేలవంగా నవ్వి "మళ్ళీ అక్కయ్య జీవితమే నాదీ అవుతుంది. ఎక్కడో చిన్న బడిపంతులునో, గుమాస్తానో పెళ్ళాడి, అయనకి పిల్లల్ని కని అదే జీవిత పరమార్థమని జీవితాన్ని గడిపేయడం.

చిన్నప్పుడు డబ్బులేక కోరికలు తీరలేదు. అదే అలవాటు చేసుకుని కోరిక అన్నదానినే మరిచిపోతే పోలా? సుధాకర్ని మరిచిపోతే సరి" అంది.

ఈ ఆఖరి మాటలంటూండగా ఆమె గొంతు పూడిపోయింది. కళ్ళలో నీళ్ళు గిర్రున తిరిగాయి.

జానకీపతిగారు "మాడమ్మా సులక్షణా! ఒక పని చేద్దాం. మే మెరుగున్న కుర్రాడు ఒకడున్నాడు. మంచి ఉద్యోగం గలవాడు. ఆదర్శాలూ కలవాడు. నువ్వు అందమయిన దానివని నువ్వే చెప్పావు. కనుక అతను కాదనడు బహుశ. పైస కట్నం లేకుండా నీకు అతనితో పెళ్ళి చేయిస్తాము. సరా?" అనడిగారు.

సులక్షణ మాట్లాడలేదు.

"చూశావా, నీ కిష్టం లేదన్న మాట." అన్నారాయన మళ్ళీ.

ఆమె తల వంచుకుని కాలి బొటన వేలితో నేలమీద రాస్తూండిపోయింది.

"కనుక నీ సుధాకరుడ్ని తప్ప మరొకర్ని చేసుకోవు. అవునా?"

అవునన్నట్లు తల గబగబ ఊపింది. ఆ కదలికకి ఆమె కన్నీళ్ళు అటు ఇటు ఎగిరిపడ్డాయి.

నవ్వారు జానకీపతిగారు. "కట్నం గురించి మాట్లాడటం తప్పనుకో. కాని విషయం వచ్చింది కనుక మాట్లాడాను. తప్పదు. పదిహేను వేలు, ఇరువయి వేలు చేసే కుర్రాడు నిన్ను చేసుకుంటా దంటే నువ్వు కాదంటున్నావు. అంటే, పదిహేను ఇరవయి వేలు కాలితో తన్నేశా వన్నమాట! అలాగే నీ సుధాకరుడు ఎందుకు తన్నేయడు?"

గభాలున తలెత్తింది సుభాషిణి ఆ ప్రశ్నకి.

"అనుగమ్మా ఆ ప్రశ్న అతన్నే కాదన్నాడు కనుక అతన్నే నువ్వు కాదన్న ఇవతలకి రా. బ్రతకలేకపోవు సరే. తరువాత వాడు రెండవ కుమారుడు నాలుగవ సంతానమూ అయిన శశిధర్. నువ్వు చెప్పవలసింది చెప్పవోయ్" అన్నారాయన.

"నాదేముందండి, ఇంకా చదువుకునే కుర్రాడిని కదా! నా కంప్లెయింట్ కూడా చదువు గురించే ఉంటుంది. చిన్నతనం నుంచి చదువు తప్ప మరో ధ్యాస లేని వాడిని, మా నాన్నగారి పుణ్యం మా అన్నయ్య పుణ్యం వలన ఖరీదయిన బట్టలు ఖరీదయిన అలవాట్లు లేవు. అటు వంటివి ఉండాలన్న కోరికా లేదు నాకు. ఎప్పుడూ మా అన్నయ్యే ఆదర్శం. వాడు అతి సాదాగా ఉండేవాడట. ఉండవలసిన అవసరం మాది. మా నాన్నగారి ఆదాయం, ఆ ఆదాయంలోనే అన్నయ్యని చదివించవలసి రావడం అక్కయ్యకి పెళ్ళిచేయవలసి రావడం వగయిరా చెప్పాడు పైగా వాళ్ళు. నేను చెప్పడం అవ సరం.

చెప్పాను గదా నాకు అన్నయ్య ఆదర్శ మని. ఆ దుకాణి వాడిలాగే ఇంజనీరుని కావాలన్నదే నా కోరిక. ఆ ధ్యేయంతోనే చదివాను. వాడు ఇంజనీరు కాగలిగాడు నేను కాలేకపోతున్నాను— సీటు రాలేదు కనుక. అదొక్కటే తేడా. 'ఎందువలన రాలేదు?' అన్నది వాడు చెప్పదగడు. నేను చెప్పినా వినిపించుకోరు. ఎందుక నంటే వాడే దీనికి కారణం కనుక ఇప్పుడు ఈ మాటలు చెప్పుకునే అవ కాశం మీ రిచ్చి నందుకు నేను కృతజ్ఞుడ్ని!

మా అన్నయ్య చదివిన రోజులలో ఇంటర్‌లో ఇప్పటిలాగా తొంభయి నాలుగుపైన రానవసరంలేదు మార్కులు. ఇంత రష్ ఉండేది కాదు. ఇంజనీరింగ్ కాలేజీ సీట్లకి. ఇప్పుడు ప్రతివాడి ధ్యాస ఇంజనీరింగ్, మెడిసన్లే కదా. మిగిలిన

వాటికి ఉద్యోగం వస్తుందన్న ఆశకూడా లేకపోయే! ఇ. దుకని ఇంటర్‌లో కాలేజీలో చేర్పించడం అన్నిటికీ ప్రయివేట్లు ఏర్పాటుచేసి ఒక సైకిల్ కొనివ్వడంతో చేర్పించినవాడి పనయిపోతే అప్పటినుంచే చేరినవాడి పని మొదలవుతుంది. ఎండా, వానా, జ్వరమూ ఇటువంటివి లక్ష్య పెట్టకుండా ఈ ప్రయివేట్లకి తిరగడం, వాళ్ల చెప్పిననోట్సు బట్టీపట్టడం, పరీక్షల్లో తు.చ. తప్పకుండా దించడం! నూటికి తొంభయి ఎనిమిది తెచ్చుకోవడం!

నాకు ఒక్క లెక్కలు మినహాయించి మిగిలినవాటిలో ప్రయివేట్లు లేవు. తన వల్ల కాదన్నాడు అన్నయ్య. మార్కులు కూడా 'సారీ' అన్నాయి నాకు. నూటికి ఎనభయి దాటలేదు!

'కాలేజీలో చెప్పింది చాలదా!' అన్నాడు అన్నయ్య ఈ మాట అంటే.

'కాలేజీలో చెప్పరు. ప్రయివేట్లలోనే చెబుతారు' అన్నాను. వాడికి అర్థం కాలేదు. ఇంకా ధర్మయుగం అనుకుంటు న్నాడు.

నా విన్నపం ఏమంటే- ఉద్యోగం అంటూ వస్తే తీర్చుకుంటాను, ఇంజనీరింగ్‌కి పాతికవేలు డొనేషన్ కట్టమని. అంతే" అన్నాడు శశిధర్.

"శ్రీకాంత్ నువ్వేమన్నా చెప్పుకోవాలా బైవే ఆఫ్ రిప్లై- సమాధానం అన్నమాట" అన్నారు జానకీపతిగారు నవ్వుతూ.

శ్రీకాంత్ కూడా నవ్వి, "ఏంలేదు సార్. నా చిన్నతనం నుంచి వరుసగా ఇప్పటిదాకా కథ చెప్పినట్లు చెప్పేవారు నలుగురూ కలసి అయితే చిన్న అపాయిం టేమిటంటే మా నాన్నగారు పోవడం, నాకు ఉద్యోగం రావడం ఒకేసారి జరిగాయి. ఇంచుమించుగా అప్పటినుంచి మొత్తం కుటుంబ బాధ్యతంతా నేనే వహిస్తున్నాను. అంతకు మించి చెప్ప వలసిందేమీ లేదు" అన్నాడు.

"ఇక మిగిలినది ఇంటి కోడలు వసుంధర. 'ఏమ్మా మరి నువ్వు చెప్పవూ? ఎవరిమీదయినా మనసులో కష్టం ఉంటే చెప్పెయొచ్చు. ఈ రోజు ఎవరూ ఏమీ అనుకోరు" అన్నారు జానకీపతిగారు.

"అలాగేనండి. మొదట అసలు నాకివన్నీ ఎందుకని అనిపించిందండి. అయితే ఇప్పుడు రెండు మాటలు చెబుతానండి ఏ ఆడపిల్లయినా మగపిల్లాడిని పెళ్లిచేసుకునేది అతని చదువుని, ఉద్యోగాన్ని, ఆస్తి అంతస్తుని చూసే కదండి! మరి అవన్నీ ఆ ఆడపిల్లకే చెందుతాయి కదండి! ఆ ఉద్యోగం, చదువూ లేకుండా ఉంటే కుర్రాడి ఇంటికి ఆడపిల్ల తండ్రి అసలు వెళ్ళనే వెళ్ళడు కదండి!

కనుక, గొప్ప గొప్ప సంబంధాలు- అంటే ఇంజనీర్లు డాక్టర్లు వంటి సంబంధాలకోసం ఆడపిల్లల తండ్రులు వెతికేది పిల్ల సుఖపడుతుందనే కదండి!





నేను చెప్పేదానికి ఎవరూ ఏమీ అనుకోకండి. 'అనుకోరు' అన్నారు కనుకనే అసలు చెబుతున్నానండి. ఆయన ఉద్దేశాలు కావండి ఇవి. నావీ కావండి. ఇప్పుడిప్పుడే వచ్చిన ఆలోచనలండి ఇవి.

ఆడపిల్ల సుఖపడాలని మంచి కుర్రాడికిచ్చి చేస్తారు. ఇందాక మా వదినగారు అన్నది కదండి "ఆ డాక్టరునే చేసుకుని ఉంటే కారులో తిరిగేదాన్నని." ఏ తండ్రికయినా అదే కదండి కోరిక. ఆ పిల్లకయినా అదే కదండి కోరిక, సంపాదించేవాడు, మంచి హోదాకలవాడు భర్త కావాలని।

ఆ తరువాత సంతానం కూడా తగ్గించుకుని అప్పుడు కావలసిన ఆధునికమయిన పరికరాలన్నీ కొనుక్కోవాలి, అంటే గ్రైండర్, ఫ్యాన్లు, స్కూటర్ వంటివి కొనుక్కోవాలి, ఆ పైన ఇల్లు కట్టుకుని హాయిగా కాలం గడపాలనే కదండి కోరిక।

మరి అటువంటప్పుడు పెళ్ళయిన రోజుకే నలుగురయిదుగుర్ని పోషించి, చదివించి, పెళ్ళిళ్ళు చేయవలసిన బాధ్యత ఉంటే ఇంకా వాళ్ల వాళ్ళ సంతానాన్ని తగ్గించుకొని మాత్రం ఉపయోగం ఏముంటుంది?

అన్నాళ్ళూ కాదు కానీ జనం కన్న తరువాత వాళ్ళు ఎదుగుతూ, పెళ్ళి చేసుకోవాలి కదండి। ఇవి ఇంకొకరు చేయాలసి వస్తే వాళ్ళు ఇంకెప్పటికి

కొలుకుంటారండి? వాళ్ళ చదువులు, పెళ్ళిళ్ళు, ముద్దులూ, ముచ్చట్లూ అయ్యే వరకీ వాళ్ళ సంతానం పెరిగి వచ్చేస్తారు. ఇంకా ఊపిరి తీసుకునే పైమేదండి?

అటువంటి పరిస్థితిలో ఇంకా అలా చేయలేదు, యిలా చేయలేదు అనడం ధర్మమా మీరే చెప్పండి!" గభాలున ఆపేసింది వసుంధర.

అన్నపూర్ణమ్మ తెల్లబోతూ ఆమె వంక చూసింది. వసుంధర తల వంచు కూర్చుంది.

ఒక్క అయిదు నిమిషాలు ఎవరూ మాట్లాడలేదు. అప్పుడు జానకీపతిగారు మొదలెట్టారు. "పెళ్ళయిన కొత్తలో ఆ భార్యాభర్తల మధ్యన శారీరక సంబంధమే ముఖ్యమైనది. అసలు ఆ ఆకర్షణ లేకపోతే అంతవరకు వాళ్ళు సర్వస్వం వదిలి ముక్కూముఖము తెలియని ఇంటికి వెళ్ళి వాళ్ళతో కలిసిపోరు.

తరువాత ఆ సాన్నిహిత్యం వల్ల వాళ్ళిద్దరి మధ్య ప్రేమ పెరుగుతుంది. ఒకరినొకరు అర్థం చేసుకుంటారు. ఇంతలో సంతానం కలిగి వారి అనుబంధాన్ని మరింత గట్టిపరుస్తుంది!

కనుక, మనకు కలిగే సంతానం కొంతవరకు మన కోరికల ప్రతిరూపం. అందువల్ల వాళ్ళని ఈ లోకంలోకి తెచ్చాం. వాళ్ళు మనల్ని పూజించాలి అనుకోవడం తప్పు!

పుట్టాక పెంచడం మన ధర్మం! చదువు చెప్పించటం మన కర్తవ్యం

అయితే ఎటువంటి చదువు? వాళ్ళ కాళ్ళమీద వాళ్ళు నిలబడేందుకు వీలు కలిగించే చదువు. మన శక్తికి మించని చదువు

అన్నపూర్ణమ్మగారూ, వింటున్నారా? కనుక చదువు చెప్పించడంలో మీరేదో త్యాగం చేశాననుకోకండి. అయితే మీ స్తోమతుకి ఇంజనీరింగ్ చెప్పించడం అన్నది త్యాగమే!

దానికి అతను మీకు ఋణపడి ఉన్నాడు. మిమ్మల్ని చూడవలసిన బాధ్యతని మీరు అతనికి ఆ విధంగా అంటగట్టారు. మిమ్మల్నతను పోషించి తీరాలి.

మరో విషయం. శక్తికి మించిన చదువును చదివించడం మిగిలినవారిని అన్యాయం చేయటమే అవుతుంది. అదే మీరు చేసినది! పిల్లలని చదివిస్తున్నా పెళ్ళి చేస్తున్నా ఒక్కటే ఆలోచించుకోవాలి. 'మిగిలిన వారికూడా ఇంతే చేయగలమా లేదా?' అన్నది. మీ భార్యాభర్తలు ఆ ఆలోచన చేసినట్లు లేదు.

దుర్గాంబకు తను నష్టపోయానన్న భావన కలగడంలో తప్పులేదు. ప్రత్యక్షంగా మీరు, మీ భర్తగారు, పరోక్షంగా మీ అబ్బాయి శ్రీకాంత్ అందుకు బాధ్యులు! ఆమెకు కలిగిన నష్టాన్ని పూడ్చే శక్తి మీకు లేదు కనుకా, మీ భర్త పరమపదించారు కనుకా మీ శ్రీకాంత్ బాధ్యత మాత్రం మిగిలింది!

దుర్గ బాగోగులు చూస్తుండవలసిన కర్తవ్యం శ్రీకాంత్‌కి ఉంది. అదీ ఆమెకు ధర్మం చేస్తున్నట్లు కాదు. తన ధర్మం తను నెరవేరుస్తున్నట్లు.

సులక్షణ విషయం ఇందాకనే చెప్పేశా.

ఇక శశిధర్.

అనతిక్రమ ప్రాథమికమయిన వివరణ అవసరం. ఎవరూ శక్తికి మించిన పనులుచేయరాదు. సంతానంకూడా అంతే!

ఇక్కడ శ్రీకాంత్ భార్య వసుంధర అడిగిన ప్రశ్నలు గుర్తుంచుకోదగినవి. ఎవరో– వారు తండ్రే కావచ్చును– ఎవరో కన్న సంతానంతోనే జీవితమంతా సతమతమయిపోతే ఇంక ఈ కొత్త దంపతులుజాగ్రత్తపడి బాగుపడేదెప్పుడు? వీళ్లు ఒకరూ, ఇద్దరూ పిల్లల్ని కని మాత్రం ఉపయోగం ఏమిటి?

కనుక ఈ శశిధర్ అందులోకి వస్తాడు. అన్నపూర్ణమ్మగారు, వారి భర్తయొక్క తాహతుకి మించిన సంతానం ఇతను.

ఆ బాధ్యతని నోరెత్తకుండా స్వీకరించిన శ్రీకాంత్‌ని అభినందిస్తున్నాను. శ్రీకాంత్ ఏమి చదివిస్తే అది చదువుకోవలసిన ధర్మం శశిధర్‌ది.

ఇక ఇంటి కోడలు వసుంధర మిగిలింది" అని ఆయన ఒక కాగితంమీద ఏదో వ్రాసి, కవరొకటి తెప్పించి, అందులో పెట్టి అతికించారు. అప్పుడు "అన్నపూర్ణమ్మగారూ, మీరీ కవరు అందుకోండి. ఎప్పుడు మీ కోడలి విషయంలో మీ మనసుకి కష్టంవేసినా ఈ కవరు చించి లోపలిది చదువుతే మీకు ఏం చేయాలో తెలుస్తుంది. ఇప్పుడు మీరంతా ఒక్కసారి బయటికి వెళ్ళండి. నువ్వు మాత్రం ఉండమ్మా వసుంధరా" అన్నారు.

వసుంధర ఒక్కతే నిలబడి ఉంది తలవంచుకుని.

"ఇందాక నువ్వు చాలా బాగా మాట్లాడావు. నువ్వడిగిన సందేహాలు మంచివి. అయితే ఇక్కడొక సూక్ష్మం ఉంది. అదే ఆ కవర్లో రాసి అతికించి ఆవిడకిచ్చాను. అదేమంటే –

మీ ఆయన చదువు ఉద్యోగం అన్నీ చూసి చేసుకున్నావు. అది నిజమే! కాని శ్రీకాంత్ [illegible]. నీ నుంచి పైగా కట్నం తీసుకుంటాడంటే ఆ ఉద్యోగం, చదువు అన్ని[illegible] నీకు హక్కు వచ్చేసేది!

ఏమీ తీసుకోక నీకు ఆ హక్కు లేకుండా చేశాడు! వాళ్ళమ్మ కష్టపడి చదివించుకుంది. అతని మీద కట్నం తీసుకుని ఉంటే ఆమె అతని సంపాదన మీద అధికారం పోగొట్టుకునేది!

నువ్వు అతని అర్ధాంగివి మాత్రమే! అతనికి యజమానురాలివి కావు.

వసుధ! మంచిదానివి అలాగే ఉండు. మాటలు విని మారబోకు" అన్నారాయన.

వసుంధర నవ్వుతూ "అలాగేనండి బాబాయిగారు. అసలు నాకు ఆ ఉద్దేశాలు లేవండి. దుర్గ అంటుంటే అన్నాను. అంతే" అంది.

—•—




(గత సంచిక తరువాయి)

## 24

"యేం నిద్దర! యేం నిద్దర!!" అంటూ_ పొద్దుట పదిగంటలకి_ నెగిసినాడు మా బాబు.

ఆ యేళ_మాం జేసిన పనల్లా పోలీసు టేషను చుట్టూ_ ప్రదచ్చినం జెయ్యడవే!

"సాయింత్రం నాతో మా ఊరొచ్చి- మీ యాదవాన్నిగూడా_రేపో, యెల్లుండో వొచ్చిమను" అన్నాడు మా బాబు నాతో.

ఓ యాభై ఎడ్వాన్సు కూడా యిచ్చినాడు.

మకాం మారసడం సంగతి మా యాడదాన్తో మాట్టాడినాను.- ఆ తర వాత.

ఆ సాయింత్రం జీపులో బయ లెల్లినాం.

ఈటి పోటు మరుపుకొచ్చినట్టు నేదు ఆ బాబుకి

అంచేత నాకూ, డ్రైవరుకీ మద్దెల కూకున్నాడు.

ఈటొచ్చినా, బాకొచ్చినా మా ఇద్దర్లో ఎవడో ఒకడు సావాలనుకున్నాడో- యేటో !

అన్నట్టు సెప్పడం మరిసిపోన్ను- మాం బయలెల్లీముందు- మా బాబు రెండు అల్సేసియను కుక్కల్ని కొన్నాడు.

అటికి అర్నెల్లు యెల్లనేదట.

అమ్మినోడు అటివి కుక్కలన్నాడు కాబట్టి నమ్మాలి గాని, అయి మాత్తరం తోడేళ్ల పిల్లల్లా కూడా గాదు- పెద్ద తోడేళ్ళలాగే ఉన్నాయి.

మాం ఊరుజేరీసరికి- సీకటడిపోనాది.

మరింక ఊరెలాగుందో ఏటో తెల్నేదు.

మర్నాడు పొద్దు జే- నెగిసి సూద్దునూ-

మనసుకి మంచుముక్క కట్టు కున్నట్టు,

ఎండలో తిరిగి తిరిగి ఏటిసీట్ల కొగి నట్టు అనిపించినాది ఊరు జూస్తే.

సిటీలో ఉన్నోడు పల్లెటూరెప్పుడు జూస్తాడు బాబు సినీమాల్లో తప్ప ! ఇక సినీమాల్లో అంటారా ?

సిటీలో "సీకటి సందుల సరుక్కి" మోకాళ్ళ వొరకూ కోకలు ఎగ్గట్టేసి- అళ్లనే పల్లెటూరి పిల్ల లనీసికో మంటారు. ఇడ్లీకి- బొనపరొాట్టెకీ ఉన్నంత బేదం ఉంటాది సిటీ సరుక్కి- పల్లెటూరి సరుక్కి.

సిటీలో ఓ సేట్టుసూడాలంటే మూడు మైళ్ళు నడవాల.

కాకి తప్ప మరో పిట్ట అగుపడదు యెంత తిరిగినా. మరంచేత ఆ ఊళ్ళో ఆ సెట్లూ, సెరువులూ- పిట్టలూ జూస్తే నాకు మతిపోనాది.

యెంటనే ఓ మూరెడు ఏపకొమ్మ యిరిసి పళ్ళు దోవినాను.

సెరువుకెళ్ళి తనివితీరా స్తాన్నమాడి నాను. ఆనక మాబాబు యింటిముందు పందిట్లో కూకుని- పేపరు జూస్తున్నాను.

అప్పుడు- పొద్దుట పదొత్తను కుంటాను.

అప్పటికే- మన ప్రెతాపం ఊరంతా తెలిసిపోనా దనుకుంటాను.

ఇంతలో- పకీంగోపిని- నా బాబు గారి పాలికాపే- అదొచ్చినాడు. ఒచ్చి- సాప పక్కన కూకున్నాడు.

ఆడు నా ఏపు జూసీవోటం జూస్తే నాకే సిగ్గేసిపోనాది.

ఆడదైతేనాతో నెగిసొచ్చీసలట్టున్నాడు.

పేరడిగినాడు.

ఊరడిగినాడు.

పెళ్ళి, పేరంటం అడిగినాడు.

పిల్లా, పీచూ అడిగినాడు.

సివర్న నాను జేసిన కూనీలు మూడా? నాలుగా ? అనడిగినాడు.

నాకు సిర్రెత్తుకొచ్చి "ఒకటి తక్కువ ముప్పయ్యి" అన్నాను.

మరంతే..

ఆ దద్దైతే నాతో నెగిసొచ్చేసినట్టు గాదు, నన్నే లెగదీసుకుపోయేటట్టు అయిపోనాడ.

మరింక జూసుకోండి.

ఆయాల కొడ్నించీ- నాను నోట్లో బీడీముక్కెట్టుకుంతే- అగ్గిపుల్ల కొట్టేది ఆడే.

ఆ మద్దేన్నం కేపీ తాగేక అడిగినాడు- మా బాబు "ఊరు జూసివొస్తావేట్రా" అని.

ఇదే సిటీలో అయితే యీ పాటికి పోలీసుల్ని తప్పించుకోవడానికి పది మైళ్లు నడిసేసి ఉండేవోడ్ని.

అందేత "ఓ" అన్నాను.

"ఉండు" అని లోపల కెళ్ళి ఒక దంతంపిడి బాకు యిచ్చేడు, "మొల నెట్టుకో. ఊరు మంచిది కాదు" అంటూ.

నాను బయలెల్లబోతూవుంటే "కుక్కల్ని కూడా తీసికెళ్ళు. పొద్దుట్నుంచీ కష్టేసేం" అన్నాడు.

యింక జూసుకోండి బాబూ

నాను కుక్కల్తో ఊళ్ళో ఎళ్తుంటే- రెండు ఎనుబోతులు తోలుకొస్తున్న యెముడ్ని- జూసినట్టు జూసినారు ప్రెజ.

నాకు దణ్ణాలెట్టేరు కొందరు.

"అహా! ఈళ్లు మన పార్టీవోళ్ళన్న మాట" అనుకున్నాను.

"అడుగో! అడే కెప్టెనుగోడు" అని కొందరు గుసగుసలాడేరు. యెవరూ? 'ఎగస్పార్టీ' వోళ్లు.

నాను ఎన్నో కూనీలు జేసేనన్న పేరు కూడా అప్పటికే ఊర్లో పాకిరేసి నాది. ఆ పేరుతో బతికేవొచ్చుననిపించేసి నాది నా మట్టుకు-నాకు.

అసలు మడిసికన్నా, దేవుడికన్నా సరేబాబూ-ఓ పేరు రావాల.

మన యీది సివర, గుడికెళ్ళి "నాను జెయిలుకెళ్ళకుండా సూడుబాబూ నీగుళ్ళో గుండు కొట్టించేసుకుంటాను" అని మొక్కుతావా?

మొక్కవు గదా!

ఎందేత?

యీది సివర దేవుడికి ఆ పేరు నేదు కాబట్టి.

మరందేత పేరున్న తిరపద్దేవుడికే ఆ మొక్కు మొక్కుతాం.

ఆ దేవుడికి సెయిర్మన్‌గోడు ఎమ్మెల్యే అవాలని మొక్కుతాడు.

ఎమ్మెల్లే మినిష్టు అవ్వాలంటాడు.

మినిష్టర్ సి.యం. అవాలంటాడు.

సి.యం.- పి.యం గావాలంటాడు.

పీ.యం. నానెప్పటికీ యిలాగే ఉండి పోవాల అని మొక్కుతాడు.

ఇచిత్తరం ఏటంటే-ఆళ్లలో కొందరి కోరకలన్నా తీరతాయి.

దాంతో తిరపద్దేవుడు పేరు ఇంకా పెరిగిపోద్ది.

నిజంగా ఆ దేవుడికే పరుపుంటే-వానూ మా యాటటీ కూడా కలసి గుళ్ళు కొట్టించీసుకుంటాం-మా యిద్దర్లో ఒకర్ని పంచాయితీ నెంబరు-సెయ్యమనండి, చూద్దాం.

కత మళ్ళించేస్తున్నా ననుకోకండి-బాబూ.

పేరు నేకపోతే రావులో దేవుడు బతక నేడు.

బద్రాసెలం తిరపద్దేవుడూ దేవుడే. సివాచెలం అప్పన్నా దేవుడే.

మరి తిరపద్దేవు దొక్కడే కోటీశ్వరు డెలాగై పోనాడు?

ఆ బాబుకున్న పేరును బట్టి.

పల్లెటూళ్ళో అమ్మోరికి "మా పిల్ల పెళ్ళి జేయించు తల్లీ" అని మొక్కుతావా?

మొక్కం.

మరేటని మొక్కుతాం?

"మాకూ, మా పశువులకీ జబ్బులు రాకుండా సూడు తల్లీ. నీకు జాతర జేస్తాం" అని మొక్కుతాం.

ఎంచేతంటారూ?

ఆ తల్లి పేరు జబ్బులు తెచ్చీవారకే గాబట్టి ఊరిదేఁవుఁడు బెంచి మేష్ట్రిటు లాటోడైతే-తిరపద్దేఁవుఁడు సుప్రీకోర్టు లాటోడన్నమాట.

మరంచేత-ట్రాన్సుఫర్లూ, ప్రమోషన్లూ, పెళ్ళిళూ- అలాటివన్నీ తిరపద్దేవుడి వొంతు. దేవుడి మాటలా ఒగ్గియండి.

ఓ మనిసికే మంచి పేరుం దను కోండి. దానిమీద-మహాత్మా గాంధీ నాగ బతికీవొచ్చు.

సలా (సలహా) జెప్పమని కొంత మంది వొస్తారు. సందాలు పుచ్చుకోమని మరి కొందరొస్తారు.

మంచిపేరు గాదు-సెడ్డపేరు ఉందను కోండి.

కిరాణాషాపుల్లోను, కూరల దుకాణాల కాడా నూమ్మూళ్లు వొసూలు జేసుకొని బతికీవొచ్చు.

మనకి-మళ్ళీ చెమించాల- తవఁరు గోర్ని గూడా-కలిపినందుకు నాకు సిటీలో గూడా కుసింత పేరున్నాది గానండీ-యీ ఊర్లో వొచ్చిన పేడుతో పోలుసు కుంటే, సూరీడుతో సిరసనూనె బుడ్డిని పోలిసినట్టే.

నాను ఆ రెండు కుక్కల్నీ అట్టుకొని రోడ్డుమీద యెల్తావుంటే- ఇలాగ రాజు గోరికి తోవిచ్చీసినట్టు యిచ్చీసివోరు జనం.

ఇంక మా కుక్కలంటారా?

అటేని జూస్తే- పోతులు పరిగే తీసియ్యి.

సంటిపిల్లలు ఏడుపులు మానీసివోరు.

నాను ఊరు సుట్టీసి- తిరిగొచ్చీసరికి సెంద్రుడు అప్పుడే నెగుస్తున్నాడండి.

పందిట్లో పదిమందిరితో ఊసులాడు తున్నాడండి మా బాబు.

నానెళ్ళి- ఓ రాటకి జేరబడ్డానండి.

"ఎలాగుందిరా ఊరూ?" అనడిగినా డండి మా బాబు.

"మర్యాద్దెల్సిన ఊరండి" అన్నా నండి.

"సెబాసో" అన్నాడండి అతగోడు.

ఆ ఎనక పట్నంలో ఎట్టిన కేసు గురించి సుట్టూవున్నోళ్ళకి మా బాబు జెప్పేసరికి వొణ్ణాం తైమైపోనాదండి.

## 25

ఇలా రెండు రోజులు గడిసిపోనా యండి.

మూడోనాడు——

నానూ-మా బాబూ, పంచాయితీ తోరుడు అపీసుకని బయలెల్లినావండి. యీ రెండ్రోజుల్లోనూ- నాకు పోలిటిక్సు కుసిన్ని తెలిసినాయండి.

మా వెళ్తావుంటే- మొగోళ్ళు కాలుస్తున్న సుట్టలూ, బీడీముక్కలూ పారేస్తున్నారు మా బాబుని సూడగానే.

ఆఁహా! యీళ్ళు మనోళ్ళన్నమాట అనుకున్నానండి.

ఒకడు మాత్తరం - పూరీ పేసింజెర్లా - గుప్పుగుప్పుమని పొగ వొదుల్తూ ఎదురొచ్చినాడండి. మాఁవుఁ యింకో బారెడు దూరం వున్నాపఁడగా- దమ్ము లాగి- ఎడంసేత్తో సుట్టతీసి- మాయేపు ఒదిల్నాడు బాబూ- పొగ.

మరంతేనండి.

సేతిలో వున్న పేపాటి కర్రతో- అది సేతిమీద ఒక్కటేసినాను. బాబు- నా కబద్దం వొద్దండి.

నాను కొట్టింది సెయ్యిరగొట్టాలని కాదండి.

సుట్టెగరగొట్టాలనండి- గానఁడి-

సుట్ట యెగిరిపండి.

సెయ్యి ఇరిగిందండి.

యెంటనే ఆడు కుడిసేత్తో కర్రెత్తి నాడండి

కండలూ, గిండలూ తిరిగినోడేనండి.

పైలాపచ్చీసు గోడేనండి.

శఁవఁరుగార్లాటోళ్ళని యిద్దర్ని కొట్ట గలిగే రకవేఁనండి.

కాని నన్నేటి సెయ్యగల్డండి.

అసలే ఎడంసెయ్యి యిరిగిపోనాది- అంచేత మన పని సులువైపోనాదండి.

యీ పాలి సేతిమీద కొట్టనేదండి.

కర్రమీద కొట్టినానండి.

కర్రెళ్ళి అరిళ్ళవతల పడ్డాదండి రెండు ముక్కలై.

అదెళ్ళి మూడో యింట్లో దూరి తలు పేసు కున్నాడండి.

ఇంట్లో దూరినాక అది కుడికాలి పిక్కే ఉండి ఉండదండి.

దాన్ని మా ఆడకుక్క పీకేసినాదండి.




మా బాబు మొకం "టూబునైటు" నాగ ఎఱగిపోనాదండి

ఆ పిక్కిపోయినోడి- అసలు పేరు ఎరుకు నాయుట్టండి— మారుపేరు కోడి గాడటండి.

అడు సీకట్లో సిరతపులటండి.

ఎల్తుర్లో ఎలుగోడ్డే నటండి-

బుచ్చిబాబు పారిటీలో నెంబర్ వన్ రౌడీ అటండి.

ఆదివారకు అడి కెలాటి పేరున్నా- ఆ తరవాత మనకొచ్చిన పేరేటంటే నండి- మనం పగలూ- రేత్తిరీ కూడా పులివేసనండి.

మన పేరు మాట అలా ఒగ్గీయండి. కోడిగాడి సెయ్యిరిసీ సేక కాళ్ల ముడుసుకొని తొంగుంటే లాబంలేదు గాదండీ - మరంచేత బయలెల్లినావండి- సిటీ- నానూ మా బాబును. తీసేసుకొని రంగనాదం బాబింటి కెళ్లినావండి.

కదంతా సెప్పినాం ఆ బాబుకీ- ఆత గోడి సెల్లికి గూడా.

అంతా యిన్నాక "మీ పారిటీవోళ్ళలో తెలివైన ఆడోళ్ళవి ఆరు పేర్లు సెప్పమన్నాదండి ఆయమ్మ.

"యిదేటిదీ" పోలీసు రిపోర్టు రాయమంటే ఆడోళ్ళ పేర్లడుగుతున్నాదీ;" అనుకున్నానండి.

బుల్లిబాబుగోరే జెప్పనాడండి - ఆరు గాదు- పదిమంది పేర్లు.

పేర్లు యిన్నాదండి. యిన్నాక

"నాకాక్కావలిసింది- మామూలు తెలివితేట లున్నోళ్లు కాదు - మొగుడ్ని అమ్మీసీ రకాలై ఉండాలి" అన్నాదండాయమ్మ.

ఈళ్లు మొగుడ్ని- రంకుమొగుడుకి అమ్మీసీరకం" అన్నాడండి మా బాబు.

"భేషో" అన్నాదండి తొల్త.

తరవాత "దెబ్బలాట- దెబ్బలాటేటి నా మొకం- సుట్ట కాసులుకుండీవోడి సెయ్యిరిసీడం దెబ్బలాటెలాగౌద్ది? సరే- యీ సెయ్యిరిసీడం ఎక్కాడ జరిగినాది? ఆ యీది మనదా? అవతల పారిటీ వోళ్లదా?" అనడిగానండి.

"మనోళ్లూ ఉన్నారు. ఆళ్లూ ఉన్నారు" అన్నాడండి మా బాబు.

"అలాగైతే "సీను" (SCENE) "షిప్టు" (SHIFT) సెయ్యాక్కార్నే దన్నాదండి. అవి ఆలోసెన్లో పడిపోనా దండి. కాని కురిసీలో కూకోలేదండి- హాల్లో పచార్లుసెయ్యడం ఆరంబించి నాదండి.

మా బాబూ, రంగనాదంబాబూ ఏవో కబుర్లు సెప్పుకుంటున్నారండి.

సెయ్యిరిసీసినందుకు ఏడాదేస్తారా- మూడేళ్లా అవి ఆలోసెన్లో పడిపోవానండి నాను.

ఈ లోగా ఎప్పుడు తీసినాదోనండి టేబిలుమీది రూళ్ళకర్ర- మావుం ఎవరం సూడ్నేదండి- దాంతో మా బాబు భుజంమీద ఒక్కాటేసిందండి.

ముండకోసరం బ్రోతలు కెత్తే అక్కాడ పెళ్ళాం అగుపించినట్టు- మా బాబు కెవ్వున ఒక్కారుపు అరిసినాడండి.

ఆయమ్మ- సరస్వతల్లి నెమిలి పిట్టెక్కి- పోయినట్టు- కురిసీ ఎక్కి- పోనాదండి.

ఎక్కి- తాపీగా ఓ సిన్న నవ్వు నవ్వెందండి.

నవ్వి, "మరేంనేదు ఆ కోడిగాడు మీ బుర్రమీద దెబ్బ ఎయ్యబోయేడు. మీరు తప్పించుకున్నారు. కాని దెబ్బ బుజంమీద తగిల్నాది. అడు మరో సారి మీ బుర్రమీద దెబ్బ ఎయ్యబోతూ వుంటే కెప్టెనుగోడు అడ్ని కొట్టినాడు. అంతే. సెల్ఫ్ డిఫెన్సు" అన్నాదండి.

రంగనాదంబాబూ, మాబాబూ అలా- బొమ్మల్లా గుండిపోవారండి- అయమ్మ ఆలోసెనకి- ఆళ్లంతా ఉండగానే ఆ- యమ్మే మళ్ళీ అన్నాదండి. "ఇప్పుడు డాక్టరుకాడి కెళ్ళి దెబ్బకి సర్టిపికెటు అట్టుకురండి. యెళ్లీముందు అవతల పారిటీ ఆదోళ్లని- మొగుడికాడ తొంగోడంగూడా- తెలనివాళ్ళవి- ఓ నాలుగు పేర్లు సెప్పండి. ఆళ్లనికూడా సాచ్చీకం ఏద్దాం" అందండి.

"ఆళ్లు మనికి సెప్పరే" అన్నాడండి మా బాబు.

"ఏంవో. ఆదోళ్లు నీళ్లు తెచ్చుకునీ టయాం -మొగోళ్ళెవరూ యింకా ఇళ్ళకి రానేదు, యిది జరిగీ టయాంకి. మరింక జూసినోళ్ళంతా ఆదోళ్ళే. జూసి

నోళ్ళందర్నీ సాచ్చీకం ఏసుకున్నాం. అందులో అళ్ళ అడోళ్ళుకూడా ఉన్నారు. నిజెం సెప్తారనే యేసుకున్నాం. అళ్ళు అవతల పారిటీవోళ్ళతో కుమ్మక్కు అయిపోయి నిజెం సెప్పక పోతే మాఁవేఁటి సేస్తాం?

సత్తెం మాపక్కున్నాది

ఇప్పుడాళ్ళు కాదంటే మిగతావోళ్ళు కూడా సూసినోళ్ళు ఉన్నారు కదా. అళ్ళని నమ్మండి అని అర్గుమెంటు సెప్తాం. సాచ్చీకం అంతా ఆడోళ్ళే కాబట్టి కోరటు నమ్మేస్తాది." అన్నారండి.

ఈ తికమక ఏఁటో నాకు అరదం గాకముందే మిగతావోళ్లు "వహ్వా" అన్నారండి.

"అంతే గాదు. అవతలి ప్లీడరు సుందర్రామం. ఆడు అడదెయ్యాం అగుపడితే పక్కలోకి రమ్మనీ రకం. కాని అడసాచ్చి అంటే అడిలి సస్తాడు. ఆడు జూనియర్ గా ఉన్నప్పుడు అడికో నొంత కేసుండీది.

కాణీదీ- పరకదీ కాదు.

పదెకరాలది.

అడి కేసు నిజం.

అడమ్మ సాచ్చీకంమాత్తరం అబద్దం.

ఆవిడ కోర్టులో గాబరాపడిపోయి - ఒక్కముక్క కూడా నిజెం సెప్పలేకపోనాది.

కేసు సంకనాకిపోనాది.

మరప్పట్నుంచీ అడు అన్నం మానీ మన్నా మానెస్తాడు గాని, అడ సాచ్చిని టోన్లో ఎట్టడు. అంతా మొగోళ్ళనే ఏసుకుంటాడు. ఆళ్లకి తలలూ, తోకలూ ముడెట్టేసి, మన సాచ్చుల్లో కొంత మందిరన్నా ఉన్నారని వొప్పించినావాఁ యింక జూసుకో- అంతేకాదు కోడిగాడు అప్పుడు తాగీనున్నాడనికూడా తగిలిద్దాం. మరింక మేస్ట్రీగోడ్ని మాఁవాఁ అని పిలవ్వొచ్చు." అని యిదమరిసి సెప్పినాదండి.

"ఇన్నాళ్లూ- ఆచారి, ఆచారి అంటూ ఆ బాబు కాళ్ళట్టుకున్నాను గాని- యీ యమ్మ కాళ్లు అట్టుకోవాల్నంటే- మళ్లీ ఆ బాబు జూనియరే యీ యమ్మ- యిన్ని సట్లు జెయిలు కెళ్ళోడ్ని కాదుగదా- యీ యమ్మ 'తెప్పు కేసు' డీఫెండు జేసిందంటే- కేసుపెట్టిన పోలీసోడ్నే జెయిలుకి కట్టించేసేరకం" అని నాను కానా యిదై పోనానండి.

మాఁవుఁ డాట్టుకాడికి బయలెల్ల పోతూవుంటే ఆ యమ్మే అన్నాదండి "కరుసు అయినా పర్వాలేదు ఆ దెబ్బని కుసింత పెద్దది సెయ్యమని డాట్టు బాబుతో సెప్పండి" అనిహూషారిచ్చిందండి.

"ఆ యమ్మ మాటలు యింటుంటే- యీ యమ్మ ఉండాల్సింది ఢిల్లీలో- కానా పొరపాటు- అమెరికాలో వుండాల్సిన మడిసి - అనిపించీసిందండి నాకు.

మా బాబుతోపాటు నానూ లెగవ బోయేనండి.

కాని "నవ్వండు- ఆ బాబెల్తాడు"

ఇన్నాదండి.

మా బాబెల్లిపోనాదండి.

మా యమ్మ కూకొని రిపోర్టు సెప్తా వుంటే_ రంగనాదం బాబు రాసినాడండి.

యిది పూర్తి అయ్యేసరికి మా బాబొచ్చేసినాడండి. మా బాబు తెచ్చిన సర్టిఫికెట్టు సదువుతూంటే ఆ యమ్మ మొకం_ సేటంతగాదండి_ దాగరంతై పోనాదండి.

"ఈ సర్టిఫికెట్టు సూస్తే అరెల్లు ట్టేస్తాడు ఏ మేస్ట్రైనా నన్ను_ మొత్తా కి మంచి సర్టిఫికెటే పుట్టించేదె గాంది గేరు" అన్నాదండి మా బాబు ఏపు జూ'.

**26**

అవతలోళ్లు యిచ్చినారండి ఓ రిపోర్టు ళ్లు జరిగింది జరిగినట్టు రాసినారండి_ కోడిగాడు మా బాబుమీద సుట్టపోగ దదం తిప్పిస్తే.

అడు అవతలిపారిటీవోళ్ళలో ముఖ్యుడట_ అంచేత అడిమానాన అడు తూవుంటే మా బాబు సెప్తే నాను అడి య్యి సెరుకుముక్కిరిసేసినట్టు యిరి సినానట_

ఇదండి అళ్ల కేసు. కేసులో మా బని కూడా ఇరికించినారండి

పాపం కోడిగాడికి సంక కాడ్నించి టికినేలు వొరకూ_ సిమెంటు కట్టు ట్టేసినాడండి డాట్టు_ అడికి మూణ్నెల్లు టు వొణ్ణం తిండానికీ, యీపు బకురు డానికి ఒకటేనండి సెయ్యి.

నేను ఆ ఊరెళ్ళిన కొరెండ్రోజులకే అడి సెయ్యిరిపేసినానండి. విజానికి మా బాబు నాతో ఎవుడి సెయ్యి కాదు సరి గదా_ ఏలుకూడా యిరవమని సెప్పనే దండి. నాను కూడా అవతలి పారిటీ వాళ్ళ ఏళ్ళు కాదుకదా మెటికలు కూడా యిరుద్దామనుకోనేదండి.

కాని ఏటో అంతా సిటంలో జరిగి పోనాదండి.

ఇంతకీ మనకి పేరొచ్చే యోగం ఉన్నాదండి.

వచ్చేసినాదండి_ అంతే.

మడిసికైనా_ దేవుడికైనా పేరావా లని నాను తొలతే మనివిజేసినానుగదండీ.

మనకొచ్చిన పేరేటంటారా?

అవతల పారిటీ సత్తెరకాయవాడెవ డన్నా సరే_ సుట్టుకొని మా బాబు కంట పడినాడా, అడి సెయ్యిరగ్గొడతాను.

కర్రట్టుకొని అగుపడినాడా అడి కాళ్ళిరగ్గొడతాను.

కీడు తలపెట్టినాడా_ తల తీసేస్తాను. అదండి మనం సంపాయించుకున్న పేరు.

యీ పేరుమీద పదికాలాలు బతికీ వొచ్చు అనిపించేసినాదండి.

అంత పేరొచ్చినాక యింక పన్చే య్యక్కర్నేదండి.

మరైతే_ మన పనేటంటారా?

పొద్దుటేళా_ మాపిటేళా_ ఆ దెయ్యం కుక్కల్ని ఎంటేసుకొని ఊరంతా బలా దూరు తిరగడవండి.

మీ కబద్ధం, నాకు నిజెం గాని– ఊళ్ళో ఎళ్తావుంటే మా పారిటీవోళ్ళ దణ్ణాలందుకోనేక సేతులు పీకెట్టీసీయండి. నా నింకా మర్యాదునోళ్ళణ్ని కాబట్టి అందుకునీవోడనండి– అదే మరోడైతే ఆ మాత్రానికే బుర్ర తిరిగిపోయి, తలెగరీసి పోయీవోడండి.

నాను బీడీముక్క నోట్లో ఎడితే సాలండి– పక్కన ఎవడుంటే ఆడు అగ్గిపుల్ల కొట్టేవోడండి. అలా పెరిగిపోనాది మన పరపతి.

అవతల పారిటీవోడు ఎవడన్నా– మనకి ఎదురైతే దయిర్యం వున్నోడు తల దించుకునీవోడండి. అలా పెరిగిపోనాది మన పరపతి.

లేనోడు తోక ముడిసీసీవోడండి.

యిందాక సన్నాసిగోడు సెప్పినాడు గదండీ– కుక్క కేసూ– పిల్లి కేసూ– పెళ్ళాం కేసూ– ముండ కేసుల్తో ఊరంతా కేసుల్తోనే తగలబడిపోయిందని.

అసలీ కేసులూ, ఆటికయ్యే కరుసూ తలుసుకుంటే గుండె బేజారైపోతాదండి.

అదేటి డబ్బా? నీరా? అన్నట్టు కరుసైపోయిందండి. ఆ కేసులకి ఎట్టిన డబ్బు గనక ఊరుమీద కరుసుపెట్టి వుంటే– బాబూ యిదేటి యిండియానా? అమెరికానా అన్నట్టు ఊరు అయిపోయి ఉండీదండి. కరుసులే టుంటాయంటారా!

కేసుపోయినోడు కోరట్లో ఏడుస్తాడు– గెలిసినోడు యింటికెళ్ళి ఏడుస్తాడు– అని మీరెప్పుడూ యిన్లేదా బాబూ.

కోరటు కెళ్ళాలంటే ముందు ప్లీడరు కాడి కెళ్ళాలి గదండి.

సింతామణికాడ శ్రీహరిలా, ప్లీడరుకో గుమాస్తా ఉంటాడండి.

సింతామణికైనా అరువెట్టొచ్చుగాని, శ్రీహరి ముండకి మాత్తరం "కేష్" యియ్యవాలసిందేనండి.

యిక కోరట్లో గుమాస్తాలండి– యీళ్లలో శానా రకాలుంటారు బాబూ, పేతకానోళ్ళు, కొత్తోళ్ళు అయితే కాఫీ, టిపినుతో కడుపు నిండిపోతాదండి ఆళ్ళకి.

కొందరు ముదర సరుకుంటారు సూడండి బాబూ ఆళ్ళ కడుపులు "కేష్"తో గాని నిండవండి.

యిక పోలీసోళ్ళండి– ఆళ్ళ కడుపులు మనల్ని మన కుటుంబాల్ని మింగీసినా నిండవండి. ఆళ్ళు జెలగల్లా మనల్ని పీలిచేస్తారండి– పొరపాటు బాబూ– జెలగ సుట్ట సూపిస్తే ఒగ్గేస్తాదండి పోలీసోడు మరో సుట్ట యియ్యమంటాడండి.

సెవాన్ని ముట్టుకోదండి జెలగ.

పోలీసోడు శవాన్ని గూడా ఒగ్గడండి.

యీ గుమాస్తాల్ని ప్లీడర్లనీ, డాక్టర్లనీ, పోలీసోళ్ళని– యీళ్ళందర్నీ మేపీసరికి బాబూ– మా ఒళ్ళు, యిల్లు గుల్లయిపోతాదండి.

అదంతే బాబూ.

(సశేషం)

---




“అప్పుడు ఏం జరిగిందంటే....” చుట్టూ చూసింది, పాఠం మధ్యలో ఆపేసి సుజాత.

పిల్లలందరూ ఉత్సాహంతో ఏం చెబుతుందో అని ఎదురుచూస్తున్నారు.

స్కూలు వరండాని అరుణకిరణాలు బంగారంతో దీపితము చేస్తున్నాయి.

“క్షతగాత్రులైన సైనికులకు రక్తదానం చేసి ప్రాణదానం చేసిందామె” అన్నది సుజాత తన్మయత్వంతో.

ఆమె పాఠానికి అంతరాయమే కలిగింది.

“మీకు ఫోను వచ్చింది అమ్మగారు.” బంట్రోతు రంగయ్య అన్నాడు.

అంతలోనే స్కూలుబెల్లు మ్రోగింది.

“నాకు ఫోనుచేసేవారు యెవరు చెప్మా” అనుకొని ఆశ్చర్యంగా ఫోను యెత్తింది.

“హల్లో సుజాతగారా....”

“అవును.... మీరు.... ఎవరండి....”

“నేను బ్లడ్ బ్యాంకు నుండి మాట్లాడుతున్నాను. డాక్టర్ రాంబాబుని.”

“నమస్కారం సార్.”

“నమస్కారం. మీరు ఏమీ అనుకోకపోతే చిన్న రిక్వెస్టు. ఒక పేషెంట్ ప్రాణాపాయంలో వున్నాడు. అతనికి కావలసిన గ్రూపు రక్తం అయిపోయింది. మీ గ్రూపు రక్తం సరిపోతుంది. మీరు నాలుగు రోజులక్రితం యిచ్చిన

బ్లడ్ అయిపోయింది. మీరు ఒకసారి రాగలరా" అన్నాడు ఆతృతగా.

"వస్తానండి" అని ఫోను పెట్టేసింది.

* * *

ఆ రోజు ఆదివారం శలవు సుజాతకు. ఎనిమిది గంటలు కావస్తోంది. కుర్చీలో కూర్చుని పరీక్షపేపర్లు దిద్దుకుంటోంది, సుజాత నీరసంగా.

మూడు రోజుల క్రితమే బ్లడ్‌బ్యాంకుకు రక్తం యివ్వటంవల్ల మరీ నీరసంగా కనిపిస్తోంది.

తలుపు చప్పుడయింది. "మే ఐ కమిన్... " అన్న పదాలు విన్పించాయి. తిప్పేసరికి ఎదురుగా ఆరడుగుల మనిషి. చాలా హుందాగా వున్నాడు.

"సుజాత మవ్వే అనుకుంటానమ్మా." ఆయన గొంతులో ఆప్యాయత కన్పించింది.

"అ.... నేనేనండి... రండి కూర్చోండి" అంది తడబడుతూ, ప్రక్కకు తప్పుకుని.

ఆయన కూర్చున్నారు. గదంతా తేరిపార చూశారు. గోడకు చక్కగా అమర్చబడిన గౌతమబుద్ధుడు, వివేకానంద, ఏసుక్రీస్తు, మహాత్మగాంధీ ఫొటోలు కన్పించాయి. నీటుగా అమర్చిన నాలుగు పేము కుర్చీలు, మధ్య టీపాయిమీదనున్న టేబిల్ క్లాతుపై చేసిన ఎంబ్రాయిడరీ ఆయన్ను ఎంతో ఆకర్షించింది. మూడవ ప్రక్క కుట్టుమిషనువుంది. మూల బల్లమీదనున్న ఫిలిప్స్ ట్రాన్సిస్టరు నుండి వస్తూన్న వీణానాదం గదిలో సన్నగా శ్రావ్యంగా వినిపిస్తోంది.

సుజాత ఆశ్చర్యపడుతోంది, యిలాంటి వ్యక్తిని తను ఇంతకుముందు ఎక్కడా, ఎప్పుడూ చూడలేదని. ఆయన్ను చూస్తుంటే యేదో అనిర్వచనీయమైన భావం కలిగింది ఆమెకు.

"ఇంట్లో యెవరూ లేరా అమ్మా .... అంటే మీనాన్నగారుకాని అమ్మగారుకాని."

"అమ్మగారు చనిపోయారండి. ప్రస్తుతం నేను మాత్రమే వుంటున్నాను. నాకు ఎవరూ లేరు" అంది ఆ కంఠంలో బాధ తొణికిసలాడింది.

"అయ్యో పాపం" అన్నారాయన.

"యింతకీ మీరు యెవరో తెలుసుకోవచ్చా" అంది ప్లాస్కులో నున్న హార్లిక్సు కప్పులోకి వంపుతూ.

"నిన్ను చూస్తుంటే నన్ను నేను పరిచయం చేసుకోవటం మర్చిపోయాను. నా పేరు నీలకంఠం అమ్మా. మూడు రోజుల క్రితం నువ్వు నిలిపిన ప్రాణాన్ని."

సుజాత ఆశ్చర్యపోయింది. ప్రాణదానం చేసేవంటూ కృతజ్ఞతలు చెప్పడానికి రావడం ఆమె జీవితంలో యిదే మొదటిసారి.

ఆమె హృదయంలో సంతోషతరంగాలు ఉవ్వెత్తున లేచాయి. అయితే ఆనాడు హటాత్తుగా వెళ్ళి అసాధారణ

పరిస్థితులలో రక్తంయిచ్చి కాపాడింది ఈయననే అన్నమాట.

"యిందులో నేను చేసింది ఏముంది. మీ గ్రూపుతో నా గ్రూపు బ్లడ్ సరిపో వడం నా అదృష్టం" అంది ఆనందంగా.

నీలకంఠంగారు గంభీరంగా జేబులో చేయిపెట్టి కొత్త పదిరూపాయల నోట్ల కట్ట బయటకు తీశారు.

"ఇందమ్మా ఈ పదివేల రూపాయ లతో నీ ఋణం తీర్చలేననుకో. అయినా నా సంతృప్తికొద్దీ" అంటూనే టీపాయ్ మీద పెట్టారు.

"ముందు ఆ హార్లిక్సు చల్లారి పోతుంది తీసుకోండి" అంటూ ఆ నోట్ల కట్టను తీసుకొని పేజీలు తిరగేసినట్లు తిరగవేసింది

"మీ ప్రాణం విలువ యింతేనా అండీ" అడిగింది సుజాత కిల్లిస్తంగా.

త్రాగుదామని నోటిదాకా తెచ్చిన హార్లిక్సు కప్పుని టీపాయ్‌మీద పెట్టే శారు అచేతనంగా.

"అవునమ్మా నా ప్రాణం విలువ చాలా తక్కువ అంచనా వేశాను. నా ప్రాణం విలువ నువ్వే సరైన అంచనా వేయి. ఇందుకు ఈ బ్యాంకు చెక్కు తీసుకో" అంటూ జేబులోనున్న చెక్కు బుక్కు తీసి సంతకంపెట్టి టీపాయి మీదవుంచి దానిమీద బరువుగా పదివేల రూపాయల కట్ట వుంచేరు.

సుజాత మొహం జేవురించింది. క్షణం యిద్దరిమధ్యా నిశ్శబ్దం. "ప్రాణం రక్షించినందుకు యిలా డబ్బు తీసుకో వడం ప్రారంభిస్తే నేనూ ఈపాటికి చాలా డబ్బు గడించేదాన్ని. నాకు మీరిచ్చే ఈ డబ్బు పతితలు, భ్రష్టులు, దారి ద్ర్యంతో అలమటిస్తున్న అన్నార్తులను ఆదుకొనగలిగితే మీకు సంతృప్తి లభి స్తుందేమో? ఆలోచించండి" అన్నది ఆవేశంతో కూడిన కోపంతో.

"నీకు ఈ నీలకంఠం సంగతి పూర్తిగా తెలియదమ్మా" అన్నాడు అన హనంగా.

మరో క్షణం ఆగి, "విసుగు విరామం లేకుండా జీవితంలో ఒంటరిగా ప్రయా ణం సాగిస్తున్నాను. అడిగినవారికి లేదన కుండా ఎంతోమందిని ఆదుకున్నాను. ఈ దానధర్మాలు నా బంధువులు నా ప్రాణాల్ని రక్షించలేకపోయాయి, నీ రక్తం తప్ప. అందుకనే నా మాట కాదన కమ్మా. ఈ నా చిన్న కోర్కె తీర్చు. నాకు సంతృప్తిని కలిగించు" అన్నాడు ప్రాధేయపూర్వకంగా.

నీలకంఠం ఆమెనే చూస్తున్నారు యిదివరకు యెక్కడో చూసినట్టు గుర్తు. కాని జ్ఞాపకం రావటంలేదు.

ఒకసారి మీదకు చూశారు. ఆయన ఆలోచనలు మీదన తిరుగుతున్న సీలింగు ఫేనుతో పోటీ పడుతున్నాయి

"మీకూ ఈ సుజాత సంగతి తెలియ దండి. ఇందులో వుండే తృప్తిని డబ్బు




జయించలేదు. నా ఈ ఆశయానికి గమ్యస్థానం లేదు." అంది దృఢంగా.

నీలకంఠం అ[illegible]ఖులయ్యారు.

"నిండా యిరవై వసంతాలైనా నిండని నీ జీవితంలో యిటువంటి రక్తదానం చేయటంలో సంపాదించుకున్న ఆత్మతృప్తి ఏమిటో నేను తెలుసుకోవచ్చా" ప్రశ్నించాడు.

అతనికి ఆమెపట్ల వొక విధమైన ఆప్యాయత పెరుగుతోంది, గౌరవంతో పాటు.

చిత్ర విచిత్రమైన మానసిక ప్రవృత్తులు కలిగినటువంటి ఈ మానవ సమాజంలో యిటువంటి మనస్తత్వంగల అమ్మాయి తటస్థపడడం మొదటిసారి నీలకంఠం జీవితంలో.

"తెల్పుకోవటంవల్ల మీకు ఆనందం కలగదు, అయినా మీరు వినాలంటే చెబుతాను."

"ఆనందం పంచుకోకపోయినా నీ వేదనని పంచుకొనే తృప్తిఅయినా మిగలనీ" అన్నారు ఆప్యాయతగా ఆమెవైపు చూస్తూ.

* * *

అర్ధరాత్రి. హాస్పిటల్లో ఎమర్జన్సీ వార్డు హడావుడిగా వుంది. స్ట్రెచ్చర్ మీద సుజాత తల్లిని లోపలికి తీసికెళ్ళారు. ఆమె తలనిండా కట్లు. కట్లను

తెంచుకొని బయటికి రావాలనుకున్న రక్తం రాలేకపోతోంది.

కట్టిన బట్టలు పెళ్ళివారికి అందజేయాలని, ఆ వచ్చే డబ్బుతో సుజాత పరీక్ష ఫీజు కట్టాలన్న తపనతో తొందరగా వెళ్తున్న సుజాత తల్లిని ఓ కారు గుద్దేసింది. కారు ఆమెకి తెలియలేదు. రోడ్డుమీద వున్నవాళ్ళు ఆసుపత్రిలో చేర్చారు. అందులో ఒకరు ఈ కబురు సుజాతకు అందజేశారు.

ఆమె ప్రాణంతో చాలాసేపు పోరాడిన డాక్టర్లకు ఆమె బ్లడ్ గ్రూపు రక్తం కావలసివచ్చింది. హాస్పిటల్లో ఆ గ్రూపు లేదు. "పోనీ నా రక్తం తీసుకుని తల్లిని బ్రతికించండి డాక్టర్" అంది సుజాత. అప్పటికి ఆమెకు పదహారు సంవత్సరాలకన్నా ఎక్కువ వుండవు.

తన రక్తం ఎప్పుడు సరిపోదని డాక్టర్లు చెప్పారో వెంటనే తను వుండే వీధిలో అందర్నీ రక్తం ఇచ్చి తన తల్లి ప్రాణం కాపాడమని పేరుపేరునా అడిగింది. ప్రార్థించింది.

కానీ ఎవరూ ముందుకు రాలేదు.

"చెడిపోయిన ఆడదానికి మీ రక్తం ఎందుకు యిస్తారండీ" అన్నారు కొందరమ్మలక్కలు ముందుకొచ్చిన మగాళ్ళను. కాళ్ళా,వేళ్ళా పడి బ్రతిమాలింది. సుజాత. ప్రార్థించింది, కానీ సమాజం మనసు కరగలేదు.

చరిత్ర తిరగవేస్తే బాధాదగ్ధ హృదయాలకు యేనాడు సానుభూతిని పంచింది యీ సమాజం ....

అలాగ ఆమె తల్లిని పోగొట్టుకుంది. తను అనాధగా మిగిలిపోయింది.

ఏ రక్తం కోసమయితే తన తల్లి ప్రాణాలు అలమటించి, ఆక్రోశించి అంతిమశ్వాసలు విడిచి తనను అనాధను చేసి విడచేయో అటువంటివారి ప్రాణాలను కాపాడి వారి సంతానం అనాధలు కాకూడదని, తన వొంట్లో శక్తి ఉన్నంతవరకు, తన రక్తం సమాజ సంక్షేమానికి ఉపయోగపడితే తన జీవితం చరితార్థమవటమేకాక తన తల్లి ఆత్మకు శాంతి లభిస్తుందన్న ఆశతో ఈ నిర్ణయం తీసుకుంది సుజాత.

• • •

ఇద్దరిమధ్యా బరువైన నిశ్శబ్దం ఆవరించింది. కథ చెప్పడం ముగించిన సుజాత కళ్ళనుండి కన్నీటి ముత్యాలు యెఱ్ఱని బుగ్గలమీద జాలువారుతున్నాయి.

నీలకంఠం చలించిపోయాడు. దగ్గరగా వచ్చి ఆమె కన్నీటిని తుడిచేడు.

ఆ స్పర్శ ఆమెకు ఎంతో ఉపశమనం కల్గించింది ఇద్దరి మధ్యా ఏదో భాషకందని అనుబంధం బలవత్తరంగా పేనుకుపోతోంది.

"అయితే సుజాతా నువ్వు నాదగ్గర కొచ్చి వుండమ్మా. నా కన్నకూతురులాంటిదానివి" అన్నాడు. ఆ గొంతులో ఆర్ద్రత చిందులాడింది.

"వద్దండి. మీ అభిమానానికి చాలా కృతజ్ఞురాలను. కాని కాలుష్యంతో కాలుతున్న ఈ సమాజంలో ఒంటరిగా ఎలా బ్రతకాలో నాకు నేర్పింది మా అమ్మ" అంది. ఆమె కంఠంలో పట్టుదల తొంగిచూసింది.

ఏరేం ఆలోచించలేకపోయారు, నీలకంఠం. శూన్యమైపోయిన అతని మస్తిష్కంలో ఆమె జీవితాన్ని మలిచిన అమృతమూర్తిని చూడాలన్న కోరిక కలిగింది.

"నీకు అభ్యంతరం లేకపోతే నిన్ను యింత వున్నతంగా మలచిన నీ మాతృమూర్తిని చూడాలని వుంది."

నిశ్శబ్దంగా లేచి గదిలోకి వెళ్ళి ఆల్బమ్ తీసుకొచ్చి ఆయన చేతిలో వుంచింది సుజాత.

తెరవగానే ఆల్బమ్‌లోవున్న ఫొటోను చూడగానే అతని నవనాడులు కృంగిపోయాయి.

భూప్రదక్షణం ఆగిపోయిందా అనిపించింది.

అదే నవ్వు. చాలా సంవత్సరాల క్రితం తనని వశపరచుకున్న నవ్వు. తాను యింతకాలం గుండెల్లో దాచుకొని ఆ నవ్వుతో బ్రతుకుతున్న నవ్వు! ఇన్నేళ్ళకుమళ్ళీకన్పించేసరికిచలించిపోయాడు.

"నన్ను, ప్రేమించి నా జీవితాన్ని అనుభవించి అంతస్తు లేదనీ, మతం లేదనీ, హీనకులమనీ పెళ్ళికి నీ వాళ్ళు అభ్యంతరం పెట్టేసరికి, ఆ పద్మవ్యూహం ఛేదించలేనంత బలహీనుడవై పారిపోయావు. నీ ప్రతిరూపాన్ని భరిస్తున్న నన్ను విడిచి నా ప్రేమకు, కళ్ళంలేని కోరికలకు, నా హీనకులం అంతస్థూ, ఏదీ అడ్డురాలేదు. నమ్మకద్రోహంచేసిన నేరానికి శిక్షలేకుండా తప్పించుకున్నావు. నిన్ను నమ్ముకున్న విశ్వాసానికి, చేయని నేరానికి దారుణంగా అనుభవించాను శిక్ష. చెడిపోయిన ఆడదని చెరిగిపోని ముద్ర పడిపోయింది, నా జీవితంమీద. కానీ యివాళ నా కూతురు రక్తం నీ శరీరంలో అణువణువునా ఆక్రమించి శ్వాస పీలుస్తోంది. ఎక్కడికి పారిపోగలవు యిప్పుడు చెప్పు. నీ కులం యేమిటి? నీ మతం ఏమిటి? నీ అంతస్థు యేమిటి? కులట కూతురి రక్తం వుందని చచ్చిపోతావా? చెప్పు. చెప్పు..." ఆ నవ్వులో జవాబివ్వలేని ప్రశ్నలు ప్రతిధ్వనిస్తున్నాయి, దిక్కులంతటా.

ఈసారి పారిపోలేదు పిరికివాడిలా నీలకంఠం. నెమ్మదిగా లేచి సుజాతను దగ్గరగా తీసుకుని నుదుట ముద్దుపెట్టుకున్నారు, వాత్సల్యం, మమతలు నిండిన నిండుగు డెలతో.

# బ్రతుకు బరువు




వీరరాజు

ఆ అడవిలాంటి ప్రదేశంలో శ్రీహరి ఎంభై నిమిషాలనుంచీ నించుని వున్నాడు.

చుట్టూ ఎత్తైన నల్లని కొండలు. రోడ్డుకిరువైపులా పటాలుగా రాజ్యాన్ని కాపలా కాసే సైనికుల్లా నిలబడున్న చెట్లు తప్ప అక్కడింకేమీ కానరావడం లేదు

ఆ ప్రదేశం జాతీయ రహదారికి వున్న లింకురోడ్డులో పట్టణానికి ముప్పై అయిదు కిలోమీటర్ల దూరంలో వుంది.

శ్రీహరి సినిమా నటుడు, రచయిత, నిర్మాత. అతనికో అలవాటుంది—అతని కథకు మంచి ప్లాట్ కావలసినప్పుడు, షూటింగు జరుపుకోవడానికి అనువైన లొకేషన్స్ ఎన్నుకోవాలసి వచ్చినపుడు ఒక్కడే కారేసుకుని డ్రైవ్ చేసుకుంటూ తనకిష్టమైనంత సేపు యిక్కడ అక్కడ అనకుండా తిరుగుతూంటాడు.

ఆరోజు కూడ అతనలాగే బయలుదేరాడు. అయితే దురదృష్టవశాత్తు

రేడియేటర్‌లో నీళ్లు అయిపోవడంతో ఆ నిర్జన ప్రదేశంలో వంటరిగా నిలబడవలసొచ్చింది. నీళ్ల డబ్బాలో నీళ్లున్నవీ లేనిదీ ముందుగా చూసుకోని తన నిర్లక్ష్యానికి తనను తన అసిస్టెంట్లును కసిదీరా తిట్టుకున్నాడు.

ఆ ప్రదేశంలో ఎక్కడా నీటిచుక్క వున్న జాడేమీ కన్పించకపోవడంతో వుసూరుమంటూ కారుని రోడ్డుప్రక్క ఆపి దాన్నానుకుని సిగరెట్ కాలుస్తూ నించున్నాడు.

అరగంట గడిచినా అటువైపు ఒక్క వాహనం గానీ, మనిషిగానీ రాకపోవడంతో అతనిలో ఓ రకమైన ఆందోళన, కొద్దిపాటి భయం బయలుదేరాయి.

వెంట తెచ్చుకున్న సిగరెట్ పేకెట్‌లోని సిగరెట్లు కూడా అయిపోయాయి. అప్పుడు సాయంత్రం ఆరుగంటలైంది. పశ్చిమాద్రిన సూరీడు డ్యూటీ దిగిపోవడానికి తొందరపడుతున్నాడు.

శ్రీహరి చూపు సడన్‌గా నిల్చిపోయింది.

దూరంగా రెండు ఆకారాలు.... యిటే వస్తున్నాయి.

శ్రీహరిలో చచ్చిపోతున్న ఆశ చిగురించింది.

ఆ ఆకారాలు యింకొంచెం దగ్గరకొచ్చేయి....

ఓ ముసిలాడు- అతని వెంట ఓ పదేళ్ళ కుర్రాడు.

యిప్పుడు ఆ రెండు బక్కచిక్కిన శరీరాలు అతనికి ఎదురుగా వున్నాయ్. శ్రీహరి కళ్లకు వాళ్లిద్దరూ వరాలిచ్చే దేవుళ్లా కనబడ్డారు.

ముఖమంతా ముడతలుపడిపోయి, కళ్లు లోతుకుపోయి గడ్డం పెరిగిపోయి సంస్కారం లేని తెల్లని పీచులాంటి జుట్టుతో అసహ్యంగా వున్నాడు ముసిలాడు. ఒంటిమీద చిన్న తుండుగుడ్డ తప్పితే యింకేమీ లేదు కాళ్లూ, చేతులూ ములక్కాడల్లా వ్రేలాడుతున్నాయ్. ఎడమచేయి ఓ పొడుగాటి కర్రను ఆధారం చేసుకుంటే కుడిచేయి పిల్లాడి భుజాన్ని ఆశ్రయించింది.

పిల్లాడి ఒంటిమీద చిన్న గోచీ మాత్రమే వుంది.

వాళ్ళిద్దర్నీ చూసిన శ్రీహరి అసహ్యించుకోలేదు

"తాతా! ఈ దరిదాపుల్లో నీళ్లు ఎక్కడైనా దొరుకుతాయా?" ఎంతో ఆశగా అడిగాడు.

తాత-"అబ్బో ఈడెక్కడ దొరుకుతాయ్ బాబూ-నీళ్ళకి నాల్గుకోసుల దూరం పోవాలి" అన్నాడు నీళ్లు తీసుకురావడం సామాన్యమైన విషయం కానట్టు.

శ్రీహరికి ఆ దూరం ఎంతో తెలీదు కానీ అతనికి అర్జెంటుగా నీళ్లు కావాలి.

"కొంచెం నువ్వెళ్లి తీసుకురాగలవా తాతా! నీళ్లు లేక కారాగిపోయింది. యిక్కడ చాలా సేపట్నుంచి

నుంచున్నాను"—శ్రీహరి గొంతులో అజ్ఞలేదు ఆతృత వుంది-అర్థింపు వుంది.

"నీళ్ల తేవానికి మికా దేటున్నాది ?" తాత అడిగాడు.

"యిదిగో నీళ్ల డబ్బా" తీసిచ్చాడు.

"ఒరేయ్ బుడ్డోడా ! లగెత్తుకెళ్లి దీన్నిండా నీళ్లుకొాచ్చెయ్" తాత డబ్బా పిల్లాడి చేతికిస్తూ అన్నాడు.

బుడ్డోడు పరిగెత్తాడు.

వెళ్లిపోతున్న బుడ్డోడ్ని చూసి, "బేగి రావాలి" అన్నాడు తాత కొంచెం గొంతు పెంచి.

* * *

శ్రీహరి-అతనెదురుగా తాత.

పిల్లాడు వెళ్లి పదినిముషాలు గడిచాయి. వాడింకా రాలేదు శ్రీహరికి బోర్ కొడుతోంది.

అతనికి తాతతో నాల్గుమాటలు మాట్లాడాలనిపించింది.

"తాతా ! నీ పేరేమిటి ?"

"సిమ్హాద్రి బాబూ !"

"ఆ పిల్లాడు నీ కొడుకా ?" శ్రీహరి.

"నేదు బాబూ ! మనవడు" తాత చెప్పాడు.

"మరి వాడి తల్లీ, తండ్రిలేడా." మళ్ళీ శ్రీహరి అడిగాడు

"నేరుబాబూ ! ఆనయ్య ఏనాడో సచ్చిపోనాడు. ఆడికమ్మ వుండీ లేనట్టే.." నెమ్మదిగా అన్నాడు తాత.

"అదేం ?"

"వదిలేసి ఎల్లిపోనాది బాబూ !" దిగులుగా అన్నాడు తాత.

"ఎందుకని ?" శ్రీహరి గొంతులో తాత గురించి వివరాలు తెలుసుకోవాలన్న వుత్సాహం కనబడింది.

తాత చెప్పాడు- "బాబూ ! ఏటి సెప్పాల ? నోకం అన్నేయం మీదనే నడత్తోంది. ఆడిబాబు అంటే నా కొడుకు అప్పన్నగోడు బతికున్న రోజుల్లో ఆడు, ఆడిపెళ్ళాం ఎంతో యిదిగా వుండేవోరు. కానీ దిక్కుమాలిన సచ్చినోళ్ళు దానందం సూసి కన్నుకుట్టి దాన్ని పాడు సెయ్యాలని సూసారు యిషయం తెలుసుకున్న నా బిడ్డడు వుండబట్నేక, అళ్లం దరిమీద తిరగొడ్డాడు. అళ్లంతా ఒకటైపోయి ఓ రాత్రేల సముద్రం మీదికి సేపలట్టడానికి ఎల్లిన నా బిడ్డని నావతో పాటే సముద్రంలో ముంచి సంపేశారు. 'ఏందిరా ఈ గోరం'? అంటే-అది నావ సుడిగుండంలో సిక్కుకుపోనాదని, ఎంత పెయత్నించినా నాబం నేకపోయిందని అందుకే ఆడు సచ్చిపోనాడని తీరుపు సెప్పారు ..సూసావాబాబూ అన్నేయం?" తాత గొంతులో బాధ... కళ్లల్లో నీరు.

"మరి నీ కోడలేమైంది తాతా ?" శ్రీహరి అడిగాడు.

ఆ మాటకు తాతలో ఆవేశం పెల్లుబికింది. . అయినా తమాయించుకుని "కండకారవవెక్కి ముండది నెగిసిపోనాది. సిత్రం ఏటంటే బాబూ ఒవుడయితే దీని

 

మొగుణ్ని సంపేసాదో అద్నే యిది వుంచుకున్నాది. 'ఏటే యిది' అనడిగితే 'అదే ఆడికి నష్టపరిహారం' అంది.

శ్రీహరిలో రచయిత మేల్కొన్నాడు. అతని బుర్రలో ఆలోచన తళుక్కు మంది.

తాత చెప్పిన కథ అతని బుర్రలో వేగంగా తిరుగుతోంది.

"యిదిగో తాతా" వగర్చుకుంటూ నీళ్ల డబ్బాని అందించాడు పిల్లాడు. ఆ డబ్బా క్షణాల్లో చేతులుమారి, దానిలోని నీళ్ళు రేడియేటర్‌లోకి వెళ్లిపోయాయి. కారు స్టార్టయింది.

శ్రీహరి జేబులు తడుముకున్నాడు. నోట్లు తప్పించి చిల్లర కనబడలేదు.

కారులోపల కూర్చుని గట్టిగా తలు పేసుకున్నాడు.

ఒక్క నిమిషంలో కారు వేగంగా దూసుకుపోయింది - అక్కడున్నవాళ్ల మొహాలమీద దుమ్ము కొడుతూ.

"పెద్దోళ్లు" గట్టిగా నిట్టూరుస్తూ అనుకున్నాడు సింహాద్రితాత.

• •

రచయిత, నటుడు, నిర్మాత శ్రీహరికి ఘనంగా పౌరసన్మానం జరుగుతోంది.

అతను రచించి నిర్మించిన 'పేదల బతుకులు' అత్యంత ప్రజాదరణ పొందడమే కాకుండా రాష్ట్రప్రభుత్వ బహుమతిని కూడా గెల్చుకుంది.

అందంగా అలంకరించబడిన వేదిక మీదికి ప్రముఖులు ఒక్కొక్కరే వచ్చి శ్రీహరిని పుష్పమాలాంకృతుణ్ని చేసి, అతన్ని, అతను నిర్మించిన చిత్రాన్నీ పొగిడి వెళ్లిపోతున్నారు.

ఆ సన్మానానికి అధ్యక్షత వహించిన ముఖ్యమంత్రిగారు "శ్రీహరి నట, నిర్మాతగానే అందరికీ తెలుసు కానీ ఆయన మహారచయిత అని ఆయన రచించి నిర్మించిన ఈ చిత్రమే చెబుతోంది. ముఖ్యంగా అట్టడుగున వున్న పేదల బ్రతుకుల్ని- వాళ్ళ సాధక బాధల్ని కడు రమ్యంగా రచించి చిత్రించిన శ్రీహరిగార్ని మీ అందరి తరఫున సన్మానించడం నా అదృష్టంగా భావిస్తున్నాను" అంటూ సెలవు తీసుకున్నారు.

ఆఖరిగా శ్రీహరి మైకు దగ్గరకొచ్చి "పెద్దలందరూ నా గురించి ఎక్కువగానే మాట్లాడారు. వాళ్ళందరికీ నా కృతజ్ఞతలు. నా గురించి నేను చెప్పుకునేదేమీ లేదు. అయితే ఒక్కమాట సవినయంగా మనవి చేసుకుంటున్నాను. ఈ చిత్రం ప్రత్యేకంగా పేదల సాధకబాధల్ని చాటిచెప్పుతోంది. మన దేశంలో పాతుకుపోయిన ఈ పేదరికాన్ని నిర్మూలించాలంటే- ధనికులంతా ముందుకు రావాలి. పేదలకు అండదండగా నిలవాలి.... ఇకపోతే యిలాంటి చిత్రాలు యింకా ఎక్కువ వచ్చి ప్రజల్లో చైతన్యం కలిగించాలని మనస్ఫూర్తిగా కోరుకుంటున్నాను. చిన్నవాణ్నయిన నన్ను మీరెప్పటిలాగనే

అభిమానించాలని- మీ ఆదరాభిమానాలు కాపాడుకోవడానికి నేనెప్పుడూ కృషి చేస్తుంటానని చెప్తూ వినయంగా సెలవు తీసుకుంటున్నాను" అన్నాడు.

* * *

సిమ్మాద్రి తాత గుంపులో నించుని వున్నాడు.

అతనికి ఆ గొంతు ఎప్పుడో ఎక్కడో విన్నట్టుంది.

మనవడి భుజంమీద చేయివేసి ముందుకునడుస్తున్నాడు. జనంలో ఇప్పుడు మాట్లాడిన మనిషిని చూడాలని అతని కెంతో ఆతృతగా వుంది.

జనం ఉన్మేషిస్తున్నారు.

ఇసక వేస్తే రాలనంత జనం. జనం రాపిడిలో తొక్కిసలాటలో ఎవరెటు పోతున్నారో ఎవరికీ తెలీడంలేదు.

పోలీసులు ఎంతో బందోబస్తుతో మంత్రుల్ని, నటుల్ని, కార్లవరకూ తీసుకెళ్తున్నారు. అయినా సరే జనాన్ని కంట్రోలు చేయలేకపోతున్నారు. కార్ల చుట్టూ చేరిన జనం శ్రీహరిని దగ్గరగా చూడాలని తెగ తాపత్రయపడి పోతున్నారు.

పోలీసులు లాటీ ఉపయోగించి ప్రజల్ని దూరంగానెట్టేస్తున్నారు. లాటీలు గాల్లో విన్యాసం చేస్తున్నాయ్.... ఓ లాటీ వచ్చి 'టపీ' మని సిమ్మాద్రి తలమీద పడింది.

అతని తల తిరిగినట్టయింది. కళ్లు బైర్లుకమ్మాయి. కాళ్ళు తేలిపోతున్నాయి పిల్లాడు జనంలో ఎటు కలిసి పోయాడో తెలీదు.

అకస్మాత్తుకి స్పృహ తప్పినట్టయింది.

నేలమీద పడిపోయాడు... పైనుంచి జనం తొక్కుకుంటూ పోతున్నారు. ఎముకలు పటపట మంటున్నాయి .... ఒళ్ళు హూనమైపోయింది. అరవడానికి గొంతు పెగల్లేదు....

పదిహేను నిముషాల్లో కార్లన్నీ వెళ్ళి పోయాయి. జనమంతా చెల్లాచెదరై పోయారు.

అప్పటివరకూ తిరనాళ్ళలా ఎంతో సందడిగా వున్న ఆ ప్రదేశం నిమిషాల్లో శ్మశానవాటికలా అయిపోయింది.

సిమ్మాద్రి తాత పెల్లకిలా పడున్నాడు.

అతని గుండెలు ఎగిసెగసి పడుతున్నాయి. నోట్లోంచి రక్తం కారుతోంది. కళ్లల్లోంచి నీరు ధారగా ప్రవహిస్తోంది. ఆయాసంలో గట్టిగా మూల్గుతున్నాడు.

పరిగెత్తుకొచ్చిన మనుమడు తాత ఎక్కనే భయంగా చూస్తూ కూర్చుని వున్నాడు.

తాత ఒక్కసారి మనుమడి మొహం లోకి ఆశగా చూశాడు. ఏదో చెప్పాలని నోరువిప్పాడు... గొంతులోంచి మాట రాలేదు. పిల్లాడి చేయిమీద చేయివేసాడు. పిల్లాడు ఏడుస్తున్నాడు. గుప్పెళ్ళు గట్టిగా బిగుసుకుని ఒక్కసారివదులై పోయాయి.



చేతిలోవున్ననాలుగైదు చిల్లరపైసలు నేల మీద దొర్లుకుంటూపోయాయి. మరుక్షణం 'తాతా' అన్న మనుమడి ఆర్తనాదం సహాయం అందనంత దూరం వెళ్ళింది.

తాత చెప్పిన కథనే సినిమాగా తీసి లక్షలు గడించుకున్న వైనం శ్రీహరికి గుర్తుందో లేదో తెలీదుగానీ తన చేతిలో ఐదుపైసలు కూడా పెట్టకుండా తన బ్రతుకు ఖరీదుని లక్షల్లో దోచుకున్నాడని తాతకూ తెలీదు. తెలిస్తే...?

పాపం... ఆ ఆత్మ ఏమనుకునేదో? ఏమో?

———



# సీతాలు సింగారం

జీడిగుంట రామచంద్రమూర్తి

"శేషగిరి సీతాల్ని ప్రేమిస్తున్నాడు!"

సుబ్రమణ్యం ఆ మాటలు చెప్పినపుడు ఆశ్చర్యపోయాను. అసలు శేషగిరికి అలాంటి కోరిక కలిగిందని చెబితే – నేనే కాదు – అతన్ని ఎరిగినవాళ్లు ముక్కుమీద వేలేసుకుని మరీ ఆశ్చర్యపోతారు....

అయినా నమ్మక తప్పదు....

ఎందుకంటే సుబ్రమణ్యం చెప్పేడు కనక!....

శేషగిరి వుంటున్న ఇంట్లోనే సుబ్రమణ్యం కూడా – మరో వాటాలో అద్దెకుంటున్నాడు... అతను చాలా నిఖార్సయిన మనిషి.... ఎవరికీ ఎప్పుడూ భయపడడు.. భగవద్గీత చేతిలో పెట్టకపోయినా సరే అంతా నిజమే మాట్లాడుతాడు.

అందుకే శేషగిరిని గురించి అతను చెప్పిన సంగతి. నేను వెంటనే నమ్మవలసి వచ్చింది..

అబ్బాయి, అమ్మాయిని ప్రేమించటం, అప్పై మోజుపడటం అనేవి, వినటానికి సర్వసాధారణమైన విషయాలు!.... అయితే, ఇక్కడ ఆశ్చర్యం కలిగించేదీ, అసాధారణమైనదీ ఏమిటంటే 'శేషగిరి సీతాల్ని ప్రేమించటం!'

శేషగిరి అందగాడు.... అందునా మంచి ఉద్యోగస్థుడు....

నాకు తెలుసు. కాలేజీలో చదివే రోజుల్లో, ఆడపిల్ల కనిపిస్తే చాలు అరమైలు దూరం పారిపోయేవాడు....

'అంతమాత్రంచేత ఇప్పుడు సీతాల్ని ప్రేమించకూడదా?' – అని మీరడగచ్చు....

ప్రేమించకూడదు!.... అంతే!!

ఎందుకంటే – శేషగిరికి రెండేళ్ళ క్రితమే పెళ్లయింది కనక!!

పెళ్లాం మంగతాయారు అందమూ అణకువా కలిగిన మహా ఇల్లాలు. మంగ




తాయారంటే శేషగిరికి ప్రేమ వుంది. పెళ్ళిగే ఆరాధన వుంది ... అన్నింటినీ మించి అంతో ఇంతో భయం వుంది. పెళ్లాం ఎదురుగా వుంటే అతను సిగరెట్టు కాల్చడు. ఖర్మకాలి ఎప్పుడైనా మందు కొట్టవలసివస్తే ఆ రోజు రెండో ఆట సినిమా కూడా చూసిగానీ ఇంటికెళ్ళడు... భార్యంటే అంత భయం!.

అట్లాంటి బుద్ధిమంతుడికి— మరో ఆడపిల్లమీద మనసయిందంటే— ఆ 'మరో ఆడపిల్ల'లో మహత్తరమైనటువంటి అందమో, ఆకర్షణో— మరోటో వుండితీరాలి.

ఓ సారి సీతాల్ని చూశాను....

శేషగిరి దంపతులు, పెళ్ళిరోజు పేరుతో నన్నూ సుబ్రహ్మణ్యాన్నీ మరి కొంతమంది స్నేహితుల్నీ టీపార్టీకి పిలిచేరు.

అదిగో, ఆ టీపార్టీలోనే సీతాలు కనిపించింది

ట్రేలో టిఫెన్లుపెట్టి తీసుకొచ్చి— మా అందరికీ ఇచ్చింది.

అవును!

సీతాలు ఆ ఇంట్లో మనిషి!... కాదు కాదు— పనిపిల్ల!

ఛలాకీతనం ఆమె నడకలోనూ, అమాయకత్వం ఆమె కళ్ళల్లోనూ, దుడుకుతనం ఆమె మాటల్లోనూ కని

పించేయి....

అప్పుడప్పుడే వచ్చివాలుతున్న పచ్చి వయసు- పంజరంలోంచి పారిపోవాలనుకుంటున్న పంచవన్నెల చిలుకలా- విలపిస్తున్నచోట నిలువనియ్యటం లేదు ఆమెను. .

అదీ సీతాలు గురించి ఆ క్షణంలో నేను వేసుకున్న అంచనా.

"సీతాలు ఎలా వుంది బ్రదర్!"- టీపార్టీ అయిపోయిం తర్వాత సుబ్రమణ్యం అడిగేడు నన్ను.

'మారువేషంలో వున్న రాకుమారిలా వుంది!'- అని చెప్పాలనుకున్నాను.

"అంతటి అందగత్తెను పనిమనిషిగా ఇంట్లో పెట్టుకున్న మంగతాయారుగారి ధైర్యాన్ని మెచ్చుకోవటంకంటే- భర్త మీద ఆమెకు గల అపారమైన నమ్మకానికి జోహార్లర్పించాలి!"- అన్నాను.

"నో నో! ఆడవాళ్ళను మగమహారాజులు నమ్మినంత ఈజీగా- మగవాళ్ళను ఆడవారు నమ్మలేరు.. మైండిట్!"- సీరియస్‌గా అన్నాడు సుబ్రమణ్యం.

"అయితే- ఆ ఇంట్లో సీతాలు ఎలా పనిచేయగలుగుతోంది?"- వెంటనే అడిగేను.

"అదో పొట్టికథ! . . చెప్తా విను! ... అందమైన అర్ధాంగి ఇల్లూడిస్తేనూ అంట్లుతోమితేనూ అలసిపోతుందేమోనని నమ్మిన శేషగిరి- 'పనిమనిషిని పెట్టుకొమ్మని, భార్యకు వరం ఇచ్చాడు.... ఆ వెంటనే ఆవిడగారు మాలక్ష్మిని పన్లో పెట్టుకుంది!"-

"మాలక్ష్మి ఎవరూ?"

"సీతాలు మదరు! నోరెట్టుకు బతుకుతుంది... మా వీధిలో పదహారిళ్ళకు అదే పనిమనిషి!"

"సరే పాయింటుకి రా!" అసహనంగా అడిగేను.

"కొన్ని నెలలపాటు మాలక్ష్మే పనిలోకి వచ్చింది.... ఆ తర్వాత దానికి మరో అరడజను ఇళ్ల ఎక్కువయ్యాయట . అన్నింటితోనూ ఎడ్జెస్టుకాలేక కూతురికి కూడా వీళ్ళింట్లో డ్యూటీ వేసింది... ఈ అయిదారు నెలలనించీ సీతాలే వీళ్ళింట్లో పన్లోకి వస్తోంది!"-

"ఇంతకీ పిల్ల మంచిదేనంటావా?"

"చెప్తానుగా, కొంతకాలం ఓపిక పట్టు!" అన్నాడు సుబ్రమణ్యం సీరియస్‌గా ఆలోచిస్తూ.

* * *

కొంతకాలం గడవనే గడిచింది.

కానీ సుబ్రమణ్యం ఏమీ చెప్పలేదు. ఏ రోజుకారోజు 'చెబుతాడేమో' అనుకుంటూ ఎదురుచూస్తున్నాను....

ఓ శనివారం సాయంత్రం-

సంగం టాకీసులో మేట్నీ చూసి బయటకు వస్తూంటే కనిపించేడు.... సుబ్రమణ్యం కాదు.... శేషగిరి!

"హలో... గుడీవినింగ్ గురూ!"- అంటూ దగ్గరకొచ్చేడు.

ఆ మాటా ఈ మాటా చెప్పి-

"మనం మందుకొట్టాలి గురూ!"- అన్నాడు....

ఆశ్చర్యపోయాను.

"ఏం?... మీ ఆవిడ ఊళ్లోలేదా?"- వాళ్లావిడ ఊళ్లోవుంటే శేషగిరి అలాంటి సాహసాలు చేయలేడని నాకు తెలుసు... అందుకే అడిగేను.

"ఎలా అయినా రచయితల బుర్రలు గొప్పవోయ్! ఎదుటి మనిషి మనసుని ఇట్టే పసిగట్టేస్తారు."- హుషారుగా వీపు మీద చరచి పక్కనున్న 'బార్'కి పట్టుకుపోయేడు శేషగిరి.

ఓ రౌండు పూర్తయింది.

"మా ఆవిడ పండక్కి వాళ్లూ రెళ్ళింది... ఎల్లుండి పొద్దున్న వస్తుంది!"- రెండోసారి గ్లాసులో విస్కీ పోస్తూ చెప్పేడు.

"మరి నువ్ వెళ్ళలేదేం?"

"లేదు!"

"ఎందుకనీ?.... శలవు దొరక లేదేమిటీ!"- మళ్లీ అడిగేను.

"కేవలం అదొక్కటే కారణం కాదులే!"

"సీతాలు పన్లోకి వస్తోందా?"

"అబ్బ! . మళ్లీ రైటర్ననిపించు కున్నావ్ గురూ!" నవ్వేస్తూ అన్నాడు శేషగిరి.

కొన్ని క్షణాలు మా ఇద్దరి మధ్య నిశ్శబ్దం . చుట్టూ సభతీర్చిన మందు దేవుళ్లు సృష్టి రహస్యాలు గట్టిగా మాట్లాడుకుంటున్నారు.

"సీతాల్ని నువ్వసలు చూశావా?"- మరికొన్ని క్షణాల తర్వాత అడిగేడు.

"ఆ రోజు మీ ఇంట్లో టీపార్టీనాడు చూశానుగా, బావుంటుంది!",

"యదార్థం చెప్పేవు గురూ!.... నాకు ఇదివరకే పెళ్ళయిపోయింది కానీ- లేకపోతేనా- అసలు సీతాల్నే పెళ్లిచేసు కునేవాణ్ణి!"-

"పనిమనిషినా?"

"అయితేనేం?.... నేను పెళ్లిచేసు కుంటే నా'వైఫ'య్యేదిగా! ... నేనంటే సీతాలుకి ఎంత ప్రేమో తెలుసా?"

"ఎలాగా?"

"మా ఆవిడ ఊళ్లోలేని ఈ వారం రోజులూ- కావాలని మరీ నన్ను రెచ్చ గొట్టేస్తోంది...నా మతి పోతోందనుకో...! ఆ బ్రహ్మదేవుడు పనిమనుషులకు కూడా ఇంతింత అందాలు ఇచ్చేస్తే- దేశం లోని కాపురాలు ఏమైపోతాయోనని బెంగ పడిపోతున్నాను!"- శేషగిరిలోని మందు దేవుడు విజృంభిస్తున్నాడు.

"ఆ పిల్లకి లేని అత్యంతరం నీకు మాత్రం దేనికీ?.... సాహసం చేసెయ్!" మాటవరసకు అలా అన్నానే కానీ, అలాంటిదేదో జరిగేవుంటుందని నాకో పాడుఅనుమానం లేకపోలేదు.

"ధైర్యం చాలటంలేదు గురూ!.... ఒకవేళ నేను చెయ్యి పట్టుకోగానే కేకలు పెట్టి అల్లరిచేసిందనుకో- అప్పుడు నా పరువేంకావాలి! .. ధైర్యంకోసం ఈ వారం రోజుల్నించీ మందుకొడుతూనే వున్నాను... రేపు ఆదివారంగా?.... ఆఫీసు లేదు!.... పొద్దున్న సీతాలు రాగానే సాహసం చేసేస్తాను! ఎల్లుండి నీకు శుభవార్త చెప్తాను! ..." ఆ శుభ వార్తను తలుచుకుంటూ ఉత్సాహంగా గ్లాసులోవున్న మందునంతా ఒక్క గుక్కలో లాగించేసేడు శేషగిరి.

* * *

ఎల్లుండి రానేవచ్చింది...

కానీ శేషగిరి ఎలాంటి శుభవార్తనీ చెప్పనేలేదు. ఏరోజుకారోజు వాళ్ళింటికి వెళ్ళి ఫెయిలయ్యాడో, ప్యాసయ్యాడో తెలుసుకోవాలని అనుకుంటూనే- ఆఫీసు ఇనస్పెక్షను లోపడి అశ్రద్ధచేస్తున్నాను ...

నాలుగోరోజు సాయంత్రం కామత్ హోటల్లో కాఫీ తాగుతూంటే కనిపించేడు

శేషగిరి కాదు- సుబ్రమణ్యం!

"హలో బ్రదర్!"- అంటూ వచ్చి పక్కన కూర్చున్నాడు....

ఆమాటా ఈమాటా అయింతర్వాత-

"పిట్ట వలలో పడింది బ్రదర్!"- అన్నాడు....

అతను చెప్పబోయేదేమిటో అర్థం కాలేదు....

"పిట్టెవరూ?" అడిగేను....

"ఇంకెవరు?.... సీతాలు!"

'అంటే శేషగిరి సాహసయాత్ర ఫలించిందన్నమాట!'- అని మనసులోనే అనుకుంటున్నాను. అంతలో సుబ్రమణ్యం అన్నాడు-

"సీతాల్ని మొన్న ఆదివారం గండిపేట కొట్టుకుపోయాను.... రోజంతా నాతోనే వుండిపోయింది ... పాతిక రూపాయలు రేటు!"-

ప్రతి విషయాన్నీ ఈజీగా తీసుకునే సుబ్రమణ్యం జీవితంలో ఇంతకుముందు ఇలాంటి సాహసాలు ఎన్నో చేసిన సంగతి నాకు తెలుసు.

"అభం శుభం తెలియని ఆడపిల్లని పాడుచేయటం నాకేం నచ్చలేదోయ్!"- నాలోని రచయిత ఆవేశపడ్డాడు.

పకాల్న నవ్వేశాడు సుబ్రమణ్యం.

"అక్కడే నువ్వూ నేనూ పొరపాటు పడ్డాం బ్రదర్! సీతాలు అభం శుభం తెలియని ఆడపిల్ల కాదు.... ఓ వైపు ఇళ్ళల్లో పనిచేస్తూ మరోవైపు ఆ ఇళ్ళల్లోవుండే మగవాళ్ళ 'వీక్నెస్'ను 'క్యాష్'చేసుకోవాలని చూసే డిప్లమేట్! ...ఎందుకో ఆడుగు చెప్తాను!"

"ఎందుకనీ?"- అడిగేను.

"దట్స్ గుడ్... చెప్తా విను!"- సిగరెట్టు వెలిగించుకుని- కాఫీ కొంచెం

సిప్‌చేసి చెప్పటం ప్రారంభించాడు.

"శనివారం సాయంత్రం నేను ఆఫీసునించి ఇంటికి రాగానే, శేషగిరి ఇంట్లోంచి సీతాలు బయటకు రావటం చూసేను .. 'శేషగిరి లేడా?'_ అని అడిగేను...'షేట్లికి వెళ్లా'డని చెప్పింది....

"....శేషు నాతో గండిపేటవస్తావా?"- అని వెంటనే అడిగేశాను.... నావైపు అదోలాచూసి 'ఎందుకూ?'- అంది....

"... ఏముందీ ... అక్కడ కాటేజ్ తీసుకుంటాను. సరదాగా గడిపేద్దాం"- అంటూ మనసులో మాట ధైర్యంగా చెప్పేశాను.. 'నా రేటు పాతిక!' అంది సీతాలు తడుముకోకుండా....

"....కాబట్టి మైడియర్ రైటర్! అందమైన మనిషికి స్వచ్ఛమైన మనసే వుంటుందని రాయక- 'అమాయకంగా కనిపించే కళ్ళవెనకాల దరిద్రబుద్ధులు కూడా వుండచ్చు'నని నీ కథల్లో రాయి!"- భుజంతట్టి మరీ చెప్పేడు సుబ్రమణ్యం.

* * *

ఆ రాత్రి చాలాసేపు నిద్రపట్టలేదు.

ఎన్నెన్నో ఆలోచనలు.... ఆ ఆలోచనలన్నింటిలోనూ సీతాలే చోటుచేసుకుంది....

సీతాలు....!!

"అభం శుభం తెలియని అడపిల్లేమో?"- అనుకున్నాను చాలాకాలం.

'ఇలాంటిదా?'- అనిపించింది.

తన రేటు 'ఇంత' అని బోర్డు కట్టుకున్న సీతాల్ని పొందటం శేషగిరికి మాత్రం కష్టం ఏముంటుందీ? ..

అసలు అతని సాహసయాత్ర ఎంత వరకూ వచ్చిందో?....

రెండురోజుల తర్వాత కోఠీలో శేషగిరి కనిపించేడు.

"నీ ప్రయత్నం ఎంత వరకూ వచ్చింది గురూ!"- అడిగేను.

"పిరికివాడు చేసే ప్రయత్నాలు ఫలించవ్ గురూ!"- ముక్కుమీదకు జారిపోతున్న కళ్ళజోడుని వేలితో పైకి తోసుకుంటూ అన్నాడు.

"మరి క్రితం ఆదివారం అటో ఇటో తేల్చేసుకుంటానన్నావ్ కదూ?"- గుర్తు చేసేను.

"నిజమే! ... కానీ ఆరోజున సీతాలు పన్లోకి రాలేదు.... మర్నాడు మా ఆవిడ వచ్చేసింది!"- నిరాశగా చెప్పేడు.

"ఎందుకనీ?"

"దాని కేరక్టరు మంచిది కాదట.... లాడ్జీలకు పోతూంటుందని మా ఆవిడకి ఎవరో చెప్పేరు.... అంతే!.... ఉద్వాసన చెప్పేసింది!"- అంటూ భారంగా అడుగులేస్తూ సాగిపోయాడు శేషగిరి ...

కానీ-

సీతాలు పన్లోకి రాని ఆదివారంనాడు- గండిపేట గెస్ట్‌హౌస్‌లో పాతికరూపాయలకు ఆమె సింగారాన్ని సుబ్రమణ్యం కొన్నుకున్నాడని తెలిస్తే- శేషగిరికి పిచ్చెక్కిపోయేదేమో!!

———




తలుపు చప్పుడు విని బద్ధకంగా కళ్ళు విప్పాడు నందయ్య. లేవడానికి తటపటాయించే లోపల తలుపులు బద్దలయ్యేలా కొడుతున్నారు అవతల. విసుగ్గా లేచి కిటికీ నుండి చూస్తే.... చీకటి ఇంకా పలచబడలేదు. 'ఈ పెరుగు మామ్మకి అప్పుడే తెల్లారిందా!' అనుకుంటూ లేచాడు. నిద్రకళ్ళతోనే గదంతా వెతగ్గా ఓ మూల ఎక్కడో పాలగిన్నె కనిపించింది. అది పట్టుకొచ్చి తలుపు తీసాడు.

"ఈ వేళింత చీకటికే తెచ్చావేమిటి మామ్మా....!" ఆవులిస్తూ పెరుగుతట్ట సాయంపట్టి అరుగుమీద దింపాడు. తలమీద చుట్టుగుడ్డ పడితే........ వొంగుని పైకి తీసింది పెరుగు తెచ్చి

నామె. ఆమెను చూచి విశ్చేష్టుడయ్యాడు నందయ్య. కళ్ళు నులుముకుని మరీ చూసాడు.

"ఊయాల పెరుగు మామ్మకి ఒంటో బాగోలేదండి.... నన్నట్టికెళ్ళమంది." పెదవులు కొంచెంవిప్పి సన్నగా నవ్వింది. పెరుగుముంత తీసి అతని కిచ్చి అల్యూమినియం గిన్నెతో పాలు రెండుగ్లాసులు కొలిచి పాలగిన్నెలో పోసిందా యువతి. నందయ్య ఆశ్చర్యం నుంచి తేరుకోకుండానే పాలగిన్నె, పెరుగుముంత తీసుకుని లోపలికెళ్ళాడు. కాస్సేపటికి దీపంతో బయటకు వచ్చి డబ్బులు ఆమె చేతికిచ్చి — "పెరుగు మామ్మకి ఏమౌతావు నువ్వు?" అని అడిగాడు దీపంకాంతిలో ఆమెను పరిశీలనగా చూస్తూ — చామనఛాయకి ఎరుపురంగుకి మధ్య వర్ణంగల శరీరం తొలి యవ్వనం సొగసులను భరిస్తోంది. ముఖంలో ఏ భావం వ్యక్తం కావడం లేదు. మరీ విశాలం కాని....కొటుక లేని కళ్ళలో చాంచల్యం రెపరెపలు యింకా చోటుచేసుకోలేదు. అతని మాటకు ఎసి సమాధానం ఇవ్వకుండా బొడ్లోంచి చిన్న గుడ్డసంచి బయటకు తీసి నందయ్య యిచ్చిన డబ్బులు అందులో వేసుకుంది.

"ఇన్నిదివరకు చూసినట్టు లేదు. కొత్తగా తెస్తున్నావని కదూ అన్నావు"? ఆమెను తదేకంగా చూస్తూ అప్రయత్నంగా అడిగాడు.

"కొత్తేటిలెండి. ఇదప్పుడే మూడో వారం. ఆ ఈదిని శివుడిగుడికాడ పోత న్నాను. ఈదరికి రాటంలేదు" తనంత పొడుగుఉన్న పాతగుడ్డని చక్రంలా చుట్టుచుట్టుకుని తలమీద పెట్టుకుంది.

"ఓ సెయ్యేయ్యండే!"

ఏమిటో ఆలోచిస్తున్న నందయ్య ఉలిక్కిపడ్డాడు. పెరుగుతట్ట సాయం పట్టి ఆమె తలమీద పెట్టాడు. తట్ట కొంచెం సర్దుకుని వెనక్కి తిరిగింది. నాలుగడుగులు వేసాక—

"ఇదిగో అమ్మాయ్ నీ పేరేమిటి?"

"అయ్ ఏటండి" వెనక్కి తిరిగింది.

"నీ పేరు...." అన్నాడు కొంచెం బిగ్గరగా

"ఎంకటలచ్మి". నవ్వుతూ చెప్పింది. ఆమె వీధిమలుపు తిరిగేవరకు చూచి లోపలకు వచ్చాడు నందయ్య. తెలతెలవారుతూ ఉంది కాస్సేపు పండుకుందామని మంచం దగ్గరకు వెళ్ళనవాడే హెడ్‌గుమస్తా 'హుకుం' గుర్తొచ్చి గూట్లో పందుంపుల్ల నోటిలో పెట్టుకుని అరుగుమీదకు వచ్చి కూర్చున్నాడు. కాస్సేపటికి రత్తి వచ్చి పాచిపని చేసి కాఫీపెట్టి....వచ్చినంత హడావుడిగాను పక్కింటికి పరుగెత్తింది. ఏడున్నర ప్రాంతంలో అన్ని పనులు ముగించుకుని నెమ్మదిగా సైకిలు ఎక్కి, గ్రామ పంచాయితీ ఆఫీసుకు దారితీసాడు

నందయ్య. ఎలిమెంటరీస్కూలు గేటు దాటగానే పెరుగు తట్టతో ఎదురొచ్చింది లక్ష్మి.

"ఇంకా అమ్మకం అవలేదేమిటి ?" సైకిలు స్లోచేస్తూ అడిగాడు పలకరింపుగా నవ్వి—

"అమ్మకం ఏంలేదండి... అన్నీ వాడి కలే .. ఆ సివర పంతులమ్మగోరికి పోసి బల్లకట్టు ఎక్కేత్తమే !" అంది లక్ష్మి. యిరవై ఏళ్ళ నందయ్యలో మొదటి సారిగా ఏదో అలజడి ! ఆ అలిజడిలో మరేదో సన్నిహితత్వం !!

హుషారుగా ఈల వేసుకుంటూ క్షణంలో ఆఫీసుకు చేరుకున్నాడు. బిల్లు కలెక్టర్, చిన్న గుమస్తా, లైబ్రేరియన్, పైపులైనుఫిట్టర్, శానిటరీమేస్త్రీ అంతా వరండాలో వరుసగా నిలబడి ఉన్నారు. హెడ్ గుమస్తా మాత్రం లేడు !! తేలిగ్గా గాలి పీల్చుకున్నాడు నందయ్య. "హెడ్ గుమస్తా ఎక్కడ చచ్చాడు ?" తన సహోద్యోగి ఆదినారాయణ చెవి కొరికాడు.

"ఆఫీసర్‌గారితో వస్తున్నాడట..." అతని మాటలు పూర్తికాకుండానే జీపు రావడం.... ఒకరినొకరు తోసుకుంటూ ఆఫీసులోకి వెళ్ళడము ఒకేసారి జరిగాయి.

* * *

కొండాయిపాలెం మొత్తం మీద ఇరవై ముప్పై గడపలకంటె ఎక్కువ ఉండవు. ఉన్న ప్రతి కొంపకి ఒకటి రెండు పాడి గేదెలు మాత్రం తప్ప కుండా ఉంటాయి. అక్కణ్ణుంచి పాలు, పెరుగుతో పుంతల వెంబడి రెండుమైళ్ళు నడచి పంటకాలువ దాటి వచ్చి మంద పాకలో అమ్ముతుంటారు. అలాగని చెప్పి మందపాక టౌను కాదు. పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన తణుకులో పనిచేసే వందలాది కార్మికులు గృహ వసతి కారణంగా ప్రక్కనే ఉన్న మంద పాకలో నివాసం ఏర్పరచుకున్నారు. అందువలన కొండాయిపాలెం నుండి అమ్మకానికి వచ్చే పాలు, పెరుగులకు పల్లెటూరే అయినా మందపాకలో మంచి గిరాకి ఉంది. అక్కడినుండి వచ్చె పెరుగుమునలమ్మ మామ్మ అంటే మందపాక మొత్తంలో తెలియనివారే లేరు.

* * *

"అమ్మో ! చచ్చానురో... ముంతలు పగిలిపోతాయి కొంచెం నెమ్మదిగా తోలరా సచ్చినోడా !" తట్ట గట్టిగా పట్టుకుంది పెరుగుమామ్మ. లక్ష్మి పక పకా నవ్వుతోంది. పుంతలో ఎత్తుపల్లా లకు బండి ఎగిరిపడుతోంది. ఇద్దరూ పెరుగు పోసివచ్చాక బల్లకట్టు దాటి వీరయ్య బండి ఆపుచేయించి అందులో ఎక్కారు. ముంతలు పగిలిపోకుండా గడ్డి మీద పెట్టారు పెరుగు తట్టలు. వీరయ్య బండి రాత్రి రెండవ షిఫ్టులో తణుకు

చక్కెరమిల్లులో చెఱకు దిగుమతిచేసి, తిరిగి వచ్చేటప్పుడు మండపాకలో పెరుగుమామ్మను, లక్ష్మిని ఎక్కించు కుని కానీ పోదు. ఆ సమయానికి వాళ్ళు కూడా పెరుగంతా అమ్ముకుని, పంట కాలువ దాటివచ్చి, రావిచెట్టు క్రింద ఖాళీగంపలతో వీరయ్య బండికోసం ఎదురుచూస్తుంటారు.

పచ్చని పొలాల మధ్య తెల్లని దారి గట్టు.... తల దువ్వకోవడంరాని అర పిల్ల తీసుకున్న పాపిటిలా ఉంది. పైరు గాలికి పంటచేలు ఆలాపించే నిశ్శబ్ద గీతి కలు హృదయం నిండా ఆహ్లాదాన్ని నింపుతున్నాయి.

లక్ష్మికి మహా సరదాగా ఉంది—

"ఒరేయ్ .... ఈరన్నయ్యా! తొట్లో ఓసారి లెగరా నే తోలతాను బండి." ఉత్సాహంగా అడిగింది.

పెరుగుమామ్మ నోరు నొక్కుకుంది.

"నువ్వేడన్నా పడివికాడినుంచి మీ యమ్మ గోల యినలేక సావాలి .... ఆ మట్టికీని కూకో....!" వీరయ్య సమా ధానంలో ముఖం మాడ్చుకుంది లక్ష్మి.

మామిడిచెట్టుమీద కూర్చొన్న కోయిల, ఎదురుగా విరహిణిలా తల విరగబోసుకున్న మర్రిచెట్టును ఉడికిస్తూ కొంటెగా పాటపాడుతోంది. చెఱువు గట్టుప రకరకాల పక్షులు వింత సోయ గాలతో చిన్నగా అటలాడుకుంటూ ఎగురు తున్నాయి.

బండి తాళ్ళచెఱువు దగ్గరకు వచ్చింది. ఆ పక్కచేలో ఎవరిదో చెఱకు నరుకు తున్నారు. వీరయ్యని బండిఆపి చెఱకు ముక్కలు తెమ్మంది లక్ష్మి. వీరయ్య బండి దిగివెళ్ళి రెండు ముక్కలు తెచ్చి యిచ్చాడు. ఒకటి తను తీసుకుని రెండ వది పెరుగుమామ్మకి యిచ్చింది.

"నేనేం తింటానే ముసలిముండని,... పళ్ళా.... పాడా!" చెఱకుముక్క తీసు కుని తట్టలో పెట్టుకుంది. లక్ష్మి చెఱకు ముక్కతింటూ కూనిరాగం తీస్తోంది.

జాలువారిన కాంచనవర్షం జనప మొక్కలపై నిలిచిపోయినట్లుగ విరగ బూసాయి జనపచేలు. వాటిమీద యధే చ్ఛగా తమ విహారాన్ని సాగిస్తున్నాయి రంగురంగుల సీతాకోక చిలుకలు!!

బండి మునసబుగారి చావడి తిన్నగా వచ్చేసరికి లక్ష్మి గావుకేక విని ఆపాడు వీరయ్య. బండిమీంచి చెంగున దూకి, చావిట్లోకి పరుగెత్తింది. కాస్సేపటికి అవుపేడ చేత్తో పట్టుకొచ్చింది. వీరయ్య మండిపడ్డాడు. లక్ష్మి అదేం పట్టించు కోకుండా చక్రం మీద కాలువేసి బండి ఎక్కింది.

"కదురు.... కుంపటా పెట్టలేదే నీకా దేవుడు. ఆ బండెక్కుతుమేటి ఆ వర పేటి పేడకేం ముంచుకు పోయిం దిప్పుడు...."ముసలది దండకం ప్రారం భించింది.

"రోజూ మరిసిపోతన్నాను. సంకు

మా ఊళ్లో బస్సులు!




నాత్రి వచ్చేత్తుంది. గొబ్బెమ్మలు పెట్టాలి. గోగిదండలు సెయ్యాలి..!" లక్ష్మి.

వీరయ్యకు నవ్వొచ్చింది. బండి వేగం హెచ్చింది.

• • •

లక్ష్మి ప్రతిరోజు మండపాక వచ్చి నందయ్యకు పాలు పెరుగు యిచ్చిపోతున్నది. లక్ష్మితో ఎంతసేపు మాట్లాడినా అలా మాట్లాడాలనిపిస్తుండేది అతనికి.

ఆమె అమాయకత్వం అందచందాలు అతన్ని విశేషంగా ఆకట్టుకున్నాయి. గత నెలరోజులుగా అర్థంకాని మానసిక అశాంతిననుభవించి చివరికో నిర్ణయానికి వచ్చాడు నందయ్య. వచ్చిందే తడవుగా పెరుగుమామ్మకి కబురుచేసాడు. సంగతి తెలిసాక ముసలిదాని ముఖం చాటంత అయింది. అతని రెండుచేతులు పట్టుకుని-

"నువ్వు మారాజువి" అంది. నందయ్య భయపడ్డాడు. తను మహారాజుకాడు. మహామంత్రికాడు. తనక్కావలసింది ఏమిటో తెలుసుకున్న మామూలు మనిషినని చెప్పాడు. అతని వెనుక ఎవరూలేరని తెలిసికొని, ఈ శుభకార్యం తన చేతుల మీదుగ జరగబోతున్నందుకు పెరుగు మామ్మ పొంగిపోయింది.

విషయం అంతా విన్నతరువాత-

"అప్పుడే దానికి పెళ్లేటి అత్తా....!" లక్ష్మి తల్లి నరసమ్మ అడిగింది. పెరుగు మామ్మ కూర్చొన్న గోనెపట్టామీంచి కొంచెం వొంగి-

"ఓసి తింగరముండా! యిప్పుడుదాకా నేను సెప్పిందేంటి.... నువ్వు అడిగే

దేంటి? తెలివితక్కువగా మాటాడక, దానిమొకాన రాసకలలున్నాయని నేనే నాడో సెప్పేను. బిల్లుకల్రటు ఉజ్జోగం పేత్తన్న కుర్రోడు.... పైగా మనకులం ....కోరి మన్ని కనికరిత్తుంటే,"

"అదికాదు.... దీని కింకా పదమూ డేళ్ళేకదా....!"

"ఆయ్‌బాబో... యిద్దూరవా ! మీ మాంగారు నన్ను పదోపేటనే గదంటే కాపరానికి ఈసుకొచ్చాడు. మొగ దిక్కు లేనిదానివి నువ్వు దానికింత కంటె మంచి సంబంధం తేగలవా? ఇంకేం అడ్డుసెప్పకు ! నీ అడ్డాబాస సెరిపిచ్చి పిల్లదానికి పుత్తిముక్కు సెయ్యమని కంసాలాయనకి యిచ్చాను...."

"అనాసరంగా నీ అడ్డాబాస సెరిపిచ్చి...." నరసమ్మ యింకేదో అంటుండగానే-

"నువ్వేమీ సెప్పకే నర్సీ ! పిల్లదాని పెళ్ళికి నువ్వొప్పుకున్నమాట ఆ అబ్బాయి సెవినేత్తే కుపేలుగుంటాడు." పెరుగుకట్టమీద తాటాకు చదర ఒక దులుపు దులిపి గంప నెత్తిన పెట్టుకుంది.

* * *

పెళ్ళిమాట తలపెట్టగానే లక్ష్మిని మండపాక పెరుగు తీసుకెళ్ళడం మానెయ్యమంది నరసమ్మ. నందయ్య ఏమైనా అనుకుంటాడని ఆమె అభిప్రాయం. తోటి పెరుగుకట్టలు కూడా వేళాకోళం పట్టించే ధోరణిలో ఆ అభిప్రాయాన్ని బలపర్చాయి. అసలు పెళ్ళికి పెరుగుకట్టకి సంబంధమేమిటో అర్థం కాలేదు లక్ష్మికి. 'సింగినాదమేమీ కాదా' అంటూ అందరినీ తోసిపుచ్చి పెరుగు మాత్రం తీసుకెళ్ళడం మానలేదు.

నరసమ్మ నోరు నొక్కుకుంది. పెరుగుమామ్మ- "పోయేదేముందిలే... కుర్రతనం పట్టుకురానీ..." అని సర్ది చెప్పింది.

వేకువజామున ఆకాశం పెళ్ళిపందిరి దర్పాన్ని చూపిస్తోంది. చెమ్మగిలిన భూమి అలికిన కళ్యాణమంటపంలా ఉంది. తెలిమబ్బుల వలయాలు మామిడి తోరణాలుగా వేలాడుతున్నాయి. మబ్బుల మాటున దాగిన తారకలు పొలకబోసుకున్న నక్షత్రకాంతి వెలుగుజిలుగుల ముత్యాల రంగవల్లులుగ రూపుదిద్దుకున్నవి. ఈదురుగాలి నిశ్శబ్దంగ మంగళ వాయిద్యాలు వాయిస్తుంటే, నునుసిగ్గుల లేతబుగ్గలతో పెళ్ళిపందిరిలో కుడికాలు మోపింది లక్ష్మి. పెళ్ళికొడుకు తన సరసన కూర్చోకముందే వర్షపుచినుకుల అక్షితలు పడసాగినయ్ !

"అమ్మాయి...లచ్చీ!" లక్ష్మి సుషుప్తి అస్పష్టతను పలుపుకుంది.

"లచ్చీ!" చినుకులవేగం హెచ్చింది. లక్ష్మి ఊహాజగత్తు కరిగిపోయింది. ఎదురుగా పెరుగుమామ్మ ! లక్ష్మి పెరుగు తట్ట తమ అరుగుమీద పెట్టుకుని యింత సేపు మామ్మకోసం ఎదురుచూస్తోంది.

మా ఊళ్లో బస్సులు!

జేబు కొట్టేసింది నేను కాదయ్యా బాబూ
బస్సు కోసం పరిగెత్తుతున్నా
అది తప్పిపోతే మళ్లీ
గంటదాకా ఆగేసుకెళ్లే
బస్సు దొరకదు!!

రాగతి
పండరి

"ఈ ముదనష్టపు నుయ్యేంటే నా పేణానికి... తెల్లారగట్టే ఈ ఒరలేని నూతిలో పడుదును కొంచెంముంటే! మీ యమ్మముండకి ఎన్నిసార్లు చెప్పినా ఈ నూతికి ఒరలు పెట్టించదు." సణుక్కుంటూ లక్ష్మిదగ్గరకొచ్చి ఈ ఊదుగు గాలిలో తను రాలేనని. నాలుగు పెరుగుముంతలు లక్ష్మి తట్టలో పెట్టి. ఎవరెవరికి ఇవ్వాలో వివరంగా చెప్పింది. వర్షం ఎక్కువైతే ఉంటుందని తట్ట మీదకు ప్లాస్టిక్ కాగితం ఒకటి యిచ్చింది. లక్ష్మి తట్ట నెత్తిన పెట్టుకున్నాక, కొంచెం వొంగి పున్నాగసుందారం ఒకటి తుంచి జడలో తురుముకుంది.

"రోజూ కొత్తేనేటే.... యిడిసి పువ్వునలా కొయ్యొద్దంటే నీకొక్కందంటే పిల్లా! ఒచ్చేతప్పుడు ఎర్రికొయ్యలాగ ఓనలో తడవక ఆ కాయితం సరిగ్గా ఏసుకో..!" పెరుగు మామ్మ చెబుతూండగనే పూలమొక్కలు దాటి పెంతలోకి వచ్చింది లక్ష్మి.

చలిగాలి గుండెకోతకోస్తోంది. వర్షం జల్లులు జల్లులుగా పడుతోంది. వర్షంలో తడిసి ముద్దయిన ఆమె షవ్వుల పరికిణి మోకాళ్ళకు అంటుకుపోయి. నడుస్తున్నప్పుడు మెత్తగా వింతశబ్దంచేస్తోంది.

తలుపు తెరచిన నందయ్యకు ఎదురుగా ఒక్కసారి విద్యుల్లత మెరిసినట్లనిపించింది. అతని చింకికళ్ళు సంభ్రమంగా వెలిగాయి. అదేపనిగా కురు

స్తున్న వానజల్లు వేగం హెచ్చి యిద్ద రిని ముంచ్చేత్తింది. నందయ్య చటక్కున లోపలకి తప్పుకొని, లక్ష్మినికూడా పిలిచి తలమీంచి పెరుగుతట్ట దింపాడు.

"యింకా ఎలుగన్నా రాకుండా ఈ వానేటండే సంపేత్తంది!! " తడిసిముద్ద యిన బట్టలను ఓ క్షణం చూచుకొని.. పైట గుండెలమీదనుండి తీసి పిండి.. విదిలించి మళ్ళీ మామూలుగా వేసుకుంది. రెండుచేతులూ దగ్గరగా జేర్చుకుని వేళ్ళు జొని గుండెల మధ్యగా గడ్డం కింద ఆనించుకొని చలికి సన్నగావణుకుతోంది.

తడిసిన దుస్తుల్లోంచి ఆమెతొలియవ నపు మలుపులు తొంగిచుస్తున్నాయి. ప్రతిఒంపులో చిక్కవడిన పరికిణి నుండి దృష్టి మరల్చలేక పోయాడు నందయ్య. నిగ్రహం అదుపుతప్పి తనపైన తోటక్రోని పువ్వును ఆఘ్రాణిం చడంలో తప్పులేదని భరోసాయిచ్చింది. మొదట దిగ్భ్రమచెందిన లక్ష్మితీవ్రంగా ప్రతిఘటించింది. ఆపైన మెదడుజీల్చు కున్నా తననేమౌతుందో అర్థంకాని అయో మయస్థితి.

అంతవరకు స్త్రీ స్పర్శ ఎరుగని నందయ్య రక్తం అగ్ని ప్రవాహమై పరుగులెత్తింది, కోరిక ఉవ్వెత్తున లేచి పడింది. లక్ష్మిని విశాలత నేత్రాలు. వాస్తవం కోసం వెదకులాడాయి. అవిర్ధ ష్టమైన స్పందన, అనుభూతుల అంతం చూచిన అనుభవం. అవ్యక్తమయిన భయం.. బాధ. దుఃఖం.. కోపం మరేదో అస్పష్టతా సంజనీతమైన భావం హృద యంతోంచి సుషుప్తిలోనికి — సుషుప్తి నుండి ఆమె హృదయంలోనికి—

లక్ష్మి ఆర్తనాదం బయట వర్షం హోరులో కలిసిపోయింది. ఆ పైన ఆమెకు స్పృహ లేదు.

* * *

"నాకీ పెళ్ళొద్దు నేను చేసుకోను. ఈ సీరినేను కట్టుకోను అమ్మ నాకొద్దు." ఏడుస్తోంది లక్ష్మి.

"ష్! నింపాది! అవల అరుగుమీద తుగ్రాడికి యినపడద్ది. బెగేకట్టుకునిలెగు. ఎన్నిందాల సెప్పినా మంకుపట్టుమానవే" నరసమ్మ కసరింది ఆ గ్రామంలో వివా హాల తంతు జరిపే చింతాలు, నందయ్య, పెరుగుమామ్మ, యింకా చుట్టు పక్కల పెద్దలు అరుగుమీద కూర్చున్నారు. లక్ష్మివంటి రంగుకి అతికినట్లు సరిపో తుందని కనకాంబరం రంగుచీర తెచ్చాడు నందయ్య. ఆచీరకట్టుకొని లక్ష్మి యిప్పుడు పెళ్ళిచూపులకుహాజరుకావాలి? పదినిముషాలు గడిచాక నర్సమ్మ బయ టకు వచ్చి— —

"లచ్చి మీ ఎదరకి రాటానికి సిగ్గు పడుతున్నది చింతాలు మావయ్య! అయినా! ఆరిద్దరికి సూపులు ఎప్పుడో అయినయ్ గదా!" అందికంగారున ణుచు కుంటూ— నందయ్య నిరుత్సాహ పడి పోయాడు.

"అదేంకుదరదు. తంతు అన్నాక తంతే తీసుకురండి" అన్నాడు చింతాలు. పెరుగుమామ్మ కూడాలోపలికి వెళ్ళి చీర

హీనత నరసమ్మ గుండెల్ని పిండింది. ఎన్నడూ తన మాట కెదురుచెప్పని కూతురు యిలా వ్యతిరేకిస్తుంటే ఆమె తల్లి మనసు శంకించింది. తనకి లోకంలో లక్ష్మీకంటె విలువైన దేమీలేదు. అలాంటి లక్ష్మికి తను బలవంతం పెళ్ళి చేస్తోందా? యింతలో పెరుగుమామ్మ వచ్చింది. లక్ష్మి యింకా ఏడుస్తూనే ఉంది. ఎంత తరచి తరచి అడిగినా కారణం చెప్పదు!

పెళ్ళి మానేస్తామని యిద్దరూ గట్టిగా చెప్పిన తరువాత ఆ వర్షంనాడు నందయ్య ఎంత పాపానికి ఒడిగట్టింది పూస గుచ్చినట్లు చెప్పింది. అంతా విన్నాక పెరుగుమామ్మ పడి పడి నవ్వింది. నరసమ్మ మాత్రం నవ్వలేకపోయింది. క్షణం క్రితం లక్ష్మికి యిష్టంలేని సంబంధం అదెంత గొప్పదైనా సరే చెయ్యకూడదనుకుంది, కాని లక్ష్మి చెప్పిన అవాంఛనీయ సంఘటన తరువాత పెళ్ళి తప్పనిసరి! లక్ష్మి జీవితం నాశనమయ్యాక కూడా.... ముందుకొచ్చిన నందయ్య సంస్కారం ఆమె కెంతైనా ఊరట కలిగించింది.

"అమ్మా...!" తల్లి నికుదిపింది లక్ష్మి.

నరసమ్మ ఈ లోకంలోకి వచ్చి—

"పిచ్చితల్లి.... నువ్వెలా బతుకుతావో" ప్రేమగా కూతుర్ని దగ్గరకు తీసుకుంది.

లక్ష్మిని బయటకువెళ్ళమని చెప్పి. నరసమ్మ దగ్గరగా వచ్చింది పెరుగు మామ్మ.

"బయం పడింది.... ఎర్రిమాన!" అంది చెవిదగ్గర గుసగుసలుగా.

ఇంతకు తన పెళ్ళి చేస్తున్నారో. మానుతున్నారో తెలియని అయోమయ స్థితిలో పడిపోయింది లక్ష్మి.

* * *

మొత్తంమీద లక్ష్మితో నందయ్య పెళ్ళి విషయం మండపాక గ్రామపంచాయతీ ఆఫీసులో పెద్ద సంచలనం కలిగించింది. తలొకవిధంగా వ్యాఖ్యానించారు.

ఆ రోజు పెళ్ళిరోజు!!

తల్లిదండ్రులు ఎలా ఉంటారో తెలియని నందయ్య వారికోసం కళ్ళ నీళ్ళు పెట్టుకొన్నాడు. నందయ్య కంట తడి చూచి అతని సహోద్యోగి ఆదినారాయణ కొంచెం చలించాడు. పెళ్ళి పనులలో అతనే నందయ్యకు పూర్తిగా సహకరించాడు. ఆఫీసులో అందరిని పేరు పేరున పిలిస్తే ఎవ్వరూ రాలేదు. ఒక్క ఆదినారాయణ మాత్రమే బయలుదేరాడు.

బయట వీరయ్య తొందరపెట్టడంతో యిద్దరూ వచ్చి బండిలో కూర్చున్నారు. బండి పుంతలో జోరుగా పోతోంది.

"ఏవయ్యా! మీవాళ్ళు ఏర్పాట్లన్నీ పూర్తయ్యాయా?" పెళ్ళికొడుకు తరపున ఆదినారాయణ ప్రశ్నించాడు.

"ఇంకా సక్కా మెడతన్నారండి .... కొంచెం ముందే మిమ్మల్ని తీసుకు రమ్మని పెరుగుమామ్మ నన్ను పురమా



కట్టబెట్టి కొంచెం ఆలస్యంగానే లక్ష్మిని పెళ్ళిచూపులకు తీసుకొచ్చింది

లక్ష్మి తనువు అణువణువు చిగురుటాకులా కంపించిపోయింది నందయ్య ఎదుట కూర్చోటానికి ఆమె శరీరం గగుర్పొడిచింది. ఆమె మనస్సు గతించిన అనుభవాన్ని తట్టుకొనలేక పోయింది.

పెళ్ళిచూపులు ముగిశాక కొద్దిపాటి తర్జన భర్జనలతో ముహూర్తం నిశ్చయమైంది, పెరుగుమామ్మ నందయ్యను సాగనంపడానికి వెళ్ళింది. లక్ష్మి సుడిగాలిలోపలికొచ్చి తల్లిని వాటేసుకుంది.

"అమ్మా! నాకీ పెళ్ళొద్దు. నామాట వినమ్మా!" ఏడ్చింది.

స్త్రీ సహజమైన మాతృత్వపు బల

యించిందండి...." వీరయ్య హుషారుగా సమాధానం చెప్పాడు. బండి తాళ్ళ చెఱువు దగ్గరకు వచ్చింది. వీరయ్య ఉలిక్కిపడ్డాడు. లక్ష్మి కనుక యిప్పుడు బండిలో ఉంటే చెఱకుముక్కలు తెమ్మని గొడవపెట్టేది. బుల్లిబుల్లి గౌనులు వేసుకుని తన భుజాలమీద ఆడుకున్న లక్ష్మి తనకింకా గుర్తుంది. అప్పుడే పెళ్లి కూతురై పోయింది! వీరయ్య గుబురు మీసాల మాటున సంతృప్తికరమైన చిరునవ్వు చిందులాడింది.

బండి కొండాయిపాలెంలో ప్రవేశించింది.

నరసమ్మ యింటిదగ్గర బండి ఆపి సామానులు దింపుతున్నాడు వీరయ్య. నందయ్య, ఆదినారాయణ లోపలికి అడుగుపెడుతుంటే అంతా గొడవ గొడవగా ఉంది. లోపల పెరటిభాగంలో సన్నగా ఏడుపులు.... శోకాలు వినిపిస్తున్నాయి.

అటుతిరిగిన నందయ్యను, ఎన్నడూ లేని అలంకరణలతో నూతన వధువుగా అంతిమయాత్రకి సిద్ధమౌతున్న లక్ష్మి శవం ఆహ్వానించింది!!

శరీరంలో రక్తమంతా ఒక్కక్షణం ప్రచండవేగంతో వెనక్కి ప్రవహించి గుండెల్లో గడ్డకట్టింది. విద్యుద్ఘాతం తిన్నట్లుగా దిగ్భ్రమచెందాడు నందయ్య. లక్ష్మి తల్లి నరసమ్మ ఈ లోకంతో సంబంధంలేనట్లుగా, కొత్తగా పెట్టించిన నూతి బరలకేసి తలబాదుకుంటోంది. ఎంతమంది లాగినా రావడంలేదు.

బండి ఒక్క ఉదుటున దూకిన వీరయ్య లక్ష్మినిచూసి చిన్నపిల్లవాడిలా బావురుమన్నాడు.

పచ్చని మామిడితోరణాలతో కళకళలాడుతున్న పెళ్ళిపందిరి క్రింద చాలా మంది మూగిఉన్నారు. వారంతా నందయ్యను చూడగానే 'అతనే పెళ్ళి కొడుకు, అంటూ గుసగుసలాడారు. పెదగుమ్మాన్న నందయ్యని చూచి అక్కడినుండి లేచి వచ్చింది.

"వచ్చావా బాబూ.... చూడు నాయినా, లోకంమీద అందరి తీరుకాకపోయిన దాని బతుకు. ఆనూతిలోపడి ప్రాణంతీసుకుంది. నాకీ పెళ్ళొద్దని నెత్తీనోరు కొట్టుకుంది నా తల్లి! పాపిష్టిముండని.... యిన్నాను గాదు" నందయ్య రెండు చేతులు పట్టుకొని గొల్లుమంది.

"లక్ష్మి ఈ పెళ్ళి వద్దందా!?" నందయ్యలో వేయి అగ్నిపర్వతాలు ఒకేసారి బ్రద్దలయ్యాయి.

తెల్లవారుఝామున వడ్డ చినుకులకు నేలంతా బురద అయింది. లక్ష్మిని ఆఖరిసారిగా చూడ్డానికొచ్చిన జనం తొక్కిసలాటలో, ఆమె అపురూపంగా పెంచుకున్న మందారపు మొక్క విరిగిపోయింది.

ఆ రోజు లక్ష్మితల నలంకరించవలసిన ఒకే ఒక ముద్దమందారం మట్టిలో కలిసిపోయింది.

# సీరియల్

# అగ్నిశిఖ

వాసిరెడ్డి సీతాదేవి

(గత సంచిక తరువాయి)

రాహుల్ ధోరణి రమేష్‌కు భయం కలిగించింది.

పిచ్చి మతిగాని పోలేదు కదా? నిద్ర లేకుండా ఒకటే చదువు. ఇలాంటి సమయాల్లో అతి తెలివైనవాళ్ళు అప్పుడప్పుడు మతిస్థిమితాన్ని కోల్పోతారని తనూ విన్నాడు. అదే అయి ఉండాలి. అందుకే తాగాడు. ఏదేదో తలా తోకా లేకుండా మాట్లాడుతున్నాడు.

అనుకోకుండా రమేష్ దృష్టి పక్క మీద ఉన్న పగిలిన పచ్చటి గాజుకాలుకు ముక్కలమీద పడింది. యాంత్రికంగా అందుకున్నాడు. రెండో మనిషి స్త్రీ! ఎవరామె? గాజులు పగిలాయి. దిండు మీద రెండు మూడు పొడువాటి వెంట్రుకలు కన్పించాయి. ఆ పక్కనే నలిగిన తెల్ల గులాబీరేకలు.

రమేష్‌కు నిజంగానే మతిపోయింది.

తను చూస్తున్నది వాస్తవమా?

రాహుల్ ఆడపిల్లను గదికి తీసుకు వచ్చాడా?

అంటే? అంటే?

ఫ్రాయిడ్ అంటున్నాడు, సైకాలజీ చదువుతూ ఉంటాడు. అతనికి మనసులో ఏదో చెయ్యాలనే కోర్కె.... ఆ కోర్కెను బలవంతంగా అణచుకొని తను మిగతా వాళ్ళకంటే సూపర్ మేన్ అనే భావాన్ని కలిగించే ప్రయత్నం... చివరకు ఎవరూ లేకుండా చూసి ఇలా తన కోర్కెను....

ఛ! అలా జరగడానికి వీల్లేదు. రాహుల్ హిపోక్రాట్ కాదు. ఏదో

జరగరానిది జరిగింది. ఎవరో గదికి వచ్చారు. ఎవరా స్త్రీ? కాలేజీలో ఎంత మందో అతనంటే పడిచస్తారు. ఆ సుశీల....కమల....రాగిణి.. ఆ ముగ్గురే ధైర్యం చేస్తారు. రాగిణి వచ్చిందా? తనకోసం వచ్చిందా? ఆ సమయంలో వంటరిగాఉన్న రాహుల్-యువకుడు.... రాగిణికి అతనంటే ఇష్టం అని తనకూ తెలుసు....

రాహుల్ పతనం ప్రారంభం అయిందా? ఇలాంటి సంఘటనలు తన లాంటి వాళ్ళు సీరియస్‌గా తీసుకోరు. రాహుల్‌లాంటి వ్యక్తి తేలిగ్గా తీసుకోడు. రేపు మత్తు వదిలాక....

"రాహుల్! రాహుల్!" రెండు భుజాలూ పట్టుకొని గట్టిగా ఊపాడు రమేష్.

"ఉఁ" అంటూ పక్కకు పొర్లి పడుకున్నాడు.

రమేష్ రాహుల్ భుజం పట్టుకొని లాగాడు,వెల్లికితలాపడుకొనేలాలాగాడు.

"రాహుల్ ఏమైంది? ఏమిటిది!"

"ఉష్! డోంట్ డిస్టర్బ్! నేను స్వర్గంలో ఉన్నాను. క్రిందకు లాగకు."

"ఒరేయ్ రాహుల్ ఏమిట్రా నువ్వు చేసింది!"

"ఏం చేశాను? నువ్వే అనేవాడివిగా స్వర్గం చూపిస్తానని... అప్పుడు నాకు ఆ స్వర్గం చూడాలనిపించలేదు. ఇప్పుడు చూడాలనుకున్నాను. నువ్వు అబద్ధం చెప్పలేదురా! నిజంగా ఇందులో స్వర్గం ఉంది" అంటూ అడోలావవ్వాడు.ఆ నవ్వు నుంచి తెగిపోతున్న శబ్దం.. ఆ శబ్దం కారుణ్యం పెరుగుతున్న వెక్కిళ్లలా ఆగి ఆగి వస్తోంది.

"ఎవరొచ్చారు ఈ గదిలోకి? రాగిణా?"

"నో! నో!"

"మరెవరు?"

"వరూధిని!"

"వరూధినా? అదెవరు?"

"తప్పు స్త్రీని అదీ ఇదీ అన కూడదు...."

"ఎవరు ఆ వరూధిని?"

"మరి నన్ను మీరంతా ప్రవరాఖ్యుడు అని ఎగతాళి చేస్తారుగా? ప్రవరాఖ్యుడ్ని వెతుక్కుంటూ వరూధినే వచ్చింది.... నిజం.... నేను వెళ్ళలేదు.... నేను కాలికి పసరు పూసుకోలేదుగా .... అందుకే వరూధినే వచ్చింది."

"ఏమిట్రా బాబూ! నీ మాటలు వింటూంటే నాకు భయం వేస్తుందిరా! సరిగా చెప్పు! నీళ్లతో ముఖం కడుక్కుంటావా? చల్లటి నీళ్లతో...."

"నో! నో! నన్ను ఇలాగే ఉండనివ్వు! ప్రవరాఖ్యుణ్ణి చంపేశాను తెలుసా? నీ స్నేహితులు- ఆ వెధవలు ఇక నన్ను ఎగతాళి చెయ్యరు గదూ!"

వాళ్ళ మాటల్ని పట్టించుకున్నట్టే ఉండేవాడు కాదు. కాని ఆ మాటలు

అలా ఎనుఎను ఇంత గాయపర్చేవా ?

"ఒరేయ్ బాబూ ! అసలు ఏం జరిగిందిరా ?"

"చెప్పనా ?"

"చెప్పరా బాబూ ?"

"అగ్నిశిఖకు మలినం అంటిందని తెలిస్తే మనిషి ఏమౌతాడ్రా ? తనను తను చంపుకుంటాడు. నేనూ మనిషినేరా ? నాకూ మనసుంది. ఆ మనసుకూ స్పందించే శక్తి ఉంది.... అందుకే.... అందుకే.... వినలేనిది విన్నాను. చూడలేనిది చూశాను ... భరించలేకపోయాను.... పోయానా?" మళ్ళీ కళ్ళు మూతలుపడ్డాయి

"అగ్నిశిఖ ! అగ్నిశిఖ ?" ఏదో గుర్తుచేసుకోవడానికి ప్రయత్నిస్తున్నాడు రమేష్.

"నువ్వేమో లేవా.... నేను నీ బాటిల్ తీసి తాగాను. నువ్వే చెప్పావుగా అన్ని బాధల్నీ హరింపచేసే దివ్య ఔషధం అని.... అందుకే నా బాధ పర్చిపోవాలని గ్లాసు తీసుకు కూర్చున్నాను. ఒక గ్లాసు తాగినా .. తాగానంటావా ?" మళ్ళీ ధోరణి తెగిపోయింది.

రమేష్ నోట మాటరానివాడిలా చూస్తూ కూర్చున్నాడు.

"తాగుతున్నాను.... గొంతులో మంట ... గుండెల్లో మంట.... మెదడు తిమ్మిరెక్కుతోంది.... అంతలోకి వచ్చిందిరా వరూధిని...."

"వరూధినా ? అగ్నిశిఖా ! ఆ పేరు, ఆ పేరు !" మనసులోనే మననం చేసుకున్నాడు రమేష్.

భావన కళ్ళముందు కదిలింది.

రమేష్ అదిరిపడ్డాడు.

భావన వచ్చిందా ?

భావన ఇంత పని చేసిందా ?

రాహుల్ని భ్రష్టుణ్ణి చేసిందా ?

ఎందుకు ?

"రాహుల్ !"

"ఉష్ ! ప్లీజ్ ! డోంట్ డిస్టర్బ్ !" పక్కకు వత్తిగిలి పడుకున్నాడు రాహుల్.

ఈ పరిస్థితిలో రాహుల్ నుంచి నిజం తెలుసుకోవడం కష్టం అని అర్థం అయింది.

రాహుల్ షర్టు చమటతో తడిచి వీపుకు అతుక్కుని ఉంది.

రమేష్ లేచి ఫ్యాన్ అన్‌చేశాడు. తన మంచంమీద నడుంవాల్చాడు.

'అగ్నిశిఖ !'

ఎవరు !

అం భావన ! అవును భావన ! అగ్నిశిఖ ! రెపరెపలాడే అగ్నిశిఖ !

ఆ పేరు పెట్టింది రాహుల్ ! ఒకే ఒకసారి ఆ మాట తనతో అన్నాడు.

భావన అంటే రాహుల్‌కు ఎనలేని అభిమానం ! ఆ మాటకొస్తే అతను ఏ ఆడపిల్లను గురించీ చులకనగా మాట్లాడటం తను వినలేదు. మరొకరు మాట్లా

మా ఊళ్లో బస్సులు




డినా భరించలేదు. భావనను రాహుల్ ప్రేమించాడా?

రెండేళ్ల క్రితం బి. ఏ. పూర్తి చెయ్యకుండానే కాలేజీ మానేసింది భావన! ఏం జరిగిందో ఎవరికీ తెలియదు. తలోక రకంగా చెప్పుకున్నారు. ఆమె మీద కసిగా మాట్లాడే తన ముగ్గురు మిత్రులు ఒకనాడు కూడా ఆమె పేరు ఎత్తలేదు. తను ఒకటి రెండుసార్లు ఆ పేరు ఎత్తినా వాళ్లు విని పించుకోనట్టు ఊరుకున్నారు. ఆ తర్వాత ఆమె గుంటూర్లో ఎవరికీ కనిపించలేదు. ఆ రోజుల్లో రాహుల్ ఏదో పోగొట్టుకున్నవాడిలా కన్పించేవాడు. తను ఎన్ని సార్లు అడిగినా చిరునవ్వే సమాధానంగా ఇచ్చాడు. అప్పటినుంచి రాహుల్ మరీ గంభీరంగా తయారయ్యాడు. ఎందరిలో ఉన్నా ఒంటరివాడిగానే కన్పించేవాడు. భావనతో రాహుల్‌కు సన్నిహిత సంబంధం ఉన్నదనటానికి కూడా ఎలాంటి ఆధారం లేదు. కాలేజీలో అప్పుడప్పుడు మాట్లాడటం తను చూశాడు. కాలేజీ ఎలక్షన్స్‌లో భావన రాహుల్ తరపున పనిచేసింది. ఆ సంవత్సరం రాహుల్ స్టూడెంట్సు ప్రెసిడెంటుగా ఎలక్టు అయ్యాడు.

భావన రగిల్చిన నిప్పు ఇంతకాలం అతని గుండెల్లో పిడకలగూడులా రాజుకుంటూనే ఉన్నదా? అగ్నికి ఆకు మలినం అంటుకుంది అంటున్నాడు. అంటే

భావన కన్పించిందా? భావన చరిత్రహీన అని తెలిసిందా? అలా జరగడానికి వీల్లేదు. ఆమెను ముట్టుకున్నవాడు కాలిపోతాడన్నట్లుండేది.

ఆమె గుంటూరు అదే కాలేజీ వదిలేసి రెండేళ్లు పూర్తి అయింది.

గత స్మృతులు, ఇంతకాలం మూసి ఉన్న భవనం తలుపుల తుప్పుపట్టిన గడియను తీశాయి.

## 3

అవి కొత్తగా కాలేజీలో చేరిన రోజులు. రాహుల్, రమేష్ ఇంటర్ చదువుతున్నారు హిందూ కాలేజీలో. డబ్బున్న రమేష్ చుట్టూ అనతికాలంలోనే అనేక మంది స్నేహితులు మూగారు. వీళ్ళందరి మధ్య ఉంటూ కూడా రాహుల్ ముభావంగా ఉండేవాడు. వాళ్లను తప్పుకు తిరిగేవాడు. ముఖ్యంగా సురేష్, రాజేంద్ర, శేఖర్, రమేష్ చుట్టూ బెల్లం చుట్టూ తిరిగే ఈగల్లా ఉండేవాళ్లు.

రాహుల్ రమేష్‌తో ఉండటం వాళ్ళకు ఇష్టం ఉండేది కాదు. ఎన్నో విధాల వాళ్ళ స్నేహాన్ని చెడగొట్టడానికి సురేష్ శేఖరూ ప్రయత్నించి విఫలం అయ్యారు. రాహుల్‌కు ఇబ్బంది కలిగించే దేదీ తన ఇంట్లో జరగకూడదని నిర్ణయించాడు రమేష్. రాహుల్ని వాళ్లు ఎగతాళిగా మాట్లాడితే వెంటనే "మనం ఏమీ చెడిపోయాం, వాడిని అలా ఉండనివ్వండి." అనేవాడు రమేష్ తీవ్రంగా.

రమేష్ గ్యాంగుకు చూస్తే ఆడపిల్లలకు హడల్! లెక్చెరర్సుకూడా వాళ్ళ జోలికి వెళ్ళేవాళ్లు కారు. రాహుల్ ఉన్నప్పుడు మాత్రం రమేష్ ఎలాంటి అల్లరీ చేసేవాడు కాదు.

ఆ రోజు ఇంటర్ ఫైనల్ పరీక్షల తాలూకు మొదటి పేపరు రాసి స్టూడెంట్సు పరీక్ష హాలునుంచి బయటికి వస్తున్నారు.

రాహుల్, రమేష్ ప్రశ్నల గురించి మాట్లాడుకుంటూ నడుస్తున్నారు. శేఖర్, రాజేంద్ర, సురేంద్ర వచ్చి కలుసుకున్నారు. వాళ్ళ ముగ్గురూ ఆడపిల్లల మీద జోక్స్ విసుర్తూ నడుస్తున్నారు.

"అరే రమేష్! పక్కకు తప్పుకో!" గావుకేక పెట్టి చెయ్యి పట్టుకొని పక్కకు లాగాడు రాజేంద్ర.

రాహుల్ ఆగాడు. రాజేంద్ర ఒక్కసారిగా లాగడంవల్ల పడబోయి నిలదొక్కుకున్నాడు రమేష్.

"ఏమిటది?" రమేష్ విసుగ్గా అడిగాడు.

"డేంజర్ రా బాబు! డేంజర్!"

"ఏమిట్రా?"

"కాస్తమాతే కొమ్ములతో కుమ్మేసేదే,"

సురేష్, శేఖర్ గొల్లున నవ్వారు.

రాహుల్ అయోమయంగా చూస్తున్నాడు.

ముందు వెళ్తున్న అమ్మాయి ఆగింది.

గిర్రున వెనక్కు తిరిగింది. రెండడుగులు ముందుకువేసి రాజేంద్ర ఎదురుగా వచ్చి ఠీవిగా నిల్చుంది, అతని ముఖంలోకి తీవ్రంగా చూసింది. ఆ చూపులు చురకత్తుల్లా ఉన్నాయి. ఎదురుగా నిల్చున్న ఆ పద్దెనిమిదేళ్ళ పిల్ల పైపైకి ఎగిసివస్తున్న అగ్నిశిఖలా కన్పించింది. రాహుల్‌కు, ఆ చూపుల్ని తట్టుకోలేనట్టు రాజేంద్ర దిక్కుల చూడసాగాడు.

"ఏమిట్రా ఏమైంది?"

"చూట్టంలా వోట్లగిత్త- కొమ్ముల్తో ఎత్తేయగలదు జాగ్రత్త" చిన్నగా అన్నాడు సురేంద్ర.

ఆ అమ్మాయి కళ్ళు రాజేంద్రమీద నుంచి శేఖర్‌కేసి తిరిగాయి. మరుక్షణంలో సురేంద్ర వెంప చెళ్ళుమంది. అనుకోని ఈ పరిణామానికి నలుగురూ అవాక్కయి నిలబడిపోయారు.

"ఎంత పొగరే నీ...." మధ్యలోనే ఆగిపోయాడు సురేంద్ర ఆ పిల్ల కళ్ళలోకి చూసి.

"ఏం అలా మేకపిల్లల్లా చూస్తారేం? వాగండి! మీకు ఇళ్ళల్లో ఆడవాళ్ళు లేరా? మీరు పిరికివాళ్ళు! ఐదుగురున్నారు— కాదు నలుగురు- ధైర్యం ఉంటే మళ్ళీ వాగండి- ఊఁ అలా కళ్ళప్పగించి చూస్తారేం?"

శేఖర్ పెదాలు తడుపుకుంటూ ఉండిపోయాడు.

రాజేంద్ర దిక్కులు చూడసాగాడు.

సురేంద్ర చెంప తడుముకుంటున్నాడు.

రమేష్ మాత్రం ప్రశంసాపూర్వకంగా ఆ పిల్ల ముఖంలోకి చూస్తున్నాడు.

"పిరికిపందలు గుంటనక్కలు! ఆడపిల్ల కన్పిస్తే చాలు నాలుక దురద పెడుతుంది. చాలా కాలంగా చూస్తున్నాను మిమ్మల్ని! జాగ్రత్త! మళ్ళీ నా జోలికి వచ్చారా? థూ!" అంటూ ఊసింది ఆ పిల్ల.

ఓ సారి రాహుల్ ముఖంలోకి చూసి గిర్రున తిరిగి వెళ్ళిపోయింది.

పరీక్షల హడావిడిలో ప్రశ్నాపత్రాల గురించి గ్రూపులు గ్రూపులుగా ఉన్న ఇతర విద్యార్థులు ఎవరూ ఈ సంఘటన గుర్తించలేదు. ఎవరి గొడవలో వాళ్ళున్నారు.

"కొమ్ము గట్టిగానే విసిరిందిరా" అన్నాడు సురేంద్రను చూస్తూ శేఖర్.

"ఏమిచ్చింది."

"దాని కొమ్ములు పిసుక్తానని చూస్తుందండి." అన్నాడు రాజేంద్ర కసిగా.

"దాని పొగరు అణుస్తాలే" అన్నాడు సురేంద్ర చెంప నిమురుకుంటూ.

"ఏదా పులేే పదండి. ఆ పిల్ల చూపులకే మా గుండెలు జారిపోయాయ్. ఎదురుగా నిల్చుంటే వంగి ముందర నిల్చున్నట్టు వణికిపోయారు. విప్పుడు

కోతలు కోస్తున్నారు," అన్నాడు రమేష్.

"అడదికదా అని వదిలేశాను." అన్నాడు శేఖర్.

"ఇంత తగ్గాలా!" అన్నాడు రమేష్.

"మన ప్రతిభ ఆడపిల్ల ఎదురుతిరగనంత వరకే!" అందరూ రాహుల్ కేసి చూశారు.

"ఎయినా నీకు ఎన్నిసార్లు చెప్పాను. ఆడపిల్లను చూడగానే ఏదో ఒకటి వాగేస్తావ్." వెళ్లి రాహుల్ రాజేంద్ర [illegible] చూస్తూ అన్నాడు

"[illegible] ఇక్కడ ఎవరూ అడగలేదు" తీవ్రంగా అన్నాడు రాజేంద్ర.

"[illegible] వాడిలా [illegible] బతకమంటావా! జీవితం [illegible]చేసేకోవాలి. [illegible]వయసులో అల్లరి చెయ్యకపోతే మరో పదేళ్లు పోయాక చేస్తామా! అదో థ్రిల్. ఎంత మంది ఆడపిల్లల్ని అల్లరి చేయడంలేదు. ఇది మరీ బరితెగించిన ఆడది. పోట్లగిత్తలా ఉంటుంది, ఎప్పుడూ [illegible] ఎవర్నో కుమ్మడానికి తయారుగా ఉన్నట్టే కనిపిస్తుంది. ఛ! [illegible] లక్షణం లేదు. దీని అందం చూసి వెంటపడుతున్నాం అను[illegible] ఉంది."

"ఛ! చదువుకుంటున్నారు ఎందుకు! బొత్తిగా సంస్కారం లేదు." అందరూ గిర్రున రాహుల్ కేసి చూశారు.

"ఇదీ..ఇదీ.. అని ఒక ఆడపిల్లను అనడానికి సిగ్గువెయ్యడం లేదూ? మీ మనసులు మురికి కుండలు. వాటిని పదిమంది ముందు బద్దలు కొట్టడానికి కూడా జంకులేనివాళ్లు మీరు."

"మధ్యలో నీ కెందుకూ? వచ్చాడయ్యా నీతులు చెప్పే ప్రవక్త!" అన్నాడు వ్యంగ్యంగా మహేంద్ర.

"ఆ అమ్మాయి ఎదురుతిరిగేసరికి మీ నోళ్లు కదలబడిపోయాయేం? చాటున తిట్టడం సంస్కారం కాదు.!"

"ఏమిటోయ్! సంస్కారం! సంస్కారం! అంటూ పదిసార్లు అంటున్నావ్!" మీదమీదకు రాబోయాడు శేఖర్.

"దూరంగా నిలబడు!" రాహుల్ కంఠం కంచులా మోగింది.

"ఊరుకోండిరా బాబూ!" అన్నాడు శేఖర్.

"నువ్వే వీడికి కొమ్ములు ఇచ్చావ్!" రమేష్ మీద విరుచుకుపడ్డాడు శేఖర్.

"అవును మీకు కొమ్ములు లేవు. కొమ్ములు లేని జంతువులంటే భయమే! అందుకే మర్యాదగా ప్రవర్తించమంటున్నాను."

"ప్లీజ్ రాహుల్! వాళ్ళతో నీకేమిటి పద!" రమేష్ రాహుల్ చెయ్యి పట్టుకొని ముందుకు లాక్కుపోయాడు.

"ఏమిట్రోయ్ దాన్ని వీడు ఇంత వెనకేసుకొస్తున్నాడు." వెనక నుంచి వినిపించింది.

రాహుల్ ఆగాడు. కాని రమేష్ అతన్ని వెనక్కి పోనివ్వలేదు. ఇద్దరూ మౌనంగా నడుస్తున్నారు.

"ఏమిట్రా రాహుల్, అంత ఆలోచిస్తున్నావ్?" అన్నాడు రమేశ్.

రాహుల్ సమాధానం ఇవ్వలేదు.

"రాహుల్! వాళ్ళతో నీ కెందుకురా? వాళ్లు దుర్మార్గులని నీకు తెలుసు!"

"ఒక ఆడపిల్లను అలా అవమానిస్తూ ఉంటే చూస్తూ ఊరుకోమంటావా? కొందరికి అలా వాగడం సరదా అయితే కొందరికి వినడం సరదా। వాగేవాడి కంటే వినేవాడే పరమ నీచుడు. వాడికి ధైర్యం ఉండదు. రెండోవాడు తను చెయ్యాలనుకున్న పని చేస్తుంటే ఆనందిస్తాడు," అన్నాడు రాహుల్ తీవ్రంగా.

"అంటే నేను అలాంటి వాడినంటావా?"

"నువ్వే ఆలోచించుకో."

రమేష్ ముఖం నల్లగా మాడిపోయింది. కోపం వచ్చింది. ఏదో అనబోయి ఆగిపోయాడు. రాహుల్ మాటల్లో నిజం లేకపోలేదని లోపల ఎవరో అంటున్నట్టు తోచింది.

"వాళ్ళ వెనక ఒక పెద్ద రౌడీగేంగు ఉన్నదిరా!"

"అదేరా మన దౌర్భాగ్యం. రాజకీయ నాయకుల వెనక ఉన్నట్టే మన స్టూడెంట్సు వెనక కూడా రౌడీలు ఉంటున్నారు."

"అందుకే వాళ్ళ జోలికి పోవద్దంటున్నాను."

"ఏం చేస్తారు? నాకలాంటి భయం లేదు. అన్యాయాన్ని చూస్తూ ఉండేవాడు, అన్యాయం చేసేవాడికంటె నీచుడుగా నేను భావిస్తాను."

"వాళ్ళు ఏమైనా చెయ్యగలరు. ఆ అమ్మాయిని ఏం చేస్తారోనని భయంగా ఉన్నది."

"అగ్నిశిఖ జోలికి పోయినవాడు కాలిపోతాడు. ఆమెను నష్టం చెయ్యలేరు."

"ఆడపిల్ల, నలుగురు కలిసి వంటరిగా చూసి ఏదైనా చేస్తే..."

రాహుల్ మాట్లాడలేదు. ఆలోచనలో పడ్డాడు.

ఇద్దరూ ఇల్లు చేరారు. బట్టలు మార్చుకుని డైనింగ్ టేబుల్ ముందు కూర్చున్నారు.

వంటకుర్రవాడు భోజనం వడ్డించాడు.

రమేష్ గంభీరంగా ఉన్నాడు.

"నువ్వెందుకురా అలా ఉన్నావ్? నిన్ను బాధపెడితే క్షమించు."

"నా బాధ అది కాదురా రాహుల్! వాళ్లు నీమీద కసిపట్టారేమోనని. నువ్వు అనవసరంగా స్నేహితుల్ని దూరంచేసుకుంటున్నావేమోనని నా బాధ." అన్నాడు రమేష్

"స్నేహితులా! ఛ. వాళ్లు నాకు స్నేహితులేంటి?"

రమేష్ మాట్లాడలేదు.

"నాకు అసలు స్నేహితులే లేరు."

రమేష్ విస్మయంగా తలెత్తి చూశాడు.

"నాకు ఉన్నది ఒకే ఒక స్నేహితుడు. వాడు ఏ పరిస్థితిలోనూ నన్ను అపార్థం చేసుకోడు."

"వాడెవడు?"

"అది కూడా చెప్పాలా?" అన్నట్టు నవ్వాడు రాహుల్.

"థ్యాంక్స్‌రా! నా మీద నీకు ఆ నమ్మకం ఉన్నందుకు చాలా సంతోషం. నేను అనేది...."

"ఇంకేం చెప్పొద్దు. నాకు అలాంటి స్నేహితులు అక్కర్లేదు. నేను కావాలన్నా వాళ్లు నాకు స్నేహితులు కాలేరు. ఎందుకో తెలుసా?"

"చెప్పు!"

"నా జేబులు ఎప్పుడూ ఖాళీగానే ఉంటాయి. వాళ్లను నేను పాష్ హోటళ్ల మాట అలా ఉంచి టీస్టాల్స్‌కు కూడా తీసుకెళ్ళలేను. సినిమాలు చూపించలేను. స్కాచ్ సప్లై చెయ్యలేను. వాళ్లతో చేరి వల్గర్‌గా మాట్లాడలేను. కనీసం వాళ్ల మాటల్ని విని ఆనందించలేను. బీదవాణ్ణి! ట్యూషన్లు చెప్పుకుని బతికేవాణ్ణి. ఒక స్నేహితుడి దయమీద ఆధారపడి బతుకుతున్నవాణ్ణి. అంధకారమయంగా కనిపించే భవిష్యత్తులో చిన్న వెలుగు రేఖను చూడటానికి సహస్రశం ప్రయత్నిస్తున్నవాణ్ణి. ఇరవై ఏళ్లనిండకుండానే అరవై ఏళ్ల అనుభవాన్ని జీర్ణించుకున్నవాణ్ణి. నాలాంటి వారికి స్నేహితులు ఎలా ఉంటారురా!"

"సారీ! నీ మనసును గాయపర్చినట్టున్నాను."

"నో! నో! నీకు అది చేతకాదు." నవ్వుతూ అన్నాడు రాహుల్.

## 4

వారం రోజులు గడిచాయి.

ఆఖరి పరీక్ష పేపరు రాసి రాహుల్ హాలునుంచి బయటికి వచ్చాడు.

"ఎలా రాశావురా?" అప్పుడే వచ్చిన రమేష్ అడిగాడు.

"బాగానే రాశాను నువ్వు?"

"బొత్తిగా బాగా రాయలేదు" నవ్వుతూ అన్నాడు రమేష్.

"నువ్వు ఎన్నయినా చెయ్యరా! కాని చదువును మాత్రం నిర్లక్ష్యం చెయ్యకు."

"పోరా బాబూ! అనుభవించవలసిన రోజుల్లో పుస్తకం పురుగులా గడపడం నావల్ల కాదు."

"అవును! నీకు ఆ అవసరం లేదు."

"అదే చెప్పబోతున్నాను. మా తాత బోలెడంత సంపాదించి మా నాన్నకు ఇచ్చిపోయాడు. గడ్డికింద పడ్డా పరుగునపోయి తీసి ఎప్పుడూ దాచే వాడట. మా నాన్న జీవిత ధ్యేయం వాళ్ల నాన్న ఇచ్చిపోయిన ఆస్తిని పెంచడమే! ఊళ్లో ఉన్న పొలల్లో పాతిక

వంతు ఒక్క మాకుటుంబానికి వెండిందే. నేను ఒక్కడే కొడుకును. మా నాన్నకు నన్ను కొన్ని లక్షలకు అమ్మాలని ఆశ. అందుకే చదువు పేరుమీద ఎంతయినా ఖర్చుపెడుతున్నాడు. డిగ్రీను బట్టి కట్నం బేరం పలుకుతున్న రోజులు ఇవి."

"నువ్వు కట్నం తీసుకుంటావా?"

"మరి నేను సంపాదించేది లేదు ఉన్నది ఖర్చుపెడుతున్నాగా" నవ్వుతూ అన్నాడు రమేష్.

రాహుల్ ముఖం గంభీరంగా మారింది.

"రాహుల్ ఒకటి అడగనా?"

"ఏమిటి?"

"మీ చెల్లెల్ని నాకిచ్చి పెళ్లి చేస్తావా?"

రాహుల్ కళ్లకు ఏదో [illegible]నట్టు ఆగిపోయాడు.

"ఎగతాళి చేస్తున్నావా?"

"నీతో ఎగతాళి ఆడతానా?"

"మా చెల్లెల్ని నువ్వు చేసుకున్నా నీకు ఇవ్వను."

"ఏం? ఎందుకని?"

"కట్నం ఇవ్వలేం కనక."

"కట్నం అక్కర్లేదు."

"అయినా ఇవ్వను."

ఇద్దరూ మౌనంగా ముందుకుసాగారు.

"ఏమండీ?" వెనకనుంచి పిలుపు. కాని వాళ్ల [illegible]కోలేదు.

"మిమ్మల్నే." మళ్లీ పిలిచింది.

రమేష్ వెనక్కి తిరిగి చూశాడు.

వెనక భావన వస్తోంది.

"ఏమిటండీ?" అన్నాడు రమేష్.

"నేను పిల్చింది ఆయనను. రాహుల్ గారిని."

రాహుల్ తన పేరు వినిపించి ఆలోచనలనుంచి బయటపడ్డాడు. ఆగి వెనక్కి చూశాడు.

భావన "మిమ్మల్నేనండీ?"

రాహుల్ ఆశ్చర్యంగా ఆమె ముఖం లోకి చూశాడు.

రమేష్ కూడా చూస్తూ నిల్చున్నాడు.

"ఏమిటి?" రాహుల్ అడగాలను కున్నాడు కాని గొంతు పెగల్లేదు.

"పరీక్షలు బాగా రాశారా?"

ఒక మగపిల్లవాడు మరో మగపిల్ల వాడిని అడిగినట్టే అడిగింది భావన.

"ఆఁ ఆఁ రాశాను." తడబాటును అణచుకుంటూ అన్నాడు.

"మీరో?" రమేష్‌ను అడిగింది.

"బాగా రాయలేదు."

ఏమిటి ఈ అమ్మాయి? ఆడపిల్ల ననే భావం ఎక్కడా లేదు—అనుకున్నాడు రమేష్.

"ఆ రోజు నా చేత దెబ్బలు తిన్నవాడి పేరు ఏమిటి?"

సూటిగా రాహుల్ కళ్లలోకి చూస్తూ అడిగింది.

"[illegible]." రమేష్ చెప్పాడు.

"మొదట వాగినవాడి పేరు?"

"రాజేంద్ర!" రమేష్ చెప్పాడు.

"ఆ మూడో వాడు!"

"శేఖర్!" ఆ ప్రశ్నకు సమాధానం కూడా రమేషే చెప్పాడు.

"వాళ్లు మీ స్నేహితులా?"

"కాదు.... అవును!" ఈసారి రాహుల్ తడబడుతూ అన్నాడు.

"కాదు....అవును.... అదేమిటండీ? అవునా కాదా"

"అవును!" యాంత్రికంగా సమాధానాలు ఇస్తున్నాడు రాహుల్.

"మీ స్నేహితులు నాకు నచ్చలేదు"

రమేష్ ఆశ్చర్యంగా చూస్తున్నాడు.

రాహుల్‌కు ఏమనాలో తోచలేదు.

"ఇతను నా స్నేహితుడు రమేష్!"

భావన రమేష్ ముఖంలోకి లోతుగా చూసింది. ఆ చూపుల్లో ఏముందో రమేష్‌కు తనలోకి తనే ముడుచుకుపోతున్నట్టుగా ఉంది.

"ఈయన గురించి కాదు. ఈయన మంచివాడే కాని _ఆ స్నేహితుల ప్రభావం ఈయనమీద కూడా ఉంది."

ఇద్దరూ వెర్రిముఖాలు పెట్టారు.

"ఆ కంపెనీలో మీరు ఇమడరు. ముఖంచూసి స్వభావాన్ని గ్రహించగలను. మిమ్మల్ని వాళ్లతో చాలా సార్లు చూశాను. కాని మీకు వాళ్ల మధ్యలో ఉండటం ఇష్టంలేదనీ, తప్పనిసరిగా ఉంటున్నారనీ అనిపిస్తుంది నాకు."

రాహుల్ భావన ముఖంలోకి ఆశ్చర్యంగా చూశాడు.

"నా వయసు పద్దెనిమిదేళ్లే! అయినా నీకళ్లవయసు ఏభై పైబడింది," అన్నది అదోలా నవ్వుతూ.

అవును! నిజమే! అనుకున్నాడు రమేష్.

"వాళ్లతో మీరు తిరగడం మీకు మంచిది కాదు."

రమేష్ ముఖం ఎర్రబడింది.

"నీ బోడి సలహా ఎవరడిగారు!" అనాలనుకున్నాడు.

భావన అతని ముఖంలోకి చూసింది. అతని మనసులోని భావం ఇట్టే గ్రహించినట్టు నవ్వింది.

"రమేష్‌గారూ! మీకు కోపం వచ్చింది కదూ? నీ బోడి సలహా ఏమిటి? ఎవరడిగారు? అని అనాలని అనుకుంటున్నారు గదూ!"

రమేష్ ఆశ్చర్యంతో నోరు తెరిచాడు.

"మీరు మంచివారే. కానీ మీ దబ్బే మంచిది కాదు. మీ అలవాట్లు వీరికి నేర్పకండి." అని చరచర నడచి వెళ్ళిపోయింది భావన.

"ఏమిట్రా రాహుల్! ఈమెకు సిక్స్త్ సెన్సు ఏదో ఉన్నట్టుంది." అన్నాడు రమేష్.

"ఇంత చిన్నవయసులో ఈమె ఇంత ఎదిగిందంటే ఎలాంటి అనుభవాల ఒడిలో పెరిగిందో!" రాహుల్ చిన్నగా తనకు తనే చెప్పుకుంటున్నట్టు అన్నాడు.

"నిజమే," ఆలోచిస్తూ అన్నాడు రమేష్.

## 5

పరీక్షలు అయిపోయాయి.

రాహుల్ తెల్లవారి ఊరికి వెళ్ళే ప్రయత్నంలో ఉన్నాడు.

"నువ్వు రావా?"

"వచ్చి ఏంచెయ్యాలి అక్కడ? హాయిగా ఇక్కడే శెలవులు గడిపేస్తాను. రెండు రోజులు ముందువచ్చి నాన్నకు కన్పించి డబ్బు తెచ్చుకుంటాను," అన్నాడు రమేష్.

రాజేంద్ర, సురేంద్ర, శేఖర్ మరో ఇద్దరు మిత్రులతో బిలబిలలాడుతూ రమేష్ గదికి వచ్చిపడ్డారు.

"ఇవ్వాళ మంచి పార్టీ కావాలిరా?"

"సరుకేం లేదే?" అన్నాడు రమేష్.

"ఓ నాలుగొందలు ఇలా పారెయ్! కావాల్సినవి హనుమంతుగాడు తెస్తాడు." అన్నాడు శేఖర్.

"నాలుగు వందలా?"

"నాలుగు వందలేకదరా! కోటీశ్వరుడి కొడుకువి. పరీక్షలు అయిపోయాయి. ఆ ఆనందంలో ఆ మాత్రం ఖర్చుచెయ్య లేవా?" అన్నాడు శేఖర్.

"రెండిస్తాను. ఇంటినుంచి మని యార్డరు రాలేదు." అంటూ లాల్చీ పక్క జేబులోనుంచి రెండు వందలు తీసి ఇచ్చాడు.

"ఒరే హనుమంతూ! మంచి సరుకు తీసుకురా! కోడి పులావ్ - చిప్స్ కూడా తీసుకురా!"

"నువ్వుకూడా రారా!"

హనుమంతరావూ, శేఖర్ బయటికి వెళ్ళారు.

మిగతావాళ్ళ చీట్లపేక ముందేసుకొని కూర్చున్నారు.

"నీ ఫ్రెండు కన్పించడంలేదే? వెళ్ళి పోయాడా."

"పక్కగదిలో చదువుకుంటున్నాడు" అన్నాడు రమేష్.

హనుమంతరావు, శేఖర్ సరుకులతో వచ్చారు.

గ్లాసుల మోత! రకరకాల కబుర్లు!

రెండు రౌండ్స్ అయింది.

రామేష్ ఎక్కువ తాగలేదు. రెండో పెగ్గుకే అవుట్ అవుతాడు.

"ఒరేయ్ మనవాడు అప్పుడే గుర్రం ఎక్కేశాడు." అన్నాడు రమేష్‌ను చూస్తూ రాజేంద్ర.

"అవును! ఎక్కేశాను! ఏం ఎక్కొద్దంటావా?" తగువు పెట్టుకొనే ధోరణిలో అన్నాడు రమేష్.

"ఎక్కరా ఎక్కు! ఎవరొద్దన్నారు? అలా మాట్లాడకు మరి!"

అందరూ మౌనంగా తాగుతున్నారు.

"చ! డల్‌గా ఉంది. ఏదైనా మాట్లాడండిరా!" అన్నాడు హనుమంతరావు.

(సశేషం)

Printed and Published by A. Chandra Seker Rao at 5-9-88, Public Garden Road, Hyderabad, for YUVA Publications and Printed at Dolton Press, Public Garden Road, Hyderabad-500 001. Editor: A. SUDHAKARA RAO



కలడు కలండనెడివాడు కలడో లేడో

YUVA, JANUARY, 1982. Rs Four Regd.No.H/HD-73



లోకస్థులు లోకేశులు లోకంబులు తెగి తుది నలోకంబగు
పెంజీకటికవ్వల నేకాకృతితోడ వెలుంగు నతని నే సేవింతునే

— జగదేకమహాకవి పోతన